ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య ౨౦.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

—♦ ప్రథమభాగము ♦—



అహోబలపండితప్రణీతము.

పరిషత్పత్రికనుండి పునర్ముద్రితము.

---

కాకినాడ:
కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ
బ్రకటింపఁబడియెను.

౧౯౨౯.

వెల రు ౧.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## పీఠిక.

ఈ గ్రంథము రచించిన విద్వత్కవీంద్రుఁడు ప్రభంజనకులతిలకుఁ డగు నహోబలపతి. ఈ గ్రంథము నాశ్వాసాంతగద్యముల "ఇది... ప్రభంజనవంశాబ్ధి రాకాశశాంక...అహోబలపత్యాహ్వయ ప్రణీతంబు" అని యున్నది. మఱియు నీకవి రచించిన అహోబలపండితీయ మను కవిశిరోభూషణగ్రంథమున గద్యమందు "ప్రభంజనవంశముక్తామణినా......అహోబలపత్యాచార్యేణ" అని యున్నది. దీనింబట్టి యింటిపేరు ప్రభంజనమువా రనియుఁ గవిపేరు అహోబలపతి యనియుఁ దేలుచున్నది. కాని, మహారాజశ్రీ జయంతి రామయ్యాపంతులుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక ౧౫ వ సంపుటము ౨ వసంచికలోఁ బ్రకటించిన అహోబలపండితీయపీఠికాశ్లోకములు ౭౫ లో "వాతూలవంశేవతార భూయః" అని యు, ౭౯ లో "వాతూలవంశాగ్రణీః" అనియు నుండుటచే నీకవి యింటిపేరు "గాలివా" రని స్పష్టపడుచున్నది. ఈ విషయమై శ్రీ రామయ్య పంతులుగారు కూడ "ఇంటిపేరు గాలివారు" అనియు "కవికి మొదటిపేరు నరసరాజు" అనియు వ్రాసిరి. గ్రంథములందు, అహోబలపతి యనియే యున్నది గాని నృసింహనరసింహాదిపర్యాయపదములు కానరావు. నృసింహస్వామి యహోబలక్షేత్రాధిపతి కావున వా రట్లూహించుట సమంజసము. ఇంతియకాక ఈకవికుటుంబమువారు గుంటూరుమండలమున వినుకొండతాలూకాలోని ముమ్మడివరగ్రామమం దున్నా రని కూడ వ్రాసియున్నారు. కావున వ్యవహారమం దట్లు గాలి నరసరా జని యుండవచ్చును. ఈపుస్తకము నకుఁ గవివంశస్థులలో నొకరు ప్రతి వ్రాసినారు. చివర "స్వస్తి శ్రీవిజయాభ్యుదయశాలివాహనశకవర్షంబులు ౧౮౨౨ అగు నేటి శార్వరినామసంవత్సర మాఘ బ ౨ భృగువారం వర్కు ప్రభంజనం వెంకటసుబ్బయ్యశాస్త్రిగారి కుమారుఁడు లక్ష్మీనారాయణ వ్రాసుకున్న కాళిందీకన్యాపరిణయము" అని వ్రాసినారు. వినుకొండతాలూకా కొమ్మాలపాడుపోస్టు పిట్టబండ గ్రామమునుండి కాళిందీకన్యాపరిణయమును గూర్చి గాలి లక్ష్మీనారాయణగారు పరిషత్తున కుత్తరములు వ్రాసిరి.

కవిబంధువులు, గురువు:—

ఇంక నీవిద్వత్కవి తలిదండ్రులను గుఱించి కాని గోత్రమును గుఱించి కాని తెలిసికొనుటకు రెండు గ్రంథములందును నాధారములు లేవు, కాని, మనకవి పోలూరి మాధవయజ్వకు మేనల్లుడును శిష్యుడు నై యున్నట్లీక్రిందిశ్లోకములవలనఁ దెలియుచున్నది.

మన్మాతుర్భ్రాతరం తం సకలగుణనిధిం మాధవం భావయామః-పీఠి. శ్లో. ౫౫
ప్రణౌమి సతతం మమ మాతులం తమ్ —శ్లో. ౫౨
ధ్యాయామి మన్మాతులమ్.
పైమాధవయజ్వయే గురువై నట్లు-
మద్గురు మాధవు నభినుతింతు, కాశి. ౧-౩౦
మద్గురుం దలఁతు మాన్యుని మాధవయజ్వచంద్రముఁ-కాశి. ౧-౩౧
మోహాంబార హృదంబుజాంతరములో ముమ్మాటికిం గొల్చెదఁ
..., ... సకలశాస్త్రజ్ఞుఁ గురున్మాధవుఁ-కాశి. ౧ ౩౩
తం పోలురీవంశపయోధిచంద్రం వందామహే మాధవవిద్వదింద్రమ్ ౮౨
వందేహం త మనింద్యసద్గుణగణాధారం గురుం మాధవమ్- ౮౫
శ్రీమత్పోలూరిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫురత్సారః- ౬౯
అనువానివలనఁ దెలియుచున్నది.

ఈకవికి మేనమామయు గురుఁడు నగు మాధవయజ్వ సకలశాస్త్రపాండిత్యము కలవాఁడును, అష్టభాషాపాండిత్యము కలవాఁడు నని యీక్రింది (కా. ౧-౩౦) వాక్యములవలనఁ దెలియఁ నగును.

గీ. ఏమహాత్ముని దర్శింప నెసఁగు నతఁ, పాదకణచరజైమినివ్యాసమౌని
కపిలఫణిరాజదర్శనఘటితమోద, మతని మద్గురు మాధవు నభినుతింతు.

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జిర్కుబండ లాడి
గురుభట్టవాగ్గుంభగురుతరవనములో నింబువిహారిగ విహారంబు చేసె
యతులసాహిత్యవిద్యాచాతురీదీర్ఘికలాలితప్రీతిచే నోలలాడి
కపిలసాత్త్వవతేయఘనతంత్రవాక్సుధాధారలఁ గోరిక లూరఁ గ్రోలి
చెలఁగుయద్రసనాభామ యలఁత మాని, యతని శ్రీరామచంద్రపాదాంబుజాళి
సుజనతల్లజసన్నుతసుగుణపాళి, నభినుతించెద మాధవయజ్వమౌళి ౧-౩౨

ఈభావమే పీఠికాశ్లోకములు ౭౦-౭౫ లలో నున్నది. మఱియు నీమా

ధవయజ్వ గొప్పపండితుఁడు యీ దనపుత్త్రుఁడు నైనదక్షిణామూర్తికంటెఁ దనయం దెక్కువదయ కలవాఁడని పీఠిక ౧౫ శ్లోకములో నీకవి చెప్పుకొనినాఁడు.

ఈకవిరచించినగ్రంథములు:—కాళిందీకన్యాపరిణయము, అహోబల పండితీయమను పేరుగల కవిశిరోభూషణము నీరెండే కనఁబడుచున్నవి. ఇతర గ్రంథములు ముందేమైన బైలుపడునేమో. పైగ్రంథములలోఁ గాళిందీకన్యా పరిణయములో ౧-౭లో బ్రహ్మస్తవమును, కవిశిరోభూషణములో సరస్వతీ(నకులీ) స్తవమును "సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయం" అను శ్లోకము నను సరించి యొకభావముతో నున్నవి.

కవిపాండిత్యము:— ఈకవి తనపాండిత్యమునుగూర్చి కవిశిరోభూషణము లో నిట్లు చెప్పుకొనియెను.

శ్లో. యస్మార్త్యా కవితాకందమూలవాగనుశాసనః
జాగృతోఽహోబలపతీ రాజతే స విచక్షణః. ౭౫

శ్రీసుత్వోప్పలురిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫురత్సారః శాస్త్రవిత్ - అని.

మఱియుఁ గవిశిరోభూషణగ్రంథాంతమున "పోలూరి మాధవయజ్వన ముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణేన......అభినవనన్నయభట్టాచా ర్యేణాహోబలపత్యాచార్యేణ" అనియుఁ గాళిందీకన్యాపరిణయాశ్వాసాంత గద్యముల "పోలూరిమాధవయజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యా భరణ......అభినవనన్నయభట్టారకాహోబలపత్యాహ్వయ కవిమహోపాధ్యా యభట్టారక" అనియుఁ గలదు. దీనిచే నీకవి కభినవనన్నయభట్టనియుఁ, గవి మహోపాధ్యాయభట్టారకుఁ డనియు బిరుదు లున్నట్లును, అనేకశాస్త్రము లందుఁ బాండిత్య మున్నట్లును, అష్టభాషాపాండిత్య మున్నట్లును స్పష్టపడుచు న్నది. అభినవనన్నయభట్టబిరుద మీరెండుగ్రంథములలో నుండుటచే గ్రంథ రచనకుఁ బూర్వమే యీబిరుద మాతనికి వచ్చినట్లును, ఆబిరుదమే తనరెండు గ్రంథములందును వ్రాసికొనినట్లును, దోఁచును, లేదా, కవిశిరోభూషణగ్రంథా రంభమం దైన వచ్చియుండును.

కవికాలము:—ఈకవికాల మెచ్చటను స్పష్టముగాఁ జెప్పఁబడియుండ లేదు. కాని, కవిశిరోభూషణమునందు "గ్రంథో ఽప్యప్పకవేర్మదం దిశతు నో విద్వత్తపస్వీనాం ఘనాం"—శ్లో. ౭౨ "కాకునూర్యప్పకవినా గృహీతం— శ్లోకము ౭౧ అని పీఠికయందున్న గ్రంథమం దక్కడక్కడను, అప్పకవి నుదా

హరించుటం జేసి మన కవి యప్పకవికిం దరువాతివాం డగును 1578 శకసంవత్సర మున అప్పకవీయము ప్రారంభింపంబడిన ట్లుండుటచేత నతండు క్రీ. శ. 1657 సం॥ కుం దర్వాతివాం డనక తీఅదు.

కవిత్వము:—ఈవిద్వత్కవి కవిత్వము మంచి ధారతోను సర్వతోముఖ పాండిత్యముతోను జదువరుల కానందముం గల్గించుచున్నది.

కృతిపతి:—ఈకవి తనగ్రంధములను మనుష్యులకుం గృతి యీయక శ్రీరామచంద్రునకుం గృతియిచ్చెను. దీనివలన నీకవి శ్రీరామునందు మిగులభక్తిగలవాం డని స్పష్ట మగుచున్నది.

కవిత్వములోనివిశేషములు:—ఈతనికవిత్వములోని విశేషము లీతని కత్యధిక మగుసంస్కృతాంధ్రభాషా పాండిత్యము కల దని చాటుచున్నవి. ఇంతే కాదు. సంస్కృతాంధ్ర వ్యాకరణములందుం గూడ, గొప్ప ప్రజ్ఞ కల దనియు, వేదమునందుం దర్కమీమాంసాదిశాస్త్రములందు విశేషపాండిత్యమున్న దనియుం గూడం జెప్పుచున్నవి. మఱియు సిందలిప్రథమాశ్వాసములోని ౧౮౬ వ గద్యములో శ్రీకృష్ణరూపవర్ణన మీతని కలంకారశాస్త్రంబున నసమానపాండిత్యము కల దని నుడువుచున్నది.

ఇతరానుకరణములు:—కవి సంస్కృతాంధ్రభాషలయందుం బాండిత్యము కలవాం డగుటచే నక్కడక్కడ సంస్కృతశ్లోకభావములను నితరాంధ్రమహాకవుల భావములను గొంచెము మార్పులతోం దనగ్రంథమందుం జొన్పినాండు, చూడుండు.

శ్లో. కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్
బాంధవాః కుల మిచ్ఛన్తి పక్వాన్న మితరేజనాః- అనుదానికి-

ఉ. తల్లి ధనాఢ్యు సశ్రుతిని దండ్రియు బంధులు సత్కులీనుంగా
నెల్లరు నోదనప్రదుని నెన్నంగం గన్నియ రూపవంతుంగా
నెల్లెడం గోరు నిన్నియును నేర్తెఱం గల్గినకృష్ణుం గూర్పలేరు... ౨ ౮౦

శ్లో. పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
పుత్రో రక్షతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి-అనుదానికి

గీ. బాల్యమున మాత్రపితరులుం బ్రాయమునను
మగండు ముదిమిని దనయుండు మగువ కరయ
నధిపు లగుదురు తదధీన లగుటం గాన
మానవతులకుం దమయిచ్చ చులయం జనదు. ౨-౯౬

"కస్తూరీతిలకం లలాటఫలకే" అను సుప్రసిద్ధశ్లోకమునకుఁ జక్కని తెనుఁగు-

సీ. మృదులఫాలమునందు మృగమదంబు ధరించి యొప్పునఁ జూపరత్నమ్ముఁ బూని
నాసికాగ్రమునందు నవ్యమౌక్తిక మూని కరముల రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి రాణించు పీతాంబరంబు గట్టి
కొంతతడవు సుఖింపదు కోమలాంగి, యాత్మనాయకకమలానహాయవేష
సముచితాలంక్రియావస్తుసమితిఁ గొనుచు... ౨౯౬

మహాకవులపోకడలు, పోలికలు:—

సీ. నవనవసృష్టివైభవహేమగర్భమై సత్యలోకంబులోఁ సరసమౌ డు
నార్యాంగనామనోహరనీలకంఠమై కైలాసనగరిశైఖరి వహించు
సంతతశ్రీనివాససమ్పూర్ణ్యుదారమై వైకుంఠపురముతో వన్నె కెక్కు-
సురుచిరాలంకారసుమనోనివాసమై సురరాజునిలయంబుసొంపుఁ గాంచు
సరససౌభాగ్యవిభవభాస్వద్విభూతు, లన్నియునుఁ గూడి వర్ధిల్ల నమరి యుండు
సతతసేవాగతాష్టదిక్స్వామిపాలి, కాపురంబైన యలద్వారకాపురంబు.

కుమారధూర్జటి, ఇందుమతీపరిణయములోని ౧-౧౮౧

సీ...గీ. జగతి వైకుంఠకైలాససత్యలోక, దిగ్వరపురాధిరాజమందిరనిభ ప్ర
భావభాసితమగుచు సంపదలఁ బొదలు, సకలవిద్యాకరం బయోధ్యాపురంబు.

సీ. కేళీరతకుమారికాళీకృతవిలాసపాళీరుచిరకుంజభాసురములు
సంగీకృతస్వానసంగీతమత్తసారంగీయుతసరోవిరాజితములు
నానామణిప్రభానూనాభ్రమణిపదాధీనామితాద్రిసమ్మానితములు
గంగానదీకీర్తిభంగానుగతమహాభంగాపగావళీసంగతములు
సురుచిరామరభూరుహసుమవిరచిత, గర్భితవిరాగసురసతీకరపయోజ
లగ్నశాఖమహీరుహాగ్రగసుమములు, తీవిఁ జెలువొందునచటి లీలావనములు.

కాళిం-౧.౧౦౦

సీ. లలనాజనాపాంగవలనావసదనంగతులనాభికాభంగదోఃప్రసంగ
మలసానిలవిలోలదళసాసవరసాలఫలసాదరశుకాలపనవిశాల
మలినీగరుదనీకమలినీకృతధునీకమలినీసుఖితకోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతరనితాంతరతికాంతరణతాంతసుతనుకాంత
మకృతకామోదకురవకావికలవకుల, ముకులసకలవనాంతప్రమోదచలిత

కలితకలకంఠకుల్యకంఠ కాకలీవి, భాసురము వొల్చు మధుమాసవాసరంబు.
వసుచరిత్రము ౧-౧౩౬

ఇటువంటివిచాలఁగలవు.

ఇందున్న వేదసంప్రదాయము:—

(1) మోహాంధకార హృదంబుజాంతరములో......
"సాహిత్రీరమ్యృతాసతా" మితివచస్సంపాదితశ్రీయుతుఁ... ౧ ౩౭

(2) సీ...శ్రౌతవాక్యన నహః కేతుము ఖ్యా, భేదకముల నుపపాదించు సూర్యునిఁ
జంద్రమః పద మని చదువు లేదె. ౩-౯౭

వేదాంతసంప్రదాయము:— ౩- ౨౧

సీ నేననిర్వచనీయనిజరూప మగు చనాదిత మెలంగుచుఁ దత్త్వధీ నడంచి
వెలయు నవిద్యమై మెలఁగెద మచ్ఛబలతఁ గాంచియే యాత్మ బ్రహ్మనయ్యె
నటుగాన నాయందు నమరు కారణలక్షణం బతివ్యాప్తి దుష్టంబుగాదు
బ్రహ్మవిద్య యటంద్రు బలవత్ప్రమాణంబు మఱి గుహాశయత బ్రహ్మంబునేన
యఖిలమునునాదురూపంబుననుసరించి,నిలుచునో లేదొ చూడుఁడీనిఖిలజనము
లనెడి వైఖరి రోదసులాక్రమించి, యంధతమసంబువరఁగెభయంబువెరుఁగ.

పరతత్త్వసాధనము:— ౧- ౨౭౯

సీ. తత్స్వరూపావాప్తి దనరు జ్ఞానంబున జ్ఞానంబు భక్తిచే సంభవించు
వేదాంతవిద్యచే వెలయును సద్భక్తి యవ్విద్య గురుసేవ నందవలయు
సద్గురుసేవ నిష్కామత్వమున నబ్బు నది చిత్తశుద్ధిచే నమరు నద్ది
కాలుష్య మణఁగినఁ గలుగుఁ దద్రాహిత్య మలవడుఁ బాపక్షయంబుగాఁగ
నట్టిపాపక్షయంబు మేలానవచ్చు, దాన యాగాది సత్క్రియ లూనఁగలుగు
నవియుఁ దన్నాశకరశక్తిఁ దవులుటరిది,కర్త నిష్కామమూనసుఁ గాంచకున్న.

వ్యాకరణసంప్రదాయములు:—

1. అందుసంస్కృతవ్యాకరణము.

ఉ. వాచకశబ్దను ల్పరనిపాతముచే విలసిల్లు వాచ్యతేఁ
రోచిలుమాకుఁ దాదృశత రుచ్యముగా కితరార్థరీతిగా
నొచితిగా దటంచు మదినారసియో పరపాతనక్రియ
ల్పోచి వసించు నప్పురి నమోఘబలాన్వితము ల్హరీంద్రముల్. ౧-౧౨౩

ఓంకారంబు సవర్ణదీర్ఘయుగళీ యుక్తంబు గావింపుచుఁ
జోకఁ బ్రాస్వముఖస్వరాంకములఁ దా సూత్రంబున న్నాటఁగా

వ్యాకర్తౌముని మద్వచస్సరణి నుత్వం బచ్చుట న్యాన మం
చూకారాకృతి త్రిప్రకారముగ మ్రోయుం గాలవిన్యాసముల్. ౩-౧౩౨

2. ప్రాకృతవ్యాకరణము:—

సీ. ..................

సిద్ధసాధ్య విశేషబుద్ధస్వరూపతఁ బ్రాకృతవ్యాకృతి (ప్రకృతి యనఁగ) ౧-౨౯౦

గీ. ప్రకృతి ననుసరించి పరఁగును జగతిలో, వికృతి యిద్ది వింత వెలఁదియందుఁ
బ్రకృతి నడఁచి వికృతిప్రబలమై కనుపట్టె, నఖిలగుణసనాథ యజ్ఞనాథ.
౩-౧౬౨

3. తెలుఁగువ్యాకరణము.

సీ

సరళస్థిరకళాప్రశస్తిసద్భావత సరసాంధ్రశబ్దశాసనమనంగ... ౧-౨౯౦

క. గుణవృద్ధు లగుచు రాజిలు, ఫణిరాజశయానుబాహులు పరికించను గా
గుణిగణము సక్రమే యిది, గణుతింపఁగ వక్రతమమో కాయాది యనుచున్.
౧-౩౧౮

ఛందశ్శాస్త్రసంప్రదాయములు:— ౧-౧౦౧

సీ మత్తమయూరసన్మత్తకోకిలహంసపదభృంగవిలసితభ్రాజితంబు
హరిణీగణోత్సాహకురరీసుతస్ఫీత ముత్పలమాలికా యోజితంబు
బంధురజాతిచంపకమాలికోపేత మురుమణిగణనికరోర్జితంబు
జలధరమాలికాచారుమత్తేభవిక్రీడితరభసంకీలితంబు
మంజులసుగంధిమాలినీరంజితంబు, ననమశార్దూలవిక్రీడితాంచితంబు
లలితసుమగుచ్ఛపరిమళరాజితంబు, సుకవికవనంబునాఁబురిసొబగుఁగాంచు.

క అమరెడుకీల్జడ స్రగ్ధర, కొమరుమిగులుపిఱుఁదు దఁటప గొనబగు విపులే
కమనీయతనువు చపలే. రమణీమణి యారా వృత్తరత్నాకరమే ౧-౨౧౯

ఉ. భవ్యతరంబుగా భరణభారవలాంఛితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతయమనం బయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజిలును దైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యముదారవైఖరులు తెల్పఁగ నాకగునే విభాకరా. ౧-౩౦౯

జ్యోతిశ్శాస్త్రము:—

చ. కవిబుధచంద్రలోకహితకారకమంగళజీవ కేతువై
భవత రిపూత్కరంబు గెడపం గడఁ గూడిన "కాలసర్పయో

"గవిధిఁ" బ్రకాశ మందెను నఖండలసద్భుజదండ కాండమై
భవముల నొప్పు మాధవునిఁ బ్రస్తుతిసేయఁ దరంబె భాస్కరా. ౧-౭౮

క. కరము సుఖం బొనరు బుధ, స్మరణంబున జగతి నీకుఁ బొడమిన బుధవి
స్మరణంబు జగదుపద్రవ, కరణం బని యెన్న నయ్యెఁగా భువిఁ జంద్రా. ౩౮-౭

తర్కశాస్త్రము, ఇతరశాస్త్రములును:—

సీ. మానాదిషోడశమహితపదార్థశోధనవృత్తిఁ గల దను మునివరేణ్యు
సామాన్యముఖములౌ షట్పదార్థంబులు దెలియంగ నది యని పలుకువాసి
గర్మవిజ్ఞానము ల్గలిగించు రెండైను నిశ్శ్రేయసం బను నేర్పుఁగాని
గర్మంబు జ్ఞానాంగగతి దాల్చు జ్ఞానంబు తారకంబనియెడు తాపసేంద్రుఁ
బ్రకృతిమహదాదితత్త్వసంపద్వివేక
మమర నిర్వాణ మని పల్కునట్టివానిఁ
జిత్తసంశుద్ధి యుల(రారఁజేయు) వాక్య
వటిమ యలవడ హృద్వీథిఁ బ్రస్తుతింతు. ౧-౧౮

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జిక్కుబండలాడి... ౧-౩౧

సీ. గౌతమమునిభావకలనచే నొకవేళ నొకతఱికణచరానూనమహిమ
నురగేంద్రవృత్తిచే నొకమాటు నొకతేపఁ గపిలవాచంయమోత్కటవిభూతి
వ్యాసవిజ్ఞానసంపత్తిచే నొకపరి నొకతూరి జైమినిప్రకటవృత్తి
వల్మీకసంభవవ్యాహృతి నొకయెడ నొకసారె భరతవాగ్వృత్తిమహిమఁ
బొద్దుపుచ్చును యునజపమోటు మమర, మేటియవ్వీటినేడల మేలురత్న
పంజరంబుల నెలకొని ప్రీతియెఱుఁగక, గణనమించిన శుకశారికాగణములు.
౧-౬౪

కావ్యము, కావ్యలక్షణము:—

క. నవరసభావరుచిశోభిత, కవిరాజము సుప్రసాదఘటితము నగుచున్
ధవళాక్షి సమ్మతం బగు, కవిసత్కృతిఁ బోలు కేళికావన మొందెన్. ౨౧౫౦

సీ. క్లిష్టకల్పన లేక కష్టతాదూరమై యసమర్థత నెఱుంగ కప్రతీత
తనుమాని యప్రయుక్తతను రోసి పతత్ప్రకర్షం నైరర్థ్యకఘటన గనక
దృఢపదబంధసంధిస్ఫీతమై సుప్రసాదకాంత్యౌజ్జ్వల్యసమితి లలర
వస్త్వలంకృత్యభివ్యక్తులు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యము లనంగఁ
జెన్నుదైవాఱి చూడ్కికచ్చెరువు మీఱఁ

బుష్యరథము లసంఖ్యము లొప్పులుపుమిగులుఁ
బురవతంసంబు ద్వారకాపురములోన. ౧-౧-౨౮

నాటకము :—

సీ. రమణీయనాయకరత్నబంధూరంబు నవవిధవస్తువైభవయుతంబు
శ్రీకరాంకాంచత్పతాకాభిరామంబు సురుమంగళార్థపదోజ్జ్వలంబు
దివ్యత్ప్రపంచసంధిప్రౌఢిలసితంబు నీహామృగభిదానగాహితంబు
గగనావలంబివాక్యస్ఫూర్తిమహితంబు మధురవాక్కవిజాలమానితంబు
చిత్రసదలంక్రియాగణోజ్జీవితంబు. నద్భుతరసాఢ్యపాత్రంబు నాత్తదోష
పాటనంబును నగు చొప్పి నాటకంబు
క్రియఁ బ్రకాశించు నొకదివ్యగృహ మొనర్చి. ౩-౧౯౩

మఱియు నీతనికవిత్వమునందు సంస్కృతాంధ్రపదములు సమముగ నుండి మిగులఁ గర్ణరంజకములుగా నుండును.

సంస్కృతపదములకు :—

చ. పలికి గళన్మరందరసబంధురగంధరసాంధబంభరా
కలితరవంబులం బ్రసవకమ్రవినమ్రరసామ్రతామ్రకో
మలనవపల్లవగ్రసన మంజుకషాయితకంఠకాకలీ
కలకలకంఠ నాదములఁ గల్కి తటాలున నుల్కి యుల్కియున్. ౨-౨౩౯

కేవలసంస్కృతశ్లోకము :—

శా. నేత్రోన్మీలన మశ్రుచైత్యవిరసం నిష్కంపతాం స్విన్నతాం
గాత్రం యాతిచ హృష్టరోమచయతాం కంపైకసంపన్నతామ్
పాత్రం దుశ్చ్యవిసంగతే ర్భవతి సద్వ్యక్తం చతైశ్వర్యభా
క్ష్మితాత్మప్రభవామణే స్సుమజని గీర్వా వ్యయోగక్రమాత్ ౨-౫౬

అచ్చ తెనుఁగు :—

క. దుగదచ్చి లెక్క కిక్కగు
మొగములరాకాసితేనిముద్దుంజెలినే
ల్నిగనిగలు మిగులు మొగమున
సొగసులనగువగలునిల్వ సొగయనిదొరకున్. ౧-౪౪

సీ. ప్రామిన్కగమితెమ్మెపట్టు పట్టుగునంచ యంచతేజీతేనిఁ గాంచువేల్పు
వేల్పురాతాచాయ వెలయుచక్కనితండ్రి తండ్రి నెఱుంగకతనరుపోడ

ప్రొదచేరువకొండ్రఁ బ్రోచుమిగాఁదటిగిడ్డి గిడ్డిమందలనుండుదొడ్డజంత
జంతరక్కసికానదొంతు తేర్పెడుచిచ్చు చిచ్చుకన్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల సెకఁ జల్వఁ జూపుమేటి, మేటిపుడివాలుదాల్చిన మేలుబంతి
బంతివలె వ్రేల బలుకొండఁ బట్టెదిట్ట, దిట్టముగ నేలు నవ్విఁడు తెలివిమీఱ
౧౮౧

ఉ. తావులమీకమావిగమితావుల గొజ్జఁగనీరుయంత్రిమల్
క్రేవలఁ జిల్కఁగాఁ జిగురుఁగేదఁగి పూదడిగట్టి పట్టివేర్
పైవఱలాము చెంగలువపందిరి చెందొవరేకనంటి క్రొ
మ్మావులచందువాపొగడ మొగ్గలనిగ్గులచప్పరంబులోన్ ౨-౨౩౫

ఇందు యంత్రిముల్ అనుచోట జంత్రిమల్ అనఁదగును.

శ్లేషకవిత్వము.

గీ. అగు మహాపద్మపద్మశంఖాదినిధులు
కొలఁకు లిరవొంద నీలముకుందనిధులు
సౌధములు గుందనిధులను జాపనములు
వరనిధి యనంగఁ బురమంత వఱలుచుండు ౧-౫-౨

సీ. గుణవృద్ధిపదవృష్ణగోత్రవిఖ్యాతమై పాణిని గ్రంథంబుపటిమ గాంచి
నానాత్మజీవవిజ్ఞానకారణ మహాచు నక్షపాదీయంబు ననుకరించి
కర్మజన్యాపూర్వధర్మప్రకాశ మై జైమినివ్యాహృతిచ్ఛాయఁ బూని
సద్వైతక్షణాక్షీణసమ్మోదహేతువై వ్యాసవాచాస్ఫూర్తి వన్నె కెక్కి
కవిత నవరసఫలకమై ఘటితమత్త, శిఖిమధు వ్రతిపలసితస్ఫీత మగుచు
నసమకవిరాజకావ్యంబు ననుకరించి, చూడనింపొందున చటిమాక్రీడవనులు
౧-౯-౬

చ. సరసులపొంత హంసగణసంగతి సేయుచుఁ బద్మగహ్వరాం
తరముల నుండుచుం దనువు దాళుటకై భువిలో నదర్శన
స్ఫురణగఁ బువ్వునీరు పలుచోటుల భిక్షమొసర్చు నీకు ని
వ్విరహులమీఁద నెట్లొదవె బెట్టుగఁ గ్రోధరసంబు భృంగమా. ౩-౧-౨౬

సీ జారసంకల్పంబు దూలింపఁగాఁ జేసి చోటల మూలకుఁ జొరఁగఁ జేసి
సన్మార్గమెల్లను సుప్రకాశము చేసి పంకజావళిఁ బటాపంచ చేసి
యరిజాలముల నెల్ల నడవాయఁగఁ జేసి యాశ్రితద్విజరాజి నలరఁ జేసి

పరతమోగ్రంథుల గిరిగుహల్ సొరఁజేసి ధర్మసంస్థాపన దనరఁజేసి
ఖరకరుఁడు మున్ను చేసిన కాకఁ గాసి, యలరి సద్వర్గ మెల్లను మెలఁగ జేసి
కువలయానంద మొనరించెఁగూర్మిఁజేసి, యారఁ జల్లనిరాజు దివ్యప్రకాశి.

యమకమునకు:— ౧- ౧౧౯ ౩- ౫౮

సీ. నగరాజు నైనఁ బన్నగరాజు నైనను ధైర్యవాక్పటిమలఁ దఱుమఁగలరు
రుద్రుని నైన సముద్రుని నైనను శౌర్యగాంభీర్యాప్తి జరుపఁగలరు
ఇంద్రుతో నైన నుపేంద్రుతో నైనను భోగభాగ్యస్ఫూర్తిఁ బోరఁగలరు
అజునితో నైనఁ జిత్తజునితో నైనను నిర్మాణరూపము ల్నెఱపఁగలరు
ఘనులు నిర్వక్రవిక్రమక్రమ ముదారి, చక్రదళన క్రియావక్రజయపరాక్ర
మక్రియాముద్రనిర్భిద్రమద్రియశులు, శూద్రులప్పురిఁ గలరు విశుద్ధమతులు.

క. మృదుపద మై మాధుర్యాస్పద మై చెలిజంఘ రసము చాలఁగఁ జిలుకున్
మృదుపద మై మాధుర్యాస్పద మై యలరారు రచనవడువు గలిర్పన్.

అనుప్రాసము:— ౧- ౯. ౧-౧౭.౨

సీ. వెలుమబ్బు బలుసబ్బు వడిగొబ్బు రుచి నబ్బురం బొసంగెడు వసనంబుతోడఁ
దెలిచెట్టు వలిగట్టు వెలిపట్టు వెలివెట్టు మేలిచాయలతోడి మేనితోడ
బలుమేనితో వత్తేని చెలువేర్పడెగఁ బూనినగఁబూనుచిఱునవ్వు మొగముతోడ
ననువంకగల పొంకమునఁగొంక కళలంక కాంతు లీనెడు పువ్వుఁగబరితోడ
పీడని యపార కారుణ్యవృష్టితోడ, నింపుగ వసింపు నాహృదయంపుమేడఁ
దొంటిచదువులగమికాని యంటిగరిత, గరితరతనంబ నాయంబ గురునితంబ.

లోకోక్తులు సర్థాంతరన్యాసములు:—

అభ్యాగతః స్వయం విష్ణుః
లుబ్ధులకు సౌఖ్యం బబ్బునే స్వద్యుతిన్. ౪-౯ ౨
బడమతు లైన వారలకుఁ జక్కఁగఁ జిక్కునె సద్విచారముల్ ౧-౧౭౦
ఉచితస్థితిఁగాంచ జడుండు నేర్చునే. ౪-౧౦౭
పూఁబోఁడు లధికసాహసలు గారె. ౨-౧౪౭
జడునకు విజ్ఞాన మబ్బు నెట్లు. ౩-౧౦౫
విధాతృఁడు విధించినకార్యము రిత్తవోవునే. ౩-౧౧౫
తొలఁగ దెచట బాధ రాగదోషత గొన్నన్. ౧-౩౦౭

వర్ణనలు :— అక్కడక్కడఁ గావ్యములలో నుండఁదగిన యష్టాదశవర్ణనములును జూపెను.

కథాంశము :— శ్రీకృష్ణుఁడు కాళిందీకన్యను వివాహము చేసికొనిన చరిత్రము.

కవి తానాంధ్రవ్యాకరణమునకుఁ గొప్పవ్యాఖ్యానము చేసియుఁ గవిత్రయప్రయోగములకు మించిన దాఁటులు కొన్ని త్రొక్కినాఁడు. వానిలోని కొన్నిటిసిఁ దనవ్యాఖ్యానమున సమర్థించెను. అందు విసంధికిఁ గొన్నియుదాహరణములు:— ౩-౭ లో, నీవు-అరసి; ౧-౨౫ లో, మంజుపదము-అలభుజంగప్రయాతము; ౧-౧౧౬ లో, పొరగలరు-అజునిలోనైన; ౧ ౧౮ ౭ లో, గుబ్బల్-అప్రికృత; ఇట్టివిమఱికొన్ని గల్లవు. ఈవిషయమై తాను దనకావ్యమందు

౧-౯౮ లో "అసిద్ధోపమత విసంధితయు గుణతఁ బరఁగె నరిదిగన్.

౧-౧౮౮ లో "మానదువో విసంధితన్-" అనియుఁ జమత్కరించినాఁడు.

అహోబలపండితీయము 187 పుటలో "సంధ్యభావోపి నదోషాయ" "సంధి లేకుండుటయుఁ దప్పు గాదు" అని సమర్థించెను. ఆప్రకరణముం బట్టి చూడ నీవిసంధి వాక్యాంతపాదాంతంబులందు దోషము కా దని భావ మయినట్లు తోఁచుచున్నది.

తత్సమాచ్చులకు సంధి:—

౧-౧౭ 3 సరసతెడకల, ౨-౨౧౨ ఆపదెడసి, ౨-౧33 మన నీలవేణిదె, 3-౧3-౨ వ్యాకర్తాముని, ఇత్యాదులు చాలఁ గలవు. దీనివిషయమై అహోబల పండితీయము 189 పుటలో "సంస్కృతసమాంతస్థిత స్యాచోపి క్వచి త్సంధిః- (తత్సమపదాంతములందున్న యచ్చునకును గొన్నిచోట్ల సంధి రావచ్చును) "గంగనుకాసె- శ్రీరంగభర్తంచు-శౌరిచ్చుశుభములు. "ఇత్యాదికవిప్రయోగాత్-" అని యున్నది.

ఉత్తమపురుషైకవచనవకారసంధి :—

౧-3-౨3 ఉదయమునంది తనంతపదంబుగంటి, అందితిన్ + అనంతపదంబు.

౨-౨3౦ నిల్పితింతవడి, నిల్పితిన్ + ఇంతవడి.

3-౧౬౯ పోయితప్పుడు- పోయితిన్ + అప్పుడు.

దీనివిషయము, అహోబలపండితీయము 190-194 పుటలలో నిట్లున్నది.

ఉత్తమపురుషేతు "ప్రియస్తు స్యాత్కామాదిక స్యైతః" ఇతి సూత్రేణ

సంధిః చేసితినచ్యుతార్చనము=చేసితచ్యుతార్చనము" (పైసూత్రమున పాఠ్యః అనువదముచే) "కొలిచితినభ్థిజన్ -కొలిచి తభ్థిజన్. ఇత్యాదౌ విభాషేతి ప్రయోగశ్శో వగంతవ్యమ్."

ఇంతియకాక, యీవిషయమునఁ గవిబ్రహ్మ తిక్కనసోమయాజి భారతము విరాటపర్వములో "సైరించి తీవ్రుగాన (5-250) అని ప్రయోగించెను. దీనికి సంస్కృతభారతములో విరాటపర్వము ౭౧-౨౩ శ్లో. "అపరాధ మిమం క్షమే" అని యున్నది. తిక్కనసోమయాజికిఁ గృతియిచ్చిన కేతన దశకుమారచరిత్రములో ఆ. 7 పద్యము 52. (నేను) "పొందఁజేసితింక......ఎడయాడగఁజొచ్చెద." అనియును-పిదపఁ బ్రామాణికకవులలో నగ్రగణ్యుఁడగు నేఱాప్రెగ్గడ- హరివంశము, ద్వితీయభాగము ఆ ౮-౧౬ లో "నేను దొడరితివ్రుడు" అనియుఁ బ్రయోగించిరి.

కూఁతురి:—౧ ౧ ౦ సొంపులకూఁతురి; 3 ౧౯ ౨, 3-౧౯౪ లో, కూఁతున్ అనియే యున్నది.

మునర్ణకలోపము:—౧-౨౧ శయ్యోపకరణసంసర్గ నిలిపి. ౧-౨23 స్పర్శ, ఇత్యాదులు గలవు.

వులోపము:—౨౮ శ్రిమాంబు

మఱికొన్ని:—౨-౧౭౮ మూాయునకు. ముగు (పీనులుముఁడువచ్చి) ౨-౧౦౪ కొప్పున నున్నగా నియదు ౨-౨౨౦ నెల్లయునఁ గానిము. ౧-౨3౮, 3-౧౭౭ మతల్లికి, మత్తల్లి- 3-౮౬ చఱిక-"చఱి కగువింటిబల్మిఁ గొని సారము జాఱఁగ"-చేయు, చారు మొదలగువానివలె రూపాంతరమున్నదా, కుమారసంభవము రెండవభాగము ౧౦-౭౮౬ అచ్చరువు అని యతియం దున్నది. ఇద్దాన లక్ష్యలక్షణగ్రంథముల నొక్కకవి రచించినప్పుడు రెండింటికిఁ బరస్పర విరోధ మున్నంతమాత్రమున నాగ్రంథము లొక్కరు రచియింప లే దనునూహ నిరాకరము.

• ౧-౨౯౧"బ్రుంగితపించి తత్తనువు వీడిన" అనియున్నది, ఈగ్రంథమునందే షష్ఠాశ్వాసమున "బ్రుంగి...భూధరము" అనియే యున్నది. కావున "బ్రుంగితపించి తత్తనువుఁ బోవిడి" యనుట సరళిపద్ధతి.

౨-౧౧౫ గీ....దోసమేమి,యువతియేనియు వెన్నుని యవ్వనాఢ్య" అని యున్నది, "యెవ్వతేనియు వెన్నుని యవ్వనాఢ్య" అని తో.సవచ్చును గాని

యవ్వనపదము సంస్కృతసమాసమం దుపయోగించుట యశాస్త్రీయము కావున "అతివ యేదియు వెన్నుని యానవాధ్య" అని కాని "అతివ యెనతెయు వెన్నుని యావనాధ్య" అనికాని, లేదా "ఏవనితయేని వెన్నుని యావనాధ్య" అనికాని యనినచో సరిపోవును.

౨-౭౬ మాత్రపితరులు అనుచోటఁ మాతఁపితలు అనఁదగును.

ఛందోవిశేషములు:—

౨-౩౪ కాంతకు- తలఫోంతలు- బలోఁతలు- రోంతలు- అని దీర్ఘ పూర్వబిందుప్రాస మిందుఁ గలదు. కానియట "కాంతకు" అనుచోట మొదటిపాదమునఁ "నాతికి" అని సవరించినచో నర్ధబిందుపూర్వకప్రాస మగును. మాతృకలోఁ "గాంత" కనియే కలదు. దీనింబట్టి దీర్ఘపూర్వకబిందుప్రాసము ప్రాచీనతమకావ్యలక్షణ మనువాదము పరాస్తము.

రలయతి :—౧-౧౦౧ లో- గీ. లలితసుమగుచ్ఛ పరిమళ రాజితంబు ౧-౨౩౬ లో - రాణగాంచిన నాయింటి లక్ష్మిరావె ౧-౨౮౭ లెక్కింపఁగరాదు మాధురీగుణమనుచున్. ౨-౧౮౭ లలితవైఖరిగనయు నగ్రంబు గాఁగ.

ఈవిషయము- అహోబలపండితీయము 137-38 పుటలలో సాధించుచు. "ఏతేన రాయంచకాళ్ళఁ దొలకయమున్న" ఇత్యాదికవిప్రయోగానాం కించిద ప్యసామంజస్య మితి ధ్యేయం" అని తనభావమును సోదాహరణముగఁ బ్రకటించినాఁడు.

మువర్ణయతి:—

౨-౧౦ గను । ర్వుమ్మోయి పైఁడిదువ్వలువ మూఁత దలిర్పఁగ-

౨-౫౭ క. ముదమున లోకంబులెల్లఁ బొగడుట నిజమై-

౨-౨౧౦ ఇ । మ్మందితకుఁ దత్పదానుగత భూరిభుజంగ విషాగ్నికీల- మొదలగునవి కలవు.

ఈకవి తనశృంగార ప్రధాన మగుమహాకావ్యమునందు శ్రీమహావిష్ణువు పరతత్త్వ మనియును (1-278) అదిసాధింప జ్ఞానభక్తులు సాధన మనియును (1-281) జెప్పి విష్ణుభక్తినిగుఱించి యిట్లు చెప్పెను.

సీ. బహుసంభవార్జితబహుపాతకవ్రాతవిపినమహావహ్ని విష్ణుభక్తి
మానసరాగాదిమాలిన్యపరిహారవిమలాంబుపూరంబు విష్ణుభక్తి
తాపత్రయోదారదావవైశ్వానరవిపులధారావృష్టి విష్ణుభక్తి

చతురర్థనిక్షేపసంపాదనక్రియావిదితాంజనంబు శ్రీవిష్ణుభక్తి
సకలసత్కర్మసాద్గుణ్యసంపదలకు, వేల్పుమొదవులమేల్బంతి విష్ణుభక్తి
సద్గురుకటాక్షసముపాత్తసాధుబోధ,విద్యలకునెల్లఫలముశ్రీవిష్ణుభక్తి 3-౨౦౨

ఈమహాకావ్యమునకుఁ బరిపత్తువారె తప్రయత్నించినను రెండవప్రతి దొరకలేదు. దొరకినప్రతిలో లుప్తభాగము లున్నతావులఁ గొన్ని పూరించి వానికిఁ గుండలాకారచిహ్నము లుంచినాఁడను. లేఖకదోషము లధికముగా నున్నవి. కేవలము దుష్టము లని తోఁచిన వానిని దిద్ది మిగిలినవానికి మాత్ర కలోని స్వరూపములు క్రిందఁ జూపితిని. ఇది యాఱాశ్వాసముల గ్రంథము. ఈప్రథమభాగమందు మూఁడాశ్వాసములు మాత్రమే యున్నవి. మిగిలిన మూఁడాశ్వాసములును రెండవభాగముగాఁ బ్రకటింపఁబడును.

ఇందుఁగల మఱికొన్ని విశేషములును, ఉత్తరభాగవిశేషములును, ద్వితీయభాగపీఠికయందు వివరింపఁబడును. గ్రంథసంస్కరణమందును, పీఠికయందును గల గుణదోషములగుఱించి వేఱె మనవిచేయు నక్కఱలేకుండ నొకమహాకవి పద్యమునే యిందుఁ బొందుపఱుచుచున్నాను.

ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పనియీరస మూనఁబోకుఁడీ
తప్పినఁ దప్పు గల్గెనని తప్పనిసత్కృప మీరు దిద్దుఁడీ
యొప్పు టొకింత గల్గ మది నుబ్బుఁడు పండితులార మీకు నేఁ
దప్పనిశిష్యుఁడన్ గురులఁ దప్పనె శిష్యునకీర్తి కీర్తియున్. ౧-౨౯

ఇట్లు, భాషాసేవకుఁడు,

శ్రీపాద వాసుదేవశాస్త్రి,

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థానపండితుఁడు,

పీఠికాపురము.

# —: విజ్ఞాపనము :—

ఈ కాళిందీకన్యాపరిణయము మాతృక పరిషత్కార్యనిర్వాహక సభ్యులగు మ॥ రా॥ జయంతి రామయ్యపంతులుగారు, తాము డిప్యూటీకలెక్టరుగా నున్నపుడు వినుకొండతాలూకాలో సంపాదించినారు. కాగితపుఁ బ్రతి; ప్రాఁతగిలినది. నడుమ నడుమఁ గొన్ని పత్రములు లేవు, పద్యములు లేవు, పద్యములలోఁ గొన్నితావుల వాక్యములు లేవు, వాక్యములలోఁ బదములు లేవు. కొన్నిపదము లర్థముకాని విధమున లేఖకప్రమాదమున వైరూప్యముం బొందినవి. చూ పుట ౮౩ పద్యము ౩౫ "సంకుసకసద్గృహగ్రామసంకులంబు." ౩౧ పుట ౧౫౫ పద్యము "యతుయిగ్గుణిణస్ఫూర్తి" - ఇత్యాదులు. రెండవ ప్రతికై యత్నించితిమి, గాని, దొరకలేదు. ఉన్నదానితోనె యీ ప్రథమభాగమతికష్టముపైఁ బుస్తకరూపమున నింతమాత్రము ప్రకటింపఁగలిగితిమి. తక్కిన మూఁడాశ్వాసములను గ్రమముగ ద్వితీయభాగముగఁ బ్రకటింప యత్నించుచున్నారము

ఈ మాతృక శార్వరినామసంవత్సరము (శక ౧౮౨౨) ఆషాఢ బ౹౩ భృగువారము వఱకు ప్రభంజనము వేంకటసుబ్బయ్యశాస్త్రిగారి కుమారుఁడు లక్ష్మీనారాయణగారు వ్రాసినది. రామయ్యపంతులుగారు వినుకొండ తాలూకాలోని ముమ్మడివరమున సంపాదించిరి, కాగి, ప్రాఁతకాఁదు చివర—

సీసమాలిక. శ్రీమించుతూర్పునసిరులకుఁబట్టైనకులిశాయుధునివీడుగొట్టిపాడు
ఆగ్నేయదిశయందు నఖిలవేదాంతార్థమహిమకునిలయంబు మైలవరము
దక్షిణదిశయందుఁ దనరోలఁగూలంగఁ బెద్దజమ్మలమడక సౌజన్యమడక
నైరుతిపార్శ్వాన నరులనర్థులపట్ల పురుహూతుపురమెట్ల పూరిమెట్ల
రాజిల్లుకొండలరాయనిపాలెంబు భోజనానకుఁ గల్పభూరుహంబు
వాయవ్యదిశయందు వనర గోకనకొండ చిరతార్థిజనులకు సిరులునిండ
ఉత్తరభాగాన నున్నతస్థితిఁగాంచె నాగులవరము భూనాగపురము
ఈశాన్యదిశయందు భాసిల్లుకీర్తిచేఁ గవికల్పవల్లి కూకట్లపల్లి
అష్టపురపద్మమంతరస్థాయియైన, శాశ్వతైశ్వర్యములకెల్ల సదనమైన
ప్రబలినారాయణపురంబు పాలకడలి, పట్టిమెఱనున్న నవరత్నపథకమనఁగ.

సీ. జానకీపతి లేఁతసజ్జరొట్టెలపాలు కొంపలకప్పెల్ల గొడ్లపాలు,
సంవాసములు దొంగజాగిలంబులపాలు నయనముల్ జాగరణంబుపాలు
గట్టిపొత్తపుఁద్రాళ్ళు కట్టెమోపులపాలు మృదువైనచేతులు ముండ్లపాలు
భూరిసద్ధ్యావిధుల్ బురదనీళులపాలు నాలుక దీనోక్తిమేనుపాలు
ఘనతరస్నేహ మది ధూర్తజనముపాలు, చిత్తమే వేళ నతిదీర్ఘచింతపాలు
హరిహరీ దేహమంతయు నలంతపాలు, మైదవోలున నుండుట మాకుఁ జాలు.

అను రెండుపద్యములను వ్రాసియుంచెను. ఇందు ముమ్మడివరము కనఁబడదు. పైగ్రామములలో నక్కాలమునఁ బండితులు భాషాభిమానులు నుండెడివారేమో, కవివంశమువా రెవ్వరైనఁ గాని యితరులు గాని యీపుస్తకప్రతిని సంగ్రహించి యుండిరేమో యనునాశ కలుగుచున్నది. లక్ష్మీనారాయణగారు వ్రాసినప్రతికి మాతృక యేమై యుండును. ఎవ్వరైన నాప్రాంతములవారీపుస్తకమునకై యత్నించి సంపాదించి మాకుఁ బంపి యీపనిలోఁ దోడ్పడుమని కోరుచున్నాము. ఇక్కవి పండితుఁడు, బహుశాస్త్రవేత్త, అట్టి యతనిగ్రంథమును యథామతిఁ బరిష్కరించుట సాహసమగును. మేము రెండవభాగము ముద్రింపఁబోవునప్పటికి దీనిప్రత్యంతర మెవ్వరైనఁ బంపినచోఁ గృతజ్ఞులమై యుందు మని విన్నవించుచున్నారము.

కార్యదర్శి,
ఆం॥ సా॥ పరిషత్తు, కాకినాడ.

# విషయసూచిక.

శ్రీరస్తు

# కాళిందీకన్యాపరిణయము

## ప్రథమాశ్వాసము*

దక్షప్రణిపాత నెన్నెదన్.

సీ. నవరత్నకీలితనవ్యకంకణఝణత్కారికరాబ్జయుగ్మంబుతోడ
బంగారురంగులఁ బొంగార మెలఁగెడు కమనీయభూషితాంగంబుతోడఁ
జాయఁజెందగు(?) సేవసేయుకై వడి మేల                నివనజంబుతోడ
ముఖకాంతిజలమత్స్యములఁబోలు కన్నులఁ జుంబించు కరుణారసంబుతోడఁ
గాననగుచును నిజభక్తకల్పవల్లి, రామవామాంకతలభాసురతనువల్లి
మల్లికామృద్వి సీత (భామామతల్లి), కరుణ రక్షించు నను మమ్ముఁగన్నతల్లి.

సీ. రాముదేహమునకుఁ బ్రాపౌట నాత్మశేషత్వంబుఁ దెలుపు లక్ష్మణమహాత్ము
నతిశుచిగుణసంపదాస్పదత్వముఁ బూని నిజశంఖభావంబు నెఱపుభరతు
సద్వృత్తితామనో                నిజచక్రరూపంబు మెలపు శత్రుఘ్నువీరు
నిజకణ్వభావంబు నిజనహాదరుమాని రాముఁజేరుటఁజూపు రాక్షసేంద్రుఁ
గామరూపసమాసక్తిఖతలవృత్తి, నాత్మదివిజత్వ మంచఱ కాత్మమెఱయఁ
జేయుధన్యులనలయా(ంజనేయము)ఖ్య, రామభక్తులమదిలోనఁ బ్రేమఁదలఁతు.

క. ప్రాజ్ఞుల విశ్వునిఁ ద్రైజసుఁ, బ్రాజ్ఞుని సౌమిత్రినేషు భరతాహ్వయుని
దజ్ఞస్తుతు శత్రుఘ్నున,మాజ్ఞు న్మది నెంతు నీప్సితార్థము లొదవన్.

సీ. ప్రచ్యవత్సం(?)                త్మవిరుద్ధవర్ణాతిసంరుద్ధ మగుచు
నప్రతీతం బౌచు నతివేలముఖ్యార్థహతియాచును బ్రకర్షహాని యగుచుఁ
†బ్రతిహతవృత్తమై ప్రక్రమభంగమై వ్యాకీర్ణవాక్యసంవాస మగుచు
నవిచారితవిధేయమై                చర భిన్నమై హేయతాపన్న మగుచుఁ
గుకవికావ్యంబుకై వడిఁ గూలె లంక, యేమహాత్మునివాలాగ్ని యేర్చునపుడు
నతనిసేవింతురామనామైకశేయు, నానతవిధేయు ననపాయు నాంజనేయు.

శా. లంకాలంకృ                ణోల్లాసోరువాలాగ్ని ని
శ్శంకుండై కపిసార్వభౌముఁడు ధరాజాతామనశ్శోకధూ
మాంకజ్వాల గతావశేషముగఁ జల్లార్చె న్విచిత్రంబుగాఁ
గైంకర్యార్చితరామచంద్రుఁ డతఁ డుత్కంఠ న్నముం బ్రోవుతన్.

---

మొదట గ్రంథపాతము గలదు. †బహతవృత్తమై-మూలము.

చ. జలరుహనాభనాభిజలజాతమధువ్రతభావ మూనుటం
గలిగెను గూఁతు కేల్గొనెడు కామన మాట వహించు టారయన్
జలరుహసూతి నీ కనుచు శారద తచ్చనలాడ మాటికిం
గలకల నవ్వు ధాత మెప్పొడు మాకు నీవుతన్.

చ. కన దతిచిత్రత న్మృదులగాత్రమునం దొకగుబ్బ కర్కశం
బన దృఢసాహితీమయత నందుట మార్దవవాసగీతమై
తన రెడుగుబ్బ రెండవది దాల్చె దృఢత్వము చాల (వింతయా)
ననుచును మాటబోటికుచ మం టెడు నల్వ మదిం దలంచెదన్.

చ. అతికఠినంపుఁ దర్క మగునారయ నీమరదాళి తత్కృతా
హతులను సీత్కృతుల్ వ్వాడమె హే మధురోష్ఠము బ్రహ్మకాం
తేని సౌఖ్యముల పట్టయి తేనది యానవంచు నే
యతివ మృదూక్తిఁ బల్కు విధి *నవ్వరవర్ణిని వాణిఁ గొల్చెదన్.

సీ. వెలిమబ్బుబలునుబ్బు వడి గెబ్బు రుచి నబ్బురం బొసంగెడు వసనంబుతోడఁ
దెలిచెట్టు వలిగట్టు వెలిపట్టు వెలినెట్టు మేలిచాయలతోడి మేనితోడ
బలుమేనితోవజేనిచెలువేని దెగఁబూనినగఁబూనుచిఱునవ్వుమొగముతోడ
నునువంక గలపొంకమునఁ గొంక కకలంక కాంతు లీనెడుపువ్వుఁగబరితోడ
వీడని యపారకారుణ్యవృష్టితోడ, నింపుగ వసింపు నాహృదయంపు మేడఁ
దొంటిచదువులగమికానియింటిగరిత, గరితరతనంబ నాయంబగురునితంబ.

చ. సిక నెలకొన్న (క్రొన్నెలను) సింగపుగో రని సారె కుల్కు కై
మెకము నిరీక్షణద్వయము మేనకకూఁతురి బెళ్కుఁజూపుచా
యకు మరలించి దాని కుడియూరని సిగ్గు ఘటిల్లఁ జాపల
ప్రకటత మానఁజేయు గిరిరాజసుతాశ్రయ నాశ్రయించెదన్.

శా. పంచబ్రహ్మసమాఖ్యపంచపృథివీవాక్యాదితత్త్వాధిపో
దంచత్పంచమహార్ణశోభితసురాధ్యక్షత్వసంశోభితుం
బంచాక్షర్యభిధానమంత్రవిదితుం బంచాక్షరాద్యక్షరా
కించిద్బోధితు సాంబు నేమనములోఁ గీర్తింతు (నశ్రాంతముగ్).

చ. మగఁడు సగంబుగాఁ దపము మానక చేసియుఁ దత్ప్రియత్వముం
దెగఁగొని మేటిచట్టునకుఁ దీవ్రపుఁ గూరిమికూఁతు రేనియుం

దగు లగువారి నేరములు తాళుచుఁ గోరికె లెల్ల నీను నే
మగువలమేలుబంతి (శాంభ)వి మమ్ము నేదుతన్.

చ. అతనువిభూతి మై నలఁదినంతన తద్విజయంబు గల్గ దే
నతనువిభూతిమూర్తిమతి నై యతనిన్ జయలక్ష్మి చెందఁగాఁ
బ్రతినవహించి తద్గతిని బాయక నాయకు మై సగంబు
సుందరీమణి మనంబున నెంతు నభీష్టసిద్ధికిన్.

గీ. వత్స మొక కేల నొకట మువ్వంకకోల, శిరమునందుండు తెల్లచేసినజలంబు
పశుపతిత్వంబు నీకసంబంధమెట్టు, లనుచు గేస్తుని నగు చెలి నాశ్రయింతు.

మ. తృణ(తుల్యంబగు) బుద్ధిజాడ్యతమ మెంతే దూర మై పోవఁగాఁ
దృణమాత్రంబుగ విద్యలిచ్చి జడులన్ దివ్యత్కృపం బ్రోచు తే
గుణమా నా కని ముజ్జగంబుల కసంకోచంబుగాఁ దెల్పఁగాఁ
దృణమాత్రాపచితిం బ్రమోదిలుమహా(దేవుం బ్రశం)సించెదన్.

శా. శ్రీరామాయణకావ్యకల్పలతికాక్షీరాంబురాశిన్ మహో
దారుం బ్రాకృతశబ్దశాసను గుణాధారు న్నమస్కారసం
భార ప్రక్రియఁ దృప్తిచేసెద మహాభారత్యఖండాన్వయో
శ (ద్ధారున్ స్ఫా)ర వచోవిలాసు మదిలోఁ దార్కొందు నావ్యాసునిన్.

గీ. ధరణి కేతెంచు కవితాభిధానహంసి, కతులవిశ్రాంతిభూము లై యద్రసజ్ఞ
లనెడిసరసులు క్రమమున నబ్బె నట్టి, యార్యవర్యుల వాల్మీకి వ్యాసు నెంతు.

సీ. మానాదిషోడశమహితపదార్థ శోధనవృత్తిగల దను మునివరేణ్యు
సామాన్యముఖములౌ షట్పదార్థంబులు దెలియంగ నది యని పలుకువాని
గర్మవిజ్ఞానము ల్గలిగించు రెండును నిశ్శ్రేయసంబను నేర్పులాని
గర్మంబు జ్ఞానాంగగతిఁ దాల్చు జ్ఞానంబు తారకం బనియెడు తాపసేంద్రుఁ
బ్రకృతి మహదాదితత్త్వసంపద్వివేక, మమర నిర్వాణమని పల్కునట్టివానిఁ
జిత్తసంశుద్ధి యల(రారఁ జేయు)వాక్య, పటిమ యలవడహృద్వీథిఁ బ్రస్తుతింతు.

గీ. ముదము ద్రష్టకునొసఁగుచు మూలకార, మర్మభేదన మొనరించుమహిమగాంచు
నేమహాత్ముని దర్శనం*బిచ్చు లోనఁ, జాలఁ బ్రార్థింతు నయ్యహిసార్వభౌము.

గీ. కూడు నెవ్వానిసద్వృద్ధి గుణనిబంధ, నంబు నాద్యంతముల వివృతంబు సంవృ
తంబు వివృతంబె కడుసంవృతంబు మాన, నట్టిపాణినిమునిచంద్రు నాశ్రయింతు

సీ. త్రిప్రకారత నాత్మ దీపితంబుగఁ జేసి మూఁడుగుణంబులు మొనయఁ జేసి
పటుతరజీవికోపాయవృత్తు లమర్చి సాంగరూపక మెసఁగంగఁ జేసి

---

*పెచ్చు లోన మూ.

యుచితనానావర్ణయుక్తు లొప్పఁగఁ దీర్చి యుత్తమాధికభేద మొనరఁజేసి
మఱియు నలంకారమంజిమ ల్వెలయించి శయ్యోపకరణసంసర్గ నిలిపి
తెలివి శబ్దార్థమయకావ్యదేహరచన, చేసి నిర్దోషభావతఁ జేసి విధికి
నవమతిమొనర్చు కాళిదాసాద్యనేక, సుకవిమూర్ధన్యులనుతింతుఁ బ్రకటసూక్తి

చ. ప్రకృతియుగంబు దీర్చుమునివర్యులకు న్నముఁ జైనపుణ్యుని
న్వికృతికి శిక్షఁ గాఁగఁ బదవిద్య రచించినవాని నంధ్రవా
క్ప్రకటకవిత్వకల్పతరురాజముబీజము సర్వవాక్యశా
సకబిరుదాంకనన్నవిచక్షణచంద్రు నమస్కరించెదన్.

గీ. ప్రాణివర్ణకతద్ధర్మభవ్యనామ, సరళపరుషామహాన్మహాత్స్థిరమయాంధ్ర
వాగ్జగత్కర్త భూకవివాగ్వినేతఁ, జాఁగి మ్రొక్కెద నల శబ్దశాసనునకు.

గీ. వికృతికాధారతవహించి వికృతరహిత, శుద్ధభావత బ్రహ్మంబుసొబగుఁ గాంచి
జగములోనఁ బ్రకాశిల్లు సర్వవిదులు, నన్నయాథర్వణాద్యుల సన్నుతింతు.

గీ. ఎన్న వికృతివివేకంబుఁ గన్నవాని, కమరు భావిక్రియాజ్ఞానమనుచు జ్ఞాను
లభినుతింపఁగ వెలయు మహర్షితుల్యు, సన్నుతింతు నథర్వణాచార్యవర్యు

గీ. *సరసమతిశబ్దశాసనజాతమాత్ర, నంధ్రకవితాశిశువుఁ బ్రీతియమరఁ బెనిచి
చాలఁ బ్రౌఢ నొనర్చినచతురమతులఁ, దిక్కయజ్వాదికవులఁ గీర్తింతు ఘనుల.

ఉ. అప్పటివారలే నుతుల కర్హు లనర్హులు సన్నుతింపఁగా
నిప్పటివార లన్న నది యెంతటిమాట యఖండపండితుల్
దప్పని కారణంబు లగుఁ దద్భజనంబున కంచు నెంచి నే
నిప్పటిపండితోత్తముల నెంతు నిరంతరభక్తియుక్తతన్.

మ. గుణదోషంబులఁ దెల్వి లేనిఖలులం గోపింపఁ గీర్తింపఁగా
నణుమైనం బనిలేదు దోషములయం దత్యంతసాధుత్వమున్
గుణజాలంబుల దోషభావముఁ గడుం గూర్పంగ నేర్పొప్పు స
ద్గుణవత్పండితమౌళిసన్నుతిఁ గొనం గోర్కుల్మదిం బుట్టెడున్

ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పనియారస మూనఁబోకుఁడీ
తప్పినఁ దప్పు గల్గె నని తప్పనిసత్కృప మీరు దిద్దుఁడీ
యొప్పు టొకింత గల్గ మది నుబ్బుఁడు పండితులార మీకు నేఁ
దప్పనిశిష్యుఁడన్ గురులఁ దప్పనె శిష్యునకీర్తి కీర్తియున్

---

*ప్రకటమతిశబ్దశాసనజాతమాత్ర నంధ్ర-మూ.

గీ. ఏమహాత్ముని దర్శింప నెసఁగు నఘ, పాదకణచర జైమినివ్యాసమౌని
కపిలఫణిరాజదర్శనఘటితమోద, మతసి మద్గురు మాధవు నభినుతింతు.

చ. కొదవ తెలుంగ కెప్పుడు నఖండతమహాహ్లాదయుతైభవంబు వే
పొదలఁగ భూరిసత్కళలు పూని తమోహతిలేక యార్జవం
బొదవఁ గళంకిత స్వదలి యూర్జితవాగ్మిజయోగ మింపుగా
మదిఁగొను మద్గురుం దలఁతు మాన్యుని మాధవయజ్వచంద్రముః

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జిక్కబండ లాడి
గురుభట్టవాగ్గుంభగురుతరవనములో నింబుమీఱఁగ విహారంబుచేసి
యతులసాహిత్యవిద్యాచారుదీర్ఘిక లాలితక్రీడచే నోలలాడి
కపిలసాత్త్వవతేయఘనతంత్రవాక్సుధాధారలఁ గోరిక లూరఁగ్రోలి
చెలఁగుయద్రసనాభామయలఁతమాలి,యతనిశ్రీరామచంద్రపాదాంబుజాళి
సుజనతల్లజసన్నుతసుగుణపాళి, నభినుతించెద మాధవయజ్వమౌళి.

శా. మోహాంబోర హృదంబుజాంతరములో ముమ్మాటికిం గొల్చెద
న్మోహాదిప్రతిషిద్ధదోషగుణసమ్మూర్ఛానిరాసక్రియా
సాహిత్యప్రతిపన్నచిద్రసఝరీసంబంధకృన్మానసు
"న్సాహిశ్రీరమృతా సతా" మితి వచస్సంపాదితశ్రీయుతు
న్సాహిత్యాంబుధిపారగు న్సకలశాస్త్రజ్ఞు న్గురు న్మాధవుః

గీ. ఎవ్వనియశంబుజగమెల్ల నెనసిచుట్టు, కొండయవ్వలితమమెల్లఁగొదవపఱుప
నల్పమాధేయమనిపల్కదధికభూష,యతనికొనరింతునతిమాధవార్యమణికి.

గీ. ఏకదినమేళనంబూను నెపుడుఁబూర్వ, పక్షలాలితిఁగొను గళల్పదియునాఱుఁ
ధాల్చుశశి నవ్వు నుతచతుర్దశకళైక, హారిఁ బ్రార్థింతుమాధవయజ్వచంద్రు.

క. కవివాక్పతులై యెవ్వని, సవిధస్థితులైనపురుషసత్తము లెల్లం
గవివాక్పతులం గేరుదు, రవురా నుతియింతు నతని నస్మత్స్వామిః

ఉ. వైదుషి లేకయే కవిత వచ్చె నటంచు వచించువారలం
గా దనఁగూడ దె ట్లనినఁ గాకవిపల్కెడు శాస్త్రవాగ్విసం
వాదిదురుక్తుల న్వినఁగఁ బండితమౌళికి మోముదామరం
బ్రోదిగ నవ్వు దేనియలు పుట్టును రూపక మంగితం బొనః

గీ. దుష్టకవిత నిషేధించు దొరలసభలఁ, గలుగు పత్కవివరులకు ఘనయశంబు
తద్యశంబునకరయంగ దాతయగుటఁ,బండితామాన్యునకు నేనిప్రణతిఁ దె.

వ. అని యిష్టదేవతానమస్కృతియు సనాతనాధునాతన సత్కవీంద్ర గురుచంద్రపురస్కృతియుఁ గుకవితిరస్కృతియు నొనరించి నే నొక్కబంధురప్రబంధనిబంధనాయత్తచిత్తుండ నగుచు, నిప్పు డొనర్పంబూనిన సకలసద్గుణాలంకారసంపన్నం బగునిక్కావ్యకన్యారత్నంబునకుం దగిన నాయకరత్నం బఖిలదేవతాశిరోరత్నం బగు శ్రీరామభద్రుం డగు నని పురాతనకృతిసుకృతజనితమహాభాగ్యాతిశయంబువలనఁ దెలిసినవాఁడ నగుచు నప్రమేయప్రభావుం డగు నమ్మహానుభావునకు షష్ఠ్యంతంబు లగు పద్యంబులు విన్నవించెద.

క. వీరాదివీరునకు నని, వారితసద్ధైర్యశౌర్యవచ్ఛత్రుచమూ
మారణకారణదారుణ, భూరిబలోదగ్రునకును బుధితోగ్రునకున్.

క. మిత్రాన్వవాయనలినీ, మిత్రునకుఁ గటాక్షితాత్మమిత్రునకు ధుతా
మిత్రునకు వృత్రశత్రుజ, మిత్రతనూజాతశత్రుమిత్రాఖ్యునకున్.

క. మాయాగృహీతమానుష, కాయునకుం గుశికతనయకర్తృకయాగా
పాయపరపరహితాకుచ, వైయర్థ్యవితానకీర్తివరదాయునకున్.

క. రామునకు నింద్రనీల, శ్యామునకు నరాతిసోమసంఘాతఘన
స్తోమసమీరున కత్యభి, రామగుణారామునకును రఘురామునకున్.

క. దుగదచ్చిలెక్క కిక్కగు, మొగములరాకాసిజేనిముద్దుంజెలిమే
ల్మిగనిగలుమిగులుమొగమున,సొగసులనగువగలునిల్పుసొగయనిదొరకున్

వ. అభ్యుదయపరంపరాభివృద్ధ్యర్థంబుగా లీలారాజన్యసార్వభౌముం డగుచు రామరూపంబునం బ్రకాశమానుం డగు నద్దేవతాసార్వభౌమునకు నంకితంబుగా నొనరింపఁ బూనినకాళిందీకన్యాపరిణయం బను మహాప్రబంధంబునకుఁ గథావిధం బెట్టి దగు నట్టివిధం బభివర్ణించెద.

—: కథాప్రారంభము :—

సీ. నవనవసృష్టివైభవహేమగర్భమై సత్యలోకంబుతో సరసమాడు
నార్యాంగనామనోహరనీలకంఠమై కైలాసనగరివైఖరి వహించు
సంతతశ్రీనివాసస్ఫూర్త్యుదారమై వైకుంఠపురముతో వన్నెకెక్కు
సురుచిరాలంకారసుమనోనివాసమై సురరాజునిలయంబుసొంపుఁ గాంచు
సరససౌభాగ్యవిభవభాస్వద్విభూతు, లన్నియునుగూడివర్ధిల్ల నమరియుండు
సతతసేవాగతాష్టదిక్స్వామిపాలి, కాపురం బైనయలద్వారకాపురంబు.

## ప్రథమాశ్వాసము.

క. ద్వారవతీపదము ప్రశ, స్త్యారూఢ*మతంబుగాంచు నది సర్వమహో
దారసురాసురమానవ, పారము లేవేళ నర్థి†వసియించుటచేఁ.

చ. పగడపుదారబంధములుఁ బచ్చలచూరులుఁ బద్మరాగపుఁ
జగతులు వజ్రవప్రములు సానలఁదేఱిన కెంపుఁగంబము
ల్నెగడెడు నీలవేదికలు నిగ్గులుదేఱెడు రత్నవాటిక
ల్సొగసువహింప నప్పురము శోభిలుఁ బట్టణరాజరాజమై.

మ. ధర నప్పట్టణరాజ మంబరగతాత్మచ్ఛాయ నానాకముం
బరఁగం దోయధినీటఁ దోఁచుప్రతిబింబస్ఫూర్తి నభోగిరా
ట్పురముంగ్రమ్మి త్రివిక్రమత్వమున నొప్పున్ సాంప్రతంబేకదా
హరి యందుండుఁగదా త్రివిక్రమసమాఖ్యం బ్రీతచేతస్కుఁడై.

ఉ. మేలిమిరత్నదీధితుల మిన్నులు ముట్టెడు గోపురాళి నే
వేళఁ జరించుతమ్మునికి వేడుక నప్పురలక్ష్మి రక్షగా
నీలపురేకుఁగట్టె నది నేఁడును గానఁగవచ్చు దానినే
చాలనిబుద్ధి లోకము శశం బని పల్కును జందమామలోన్.

గీ. వఱలునప్పురి బలితంపు వార్ధిపరిఖ, రత్నగర్భాదిశబ్దము ప్రాజిలంగ
నబ్ధిమేఖల గాకున్న ననువుగాద, టంచుఁ దదభూషణంబు భరించె ననఁగ.

క. అతిరుచిరచంద్రకాంత, ద్యుతిమై కవియుతము విబుధతోషాకరమై
హితసకలవస్తునికరో, ర్జితమై పురి కల్పవల్లిచెలువు వహించెన్.

గీ. ప్రచురరోచిస్సమాలీఢ బాడబంబు, భూరినవరత్నరాశిసంపూరితంబు
హరినివాసంబు చిత్రసత్త్వాశ్రయంబు, నగుచునప్పురిజలరాశినగుచునుండు.

మ. రతికాంతాంతవిభూతి సంతతతనుప్రాంతోపగూహక్రియా
రతికాంతం బయి శేఖరామరధునీరమ్యాంబుసమ్మోద మై
ప్రతతైశ్వర్యవృషాంక మై నటన దీవ్యన్నీలకంఠంబు నై
శ్రీపతిలేకొప్పు శివస్వరూపవిభవప్రాప్తిం బురం బెప్పుడున్.

క. సకలాలంకృత యయ్యుం, బ్రకటవిశేషోక్తి విబుధరంజన మగు హం
సకరుచిర పదంబై, యకలంకస్ఫూర్తి మీఱు నప్పురి జగతిన్.

మ. ప్రకటౌదార్యవిశేషకాంతి సమతార్థవ్యక్తి సౌశబ్దరూ
పకసారాధికచిత్రచిత్రలిపిసంబంధంబు శ్రీకృష్ణనా

---

* మతుండుగాంచునదె-మూ. † వసియించుటయే. మూ. ‡ శ్రతిలేకొప్పు-మూ.

యక వైశిష్ట్యనితాంతభాసురము నై యప్పట్టణం బొప్పుఁ దా
నకలంకుల్ (ముదము)ంద సత్కవితఁ గావ్యంబుంబలెం జూడఁగన్.

క. హరిదశ్వుఁడు తనయరదము, సరణి పురీసౌధములను సంకటపడుట
స్వైరవమర నొంటిగుఱ్ఱము, సరదమునకు నేకచక్ర మమరించికొనెన్.

ఉ. పచ్చలగో(పురంబు) జిగి పచ్చిక యంచుఁ దలంచి వచ్చు లో
మచ్చికజింకఁ బట్ట వడి మై శశి యూఁకువ సేయఁ జంద్రుమై
నిచ్చలు జాఱు నయ్యమృత మింౘుక సోఁక సచేతనాకృతుల్
హెచ్చిన పైఁడిబొమ్మలకు నింతులకు (న్గనరావు భేదము)ల్.

సీ. గోపురోపరిఖేలకోకస్తనులగొప్పవిప్పకప్పమిటారికొప్పు లబ్బు
రంపు మబ్బు లటంచు రమణుల నున్నమేనుదీఁగెలు గ్రొమ్మించుఁదీఁగె లనుచుఁ
గరికరముక్తగంగాజలశీకరాసార లనుచుఁ
దదుదారతరబృంహితంబులు బలుగర్జితంబు లంచుఁ దలంచి యంబుధరము
లలనలువస్త్రాధికారమన్యులకునిచ్చె, విచ్చెమాగచ్చులనిమదినొచ్చినొచ్చి
వర్షగర్జితమిషము ములుక, వఱలు మేడలక్రిందటనొఱలుచుండు.

చ. సురతరు లంతికస్థలులఁ జొప్పడ నందలి దివ్యభూషలా
తరుణు లొకప్పు డొక్కటియుఁ దాల్పఁగఁ జూడ రలక్ష్య మాటచే
సురుచిరభూష లొల్ల మటు చూచుచు గ్రమ నైనయ
త్తరువులపుష్పము ల్గొనరు తద్దయు వాడినవంచు నచ్చటన్.

ఉ. మేడలయందు నిచ్చలు భ్రమించుకలాపులు డాయఁ జూచి యు
య్యేడుగుఱాలతేరియురగేశ్వరరశ్ములు వాఱ వాని వె
న్నాడఁగఁ గుంటిసారథికి నబ్బమి వే పయనంబు సాగమిం
దోడనె తానె పోయి వడిఁ దోయజబంధుఁడు వట్టు రశ్మలన్.

చ. పడమటివెట్టకు న్వెఱచి భామలు సోరణగండ్లు మూయ న
క్కడ గతి నిల్వఁ గాక వడిఁ గ్రమ్మినఁ బోనిడఁ బోవుచుండఁగాఁ
గడుఁ గనిపించె మందగతి ఘర్మమరీచికి గ్రీష్మవేళ న
జ్జడత చిరార్జితం బగుట సంగత మయ్యెడు నిప్పు డేనియున్.

చ. పురిగరుడాశ్మసౌధరుచిపుంజము ఘాసమటంచు నెంచి లో
హరిణము చౌకళింప శశి యాత్మమనోహరవక్త్రపంకజ
స్ఫురదుపమానవృత్తిఁ గొనఁ జూడఁగఁ జాలక కజ్జలంబుచేఁ
దరుణులు కప్పెనర్చి రది తప్పక చందురునందు *నుండఁగన్.

క. బాలికలు డాఁగుమూఁతల, వేళల సౌధములయందు వెతకెడువారిన్
లీలఁ గికురింతు రచ్చట, మేలిమిబంగారుబొమ్మ మెలఁకువ గొనుచున్.

క. అచ్చటి మదిరాక్షులు నై, యచ్చరికన్యకలు నాట లాడఁగ భేదం
బిచ్చుఁ గనవయ్యెఁ జూపఱ, కచ్చపుఁగను ఱెప్పపాటు లందమిఁ గొనుటన్,

చ. అనుదిన మింద్రనీలమణిహర్మ్యరుచిప్రతతీతమిస్రసం
జనితహరిద్భ్రమాకులత సౌధగవాక్షముఖ ప్రచారవృ
త్త్యనుగతభేదము ల్పడల నంబురుహాప్తుఁడు దక్షిణోత్తరా
యణములఁ బోయెఁ గాన నిపు డవ్విధమె యాతని కిష్టమార్గముల్.

ఉ. మానితదివ్యరత్న గణమండిత సౌధతలంబుల న్సుఖా
సీనత నుండు నెచ్చెలుల సిబ్బెపుగుబ్బలు డాయుసత్ఫల
వ్యానతికల్ప శాఖల ఫలావళిఁ దున్నుదు రంచితస్ఫుర
త్పీనపయోధరప్రతిమఁ దేలఁగరాఁ గడు నీసుచే బలెన్.

ఉ. నెన్నెలకుప్పలాడు నెడ వేలుపుటింతులు దీము గెల్పుచేఁ
గొన్న యనర్ఘ రత్నములు గోరికి మీఱఁగ నీరు మేడపై
నున్నపయోజగంధులకు. నొప్పఁగ వీరు జయించి వారిచేఁ
గన్న యనర్ఘ రత్నములు గల్గినచోట గ్రహింప రేమియున్.

చ. కడుమిగులారు సౌధములఁ గంజదళాక్షులఁ గూడి యాడుచు
న్మెడఁ గలసొమ్ము గన్గొనుచు మెచ్చుచుఁ గోరసి దేవకామిను
ల్నుడువఁగలేరు వారిమది నూల్కొను కోరిక దీఱ భూషణం
బిడక మెలంగు నెచ్చెలువ యెంచఁగ నొక్కతయేని లేదటన్.

క. అన్నగరిలోని వజిరపు, మిన్నా సౌధములు డాసి మింటం జనుచుం
గ్రొన్నెలతద్రుచు లెనయుచుఁ, బున్నమనాఁ డంటికొన్న పోఁడిమి గనియెన్.

చ. మృగమదచిత్రకంబు గొను మేలుమొగంబుల తేట చూడఁగా
మృగధరదర్పణంబు గని మీఱనవిలోచన లెల్లఁ దుల్యత
న్మొగములు గానరామి మది మూల్గొను నీసున నీళళంకిచే
నగు నిటు లర్థబోధ యని యద్దము చూతురు వేడ్క మీఱఁగన్.

క. పిన్నలమొన కగుఁ బులిగో, రన్నన్న యటంచు మెచ్చి చంబుజపాణుల్
క్రొన్నెలఁ బట్టుచు మార్దవ, మన్నను లేదనుచు విడువ నరుగు న్నెలయున్.

చ. అరచలిగట్టు మానుదురు లందము గాంచునొ కానలేఁడొకో
యరయుద నుంచు నెన్నుదురు లందముమీఱఁగ నందు నిల్పుచు

దరుణులు నొచ్చి ఫాలములు దాఁ గటికించు విడంగఁ బోవునా
యురనెల యిన్మృగీమదము నంటినమేను గృతార్థతం గనన్.

మ. తరుణీమంజులలోచనాంచలమిలత్తారళ్యలాలిత్యముల్
గన మ్రబంబుగఁ జూచి సిగ్గువడుచుం గన్నుల్మొఱుంగ న్సుధా
కరులో జింక చలింపకున్కిఁ గనియె న్గాకున్న సౌధాగ్రవి
స్ఫురదుచ్చావచసింహపుత్రికల పెంపుల్చూచి కాలూఁదునే.

చ. జనములు శూన్యముల్ శశివిషాణముఁ బోల్తురు కల్మిలేమియుం
గననగు నంచు హస్తకటకంబుల పచ్చలడాలు ఘాసమున్
చనువుగ మూరుకొంచు వినతానన నూ శశిలో శశంబుఁ జే
ననగొననంటి చూచుకు మసంబున నోతుక మొప్పఁ గన్నియల్

క. జలజాక్షులు ముఖరాగం, బుల తా తెల్లం గరంగఁ బూనఁగ నాస్లో
పలమాత్రముఁ గరఁగించిన, నెల పాటియె యుట్టినదన నీరజముఖులకున్.

క. పురగోపురహైమాంబుజ, పరిరక్షణసేయు దేవపతికరివలనన్
హరిమధ్యామధ్యంబులు, హరివిభ్రమ మొదవఁజేయు ననుదిన మచటన్.

గీ. గంధవతిపంకవతి యన గగనగంగ. గుణముదోషంబువింతగాఁగూడుకొనదె
సౌధకోకస్తనీతనుస్నానగళిత, దివ్యచందనపంకం బుదీక్షమగుట.

చ. గగనము నొందునేటఁ బురకాంతలు సంతస మొప్పఁ గ్రుంకఁగా
మొగములు వింతతమ్ము లని మూఁకొన మూఁగును దేఁటిగుంపు లిం
పగు నదిలోని హైమజలజావళి రోయుచుఁ జారునాసిక
న్సొగసులచంపకంబు లని గ్రుక్కుచు మూఁకొనలేవు భీతిచేన్

క. పురిసౌధచిత్రరత్న, స్ఫురదమిత విభాకదంబ పుషితము లగుచుం
గరము లిరవొందెఁ గావున, హరిదశ్వుఁడు చిత్రభానుఁ డనఁగా బరఁగెన్.

చ. గురుతరగారుడాశ్మకృతకుట్టిమభూముల గొండ్లిసేయున
త్తరుణులనవ్యగానము మునంబున వించుఁ జలింపకుండెఁగా
కరుడె పయోజబాంధవరథాశ్వశకృత్ప్రతిరశ్మి తెల్లన
వ్వరమణిజాలదర్శనము వాటిల గాటపుభీతిఁ బోవుటన్.

గీ. అగు మహాపద్మపద్మశంఖాదినిధులు, కొలఁకు లిరవొంద నీరముకుందనిధులు
సౌధములుగుందనిధులనుజాలకములు, వరఃస్థియసంగఁ బురమంతవఱలుచుండు.

---

మూలమునలోఁ గలుతాలు "గింక" యని = వ్రింగు గున్నది. † శేసియనుదిన- మూ.

## ప్రథమాశ్వాసము.

చ. తరుణీరత్నమనోజ్ఞకంఠనవరత్నస్ఫారహారంబు ల
చ్చెరువుం జక్కెరవింటికయ్యముల విచ్ఛిన్నంబుగా జాఱు న
వ్వరరత్నంబులు శోధనీముఖముచేఁ బ్రాభాతవేళం జెలుల్
శరధిం జాఁపఁగ నాత్మరత్ననిధియన్ సంజ్ఞంగను న్వ్యాప్తియున్

చ. చెలువలు మేడలోఁ జెలిమిచే నిడుసొమ్ము భరించి వేల్పురా
చెలువలు చిత్తరంపడుచుఁ జెల్వగుసొమ్మది వేడఁబోయిన
న్వలనెఱఁ బాఱెఁ గల్పకము వేలుపుగిడ్డియు మోము మోడ్చెఁ గే
వలము ఫలస్వభావమున నట్టిలె నిర్జరలోకరత్నమున్

శా. కేళీభూధరము ల్విరాజిలుఁ బురిం గేళీవిలోలాంగనా
పాళీచారుతనూపరీమళమిళత్పాథఃప్రపూరాపగా
నాళీకాక్షులఁ గాంచి తోయనిధికి న్నవ్యప్రమోదంబుగా
హాళిం బెండ్లి గొనర్చి పూర్వసరిదాస్వాదంబు ప్రసక్రించుచున్.

క. ద్వారకచుట్టు మెలంగెడు, వారివిశేషమునఁ దద్రసాదరజాలో
దారనదులంటఁ దోయధి, కోరికతోఁ గ్రొత్తపెండ్లికొడుకై యలరెన్.

క. అరు దందుచుఁ బుయ్యందము, నిరతంబును నిర్నిమేషనేత్రదళులై
పగఁగెడుకన్నులఁ జూడఁగ, సురలు నిమేషంబు నిద్రసోఁగయుచు దాఁపన్.

లయగ్రాహి. ఇందుమణివేదికల యం దొకసరి యిందుముఖు
లందమగు గానముల నిందువఁగు నెల్లం
బొందుగఁ గరంగ నట సుందరపు మోముజిగి
చందములు చూచుకొని చందురునియందీ
చందమగు పొందికలు చెందినవొ లేవొ కనుఁ
గొందమని చూచి బెళుకందవు కరంటం
జెందదిది జింకసరి సందడిక నిందుఁడని
సుందరులు గేలిగయికొందురొగి పీటన్.

క. అర్థపతియైన సిరిషే, యర్థివదాన్యులకు నప్పురాగ్రణి నర్థం
బర్థులు వేఁడినయప్పుడె, యర్థులఁ జేయుదురు వారి నతిచిత్రముగన్

చ. తెలుపగ నర్థివాచకపదంబుల గౌణత గాంచె దాతలం
బలుకుపదంబులొప్పి మముఁ బల్కెడిశబ్దములందు గౌణత
న్నెఱఁగు నటన్న మేము మదిమెత్తుము వ్యత్యయమైనఁగాక యం
చలరుదు రందు దాతృలును నద్భుతవస్తువితీర్ణసంపదన్

క. అతులప్రసాదగంభీ, రత లర్థవ్యక్తి మధురరసముల రసవా
క్కృతులనఁగ సరసులొప్పె, న్నతితము సరసులకు మనము సరసతనలరన్.

శా. సాయంకాలనటన్మహేశజటాసంగంబుచే నావిల
ప్రాయంబై జగి మానుగంగ యట సౌవర్ణాబ్జనాళీ ల్గిన
న్మేయంజిత్త మిగుర్పఁ దత్సరసి యామిన్నేటిమిన్నా సిత
చ్ఛాయా మేచకఖగంబు లప్పురిసరస్సంవాసముల్ గైకొనున్.

ఉ. మేడల గాయను ల్మిగుల మెచ్చఁగ గానము సేయఁ దచ్ఛ్రుతి
న్వేడుకనుండు *హూహూహుకయిపీడని వీణియదండ మప్పుడే
కూడిప్రవాళవత్త్వ మదిగోలె ఘటిల్లెఁ బ్రవాళసంజ్ఞ యా
జాడనె దండమాత్రమున సంధిలె నెన్నఁ దదాఖ్యయే భువిన్.

సీ. గౌతమముని భావకలనచే నొకవేళ నొకతఱి కణచరానూనమహిమ
నురగేంద్రవృత్తిచే నొకమాటు నొకతేపఁ గపిలవాచంయమోత్కటవిభూతి
వ్యాసవిజ్ఞానసంపత్తిచే నొకపరి నొకతూరి జైమినిప్రకటవృత్తి
వల్మీకసంభవవ్యాహృతి నొకయెడ నొకసారె భరతవాగ్వ్యక్తిమహిమఁ
బ్రొద్దుపుచ్చును యువజనమోద మమర, మేటియప్పీటి మేడల మేలురత్న
పంజరంబుల నెలకొని ప్రతియెఱుఁగక, గణనమించినశుకశారికాగణములు.

చ. అతిమధురంబులౌ ఫలము లబ్బియుఁ బువ్వులులేమి దుర్యశం
బతిఘనమంచు సర్వకుసుమాస్పదతం గనె నన్నమాడ్కి మా
రుతగతిఁ బైకివచ్చిన తరుప్రసవంబుల రాజిలు న్నవ
స్ఫుతు లగువృక్షము ల్పురముపజ్జల నొప్పువనాళి నెప్పుడున్.

సీ. కౌశికమందారఘనతమై రావతభూషితం బయిసురపురముమాడ్కి
మాధవీపున్నాగమహనీయరూపమై ఫణిరాజశాయిపట్టణమురీతి
స్థితమహైమవతీకుమారకశివాస్పదమామఁ గైలాసపదముకరణిఁ
బ్రచురప్రతానసపంకజాసనసదాలంబమై సత్యలోకంబువగిది
వెలయు నప్పురిలోపల వేలకొలఁది. యలసపవమానకంపితవిలసదసమ
కుసుమవిసరవిస్సరత్కుసుమరసత, రంగిణీపుష్పవార్ధినీరములు వనులు

సీ. గుణవృద్ధిపదవృద్ధగోత్రవిఖ్యాతమై పాణినిగ్రంథంబు పటిమఁగాంచి
నానాత్మజీవవిజ్ఞానకారణమామై నక్షపాదీయంబు ననుకరించి

*హాహాలు మూ

కర్మజన్యాపూర్వధర్మప్రకాశమై జైమినివ్యాహృతిచ్ఛాయఁ బూని
సద్వీక్షణాక్షీణసమ్మోదహేతువై వ్యాసవాచార్భటి వన్నె కెక్కి
కవితానవరసఫలకమై ఘటితోన్మత్త, శిఖిమధువ్రతపికలసితస్ఫీతమగుచు
ననుమకవిరాజకావ్యంబు ననుకరించి చూడ నింపొందునట్టియాక్రీడవనులు

క. అమితధ్వనివైచిత్రియుఁ, గ్రమహీనత్వాదిదోష (రహిత)ము వని కా
వ్యము సరిగఁ బరఁగె నసిద్ధో, పమతి విసంధితయు గుణతఁ బరఁగె నరిదిగన్

సీ. బహువిధాలంక్రియాపదసజాకారమై యుపమోపమఁ బొచు నొప్పుగాంచి
కవితల్లజప్రౌఢి కవిశోక్తి ధుర్యమై యతిశయోక్తి విలాస మాదరించి
యుత్తరోత్తరసునస్సూత్కృష్టలలితమై సాభూషాగీతిఁ జొకళించి
యనుపమఫలమనోహరభావమగు, చనన్వయభూషణంబు గర్వమువహించి
తనరు నుద్యానవిపినకదంబకంబు, శాఖశాఖాశిఖా హతి జర్జరితశ
శాంకతనుగళదమృతధారాకృతశ్రవ, వాహపూరితపితతాలవాలకంబు

సీ. కేళీగతికమారికాళీకృతవిలాసపాళీరుచిరకుంజభాసురములు
నంగీకృతస్నానసంగీతమత్తసారంగీయుతసరోవిరాజితములు
నానామణిప్రభానూనాభ్రమణి పదాధీనామితాద్రి సమ్మానితములు
గంగానదీకీర్తి భంగానుగత మహాభంగాపగావళీసంగతములు
సురుచిరామరభూరుహానుమవిరచిత, గర్భితవిరాగసునసతీకరపయోజ
లగ్న (శాఖావహీరుహాగ్ర) గసుమములు, గీవిఁ జెలువొందునట్టి లీలావనములు.

సీ. మత్తమయూర సన్మత్తకోకిల హంసపదభృంగ విలసితభ్రాజితంబు
హారిగన్ధోత్సాహ కురరీయుతస్ఫీత ముత్పలమాలికాయోజితంబు
బంధురజాతీ చంపకమాలికోపేత మురుమణిగణనికరోర్జితంబు
జలధరమాలికా చారుమత్తేభవిక్రీడితరథస సంకీలితంబు
మంజుల సుగంధి మాలినీ రంజితంబు, నసమశార్దూలవిక్రీడితాంచితంబు
లలితసుమగుచ్ఛ పరిమళరాజితంబు, సుకవికవనంబు నా బురి సొబగుఁగాంచు

సీ. పటురోషకృత కేశపాశతాడనములు బహుళకోపార్జితపాదహతులు
దోర్వల్లరీకృతాఖర్వవేల్లనములు కందుకారచితసంఘట్టనములు
వక్షోజగిరికల్పితక్షోభణంబులు నక్షీణనఖరదంతక్షతములు
గాటంపు గండచపేటపాతనములు కచచయాంబరసమాకర్షణములు
బంధవిధములు మణితనిస్వానభిదలు, భాగవిపరీతగతులును బ్రబలియుండుఁ
దత్పురంబున నిక్షుకోదండదండ, ధారికదనావసరముల దంపతులకు.

క. సరసధ్వను లుప్పొంగఁగ, వరగుణవిచ్ఛిత్తిగా నవారణ జాతిం
బరిమళితభూషణంబులు, సురతనిబంధనములందుఁ జోద్యమగుఁబురిన్

చ. సుచిరచిత్రబంధములు శోభిల వాచ్యవిశేషవైఖరు
ల్కరముఁ బ్రకాశమంద రసగౌరవహాని నిదానదోషము
ల్పొరఁగుట మానఁగా నవనవస్ఫుటచారురసధ్వను ల్పరి
స్ఫురణవహింపఁగా మిగులఁ జోద్యము లయ్యె రతిప్రబంధముల్.

క. చోరాభావముతో వ్యభి, చారిత పురి సడల రతులసాత్త్వికభావం
బారాజధాని గైకొను, నారూఢస్ఫూర్తి దనర వ్యభిచారిగతిన్.

క. అమితరసము సంలక్ష్య, క్రమచేష్టలఁ దనరె వస్త్వలంకృతు లితర
క్రమతగయికొనియె నప్పురి, కమలాక్షుల కమరుమదనకదనములందున్.

వ. మఱియు నప్పురీమతల్లిక రత్నాకరంబుఁబోలె ననంతసత్త్వాశ్రయం బై రత్న సానుసానుమంతంబు కైవడి ననేక దేవతాయతనం బై కైలాసధరాధరంబుమాడ్కి రాజకుమారక వినాయక విరాజితం బై తుహినమహీధ్రంబులీల సర్వమంగళోత్పత్తినిలయం బై యుదయాచలంబుతేఁ గళాధిపూ ర్వ్యమహోదయకారణం బై లోకాలోకనగేంద్రంబుపోలిక నిజాంతస్స్థద్రవ్యసాకల్యం బై సుధర్మాప్రదేశంబుక్రేవ సధర్మ్మతి వాక్పతిసురపతిదిశాపతి సమధిష్ఠితం బై పద్మజాస్థానంబు పోల్కి వేదాంత నిరంతర పారాయణపరాయణ సరస్వతీధరసమాక్రాంతం బై జలజోదరు నివాసంబుపసఁ గమలాలయానంత శకుంతరాజ విష్వక్సేనాభిరామం బై కుబేరధర్మనరాజంబునోజ మహాపద్మాదిసంఖ్యావిషయనవరత్ననిధితా ప్రథితం బై మానససరోవరంబుపగిది రాజహంససంకులం బై ధరావలయంబుపోలుపున జలధిపరివేష్టితం బై రాకాచంద్రబింబంబుచాయ సకలకలామనోహరం బై రక్షోవైరివక్షస్స్థలంబువడువున వైజయంతీవనమాలికారమాలంకృతం బై రవిబింబంబు వడువునఁ గమలాసంకోచకర నిజోదయం బై తారామండలంబుభాతి విష్ణుపదపదం బై సత్పురుషహృదయంబుకైవడిఁ బంకలేశస్పర్శానభిజ్ఞతావిశదం బై మహోదారచిత్తంబుభంగి విత్తక్షయజ్ఞానరహితం బై రసాతలంబు వైఖరి బలిపురుషనికేతనం బై దామోదరునుదరంబుగతి నశేషవర్ణపరిపూర్ణం బై గౌరీరమణుకొల్వుకూటంబుతేట ధనాధిపవృషభశక్తిధరధరాపాలక సముపసేవితం బై సాకేతనగరిచాడ్పున రామచంద్ర సంబంధ

బంధుర రాజసదనంబై గంగాప్రవాహంబు పరిఘవంబునఁ ద్రిలోకీప్రసిద్ధగో
చరంబై శ్రీమద్రామాయణంబుకరణి సప్త కాండపర్యంతవ్యాప్తగోవిలాసం
బై మహాభారతమువన్నియ బహుసుపర్వప్రతిపాదిత కథాప్రసంగం బై
భాగవతంబుసొంపున విపులస్కంధానుసంధానితంబై యాద్యప్రకృతివ్యా
కరణంబుసొగసున నుత్తమాదిపురుషవిఖ్యాతంబై ప్రకృతివ్యాకరణంబుర
హి నద్విర్వచనంబై వికృతివ్యాకరణంబునహి నసూర్యరూపంబై యుత్త
మకావ్యంబుచెన్నునఁ జమత్కారివ్యంజనంబై మహా* నాటకంబు దోరసున
నతిమనోహరాంకంబై దండనీతిఖ్యాతి నరాజలక్షణంబై గ్రహశాస్త్రంబు
నందంబునఁ బ్రత్యక్షీకృతాదృష్టపదార్థంబై రతిప్రబంధంబు తెలివిఁగామ్యాద
యంగమంబై సాంఖ్యంబుసాటిఁ బ్రధానప్రశస్తివిస్తీర్ణంబై యోగతంత్రంబు
సరి సమాధ్యవస్థాహారణంబై ఛందంబుచందంబున లసద్వృత్తలక్ష
ణంబై పాతంజలంబు నీడున నఖిలశబ్దాకరం బై నిగమంబుజోడున సత్య
వచనప్రచురంబై గీతశాస్త్రంబుపొందిక నకలంకకాంతపురుషరాగానుబం
ధం బై భరతఫక్కికచక్కన ననుగృహీతసర్వరసనివృత్తికం బై యాయు
ర్వేదంబుకోడున సర్వధాతు నిధానంబై యాన్వీక్షకిచాడ్పునఁ బ్రకాశిత
నిఖిలపదార్థస్వరూపం బై పూర్వతంత్రంబురాణ విభక్తాంగిక ప్రధానకా
ర్యంబై యుత్తరమీమాంసజాడ సారోపాపవాదం బై బ్రహ్మంబుతీరున న
వాఙ్మానసగోచరంబై సవర్ణం బయ్యు నవర్ణం బై యపరభాగం బయ్యు
నపరభాగంబై యనీతిప్రచారం బయ్యు సునీతిప్రచారంబై యదృష్టచరం
బయ్యు నదృష్టచరంబై యశ్రుతపూర్వంబయ్యు సశ్రుతపూర్వం బై యబ
లాభిరామం బయ్యు సబలాభిరామంబై యాశ్చర్యంబులకు నావాసం బై
యానందంబులకు నాటపట్టై యనభిజ్ఞులకు నవేద్యం బై యాచారంబులకు
నాస్పదం బై యభిజ్ఞులకు నతిసుకరంబై యార్తులకు నధికశరణ్యంబై యగు
ణంబులకు నతిదూరం బై వెలయుచుండు.

సీ. వాదించిరా సృష్టి కాదట ప్రతిసృష్టిపరఁగించి గెల్తురా బ్రహ్మకైన
వెఱపించిరా జగద్విఖ్యాతి నఱకాలఁ గన్నుఁ జూపుదురు ముక్కంటికైన
మెచ్చిరా సంపద లిచ్చి సంరక్షింతు బలిమిఁ దాయఁగలరు శ్రీపతికి నైన
నలిగిరా వ్రేల్మిడి నాపోశనంబుగాఁ ద్రావివుత్తురు జలరాశి నైన

* మహానాదంబు—మూ. హ?గ్ర.మూ.

సకల వేదపురాణశాస్త్రములకలిమి, వేయినోళ్లనుగొనియాడువిమలమహిమ
సత్యనిత్యసదాచారసద్గుణములు, వెలయుచుండుదు రప్పురి విప్రవరులు,

సీ. జలజాతసూతి యై మెలఁగుచుండియుఁ దాను జలజాసనత్వంబు సమ్మతించె
నను మనసారంగా గనిమోహాగతి నింటిగరితఁ జేసె
దోషాకరత్వంబుఁ దొలఁగకుండఁగఁ జేసి ద్విజచక్రముల భీతిఁ బెరయఁ జేసె
జలధి మందఁగనీక సతతంబుఁ దలవాకిటను నన్ను నిలుపఁ గట్టడియుఁ జేసె
ననుచువిధినింద గావించియుఁ జెలువారె, పలుకుఁ జిలుకలకొలికి యింపొలుకఁ దమదు
చెలువునెమ్మోముదమ్ములఁ జేశనిలువఁ బెంపుగాంతురు పృథ్వీవిలింపు లచట.

క. చతురాననచతురానన, సతతాధిగతాధికప్రశస్తసువిద్యల్
చతురైకనిజముఖంబున, నతులస్థితి నిలవరింతు రచ్చటివిప్రుల్

గీ. అప్పురంబులోన నలరారు నొకభూమి, దేవునేని గన్నఁ దెలివి గాని
సకలదర్శ నాగమశాస్త్రసం, దర్శనానుభూతి దప్పకుండు.

ఉ. ఆనతశత్రువాహిను లహర్పతితేజులు సంగరక్రియా
నూనమహాప్రతాపులు మనోభవరూపవిలాసవిగ్రహు
ల్దానగుణాభిరాములు సదా మతిమంతులు ధీరు లుత్తమ
జ్ఞానులు సత్యవాదు లవిషణ్ణులు తత్పురిరాకుమారకుల్.

సీ. పసులకాఁపరితోడ బలుపొందు గైకొన్న యొకనరుచేతుల యోపి కెంత
విషమసృష్టులపెద్ద విలువిద్య గైకొన్న పరశురాముని బాహుబల మదెంత
కుశలవవిజయంబు గొన బల్మిచాలక వెనుకద్రొక్కిన రాముపీర్య మెంత
నిలువుగన్నులు వడి యల నిల్వలేనిసేనల నేలు గుహుబల్మికలిమి యెంత
యనుచు నెటువంటి వీరుని నోర యనుచు
మెచ్చుకొనువారుఁ బూనరు మచ్చకైన
హవ్యవార్యసమానసన్యశౌర్యు లగుచు
సూర్యసోమాన్వయులు రాజవర్యు లచట

ఉ. మానిత*హాలికోక్తియును పూసలవృత్తియు గోపకత్వముం
బూనినవార లప్పురికి ముఖ్యులు గావునఁ దారు నట్లు స
న్మానితహాలిక ప్రకటపూసలగోపకవృత్తిసంపదల్
గా ననుపొంది వైశ్యులు వికాసత నుందు రప్పురంబునన్.

*హాలికోక్తి వ్యవసాయము.

చ. అరయఁగఁ గామితం బొకటి యైనను గానక యావికత్థ మోఁ
బరఁగెడు నాదిభిక్షుకుని బంధువు నేరఁడు గాన లుబ్ధతా
పరు నలకాపతిం గుమతిభావముఁ జెందును మమ్ము నందదం
చురుతరవర్ధితాఖిలజనోదయు లౌదురు వైశ్యు లప్పురిన్.

సీ. నగరాజునైనఁ బన్నగరాజునైనను ధైర్యవాక్పటిమలం దఱుమఁగలరు
రుద్రుని నైన సముద్రుని నైనను శౌర్యగాంభీర్యాప్తిఁ జఱుపఁగలరు
ఇంద్రుతో నైన నుపేంద్రుతో నైనను భోగభాగ్యస్ఫూర్తిఁ బోరఁగలరు
అజునితో నైనఁ జిత్రజునితో నైనను నిర్మాణరూపము న్నెఱపఁగలరు
ఘనులు నిర్వక్రవిక్రమక్రమమదారి, చక్రదళనక్రియావక్రజయపరాక్ర
మక్రియాముద్రనిర్నిద్రమద్రయశులు, శూద్రు లప్పురిఁ గలరు విశుద్ధమతులు.

ఉ. ఏఱులమిన్న నయ్యమున నేరున భేదన మాచరించెఁ దా
నేరున దున్ని భూమి ఫలియింపఁగఁ జేయఁగ సీరపాణియు
న్నేరఁ డటంచుఁ గేలఁగొని నేర్పలరం గృషిచేసి ధాన్యము
ల్మేరకు మించఁగా ధర ఫలింప నొనర్తురు శూద్రు లప్పురిన్

క. బ్రహ్మపదజనన మొనరుచు, బ్రహ్మనిరూపకపురాణపరత మెలఁగుచున్
బ్రహ్మోరాద్గతి నెడసియు, బ్రహ్మోరాద్గతి ఘటిల్లఁ బరఁగిరి శూద్రుల్

క. మాతోఁ బుట్టిన గంగయు, ఖ్యాతిన్ జనములకు ముక్తి గలిగించెను మా
చేతనె భుక్తియుఁ గలదని, ప్రీతిం జెలఁగుదురు దత్పురింగల శూద్రుల్.

మ. సిరి విద్యుల్లత చంచలత్వ ముడిగెం జెన్నారె నేవేళలం
గర మింద్రోపలనీలకాంతులు నిజాకారంబునన్ మా(కుసీ)
కరణిం గావలె నంచుఁ గృష్ణఘనముం గాంక్షించి సేవించు న
బ్బురపుంగారుఘనంబులో యనఁగ నొప్పు న్వీట మత్తేభముల్.

చ. జగములు రెంట విష్ణుపదసంగతి గాంచె నిజాధినాథుతో
గగనమువాఁక యవ్విధము గాంచకపోవుట గాదటంచు వే
గగనధునీజలంబు కరకాండములం గొని తెచ్చి నించి ప
ద్దెగలగు నేఱులన్ జలనిధిం గనఁజేసె గజంబు లప్పురిన్

చ. సురధుని నోలలాడుసురశోభసగాత్రులయూరుసౌష్ఠవం
బరుదుగఁ జూచి లజ్జపడి యాత్మకఠోరకరంబు లెల్ల ని
ర్భరముకుశాకృతు ల్గానఁ దరం బగునే గ్రహియింపఁ దత్పురీ
కరులకు నఃబు గాని రొడఁ గొనవే యవి నీర మంతయున్

ఉ. వాచకశబ్దము ల్వరనిపాతముచే విలసిల్లు వాచ్యతన్
రోచిలు మాతుఁ దాదృశత రుచ్యముగా కితరార్థరీతిగా
నౌచితిగా దటంచు మది నారసి రూపరపాతనక్రియ
ల్వోచి వసించు నప్పురి నమోఘబలాన్వితము ల్కరీంద్రముల్.

శా. పీటం బాటిలు ఘోటకావళుల యుద్భిన్నాంఘ్రివేగంబుతో
సాటిం జెందఁగ వచ్చి వాయుమనము ల్సత్త్వంబుచే కయ్యెడ
న్నీటు ల్వోవఁగఁ దత్పదాహతరజోనీకంబుచే సుళ్లఁ జే
డ్పాటుం జెందె నవే సుమీ భ్రమరజఃప్రాబల్యము ల్వానికిన్.

క. ఏకకచక్రపుఁజక్రిన, నేకత గాంచియు వహింప నేరక పుడమిన్
జోకటి పడు నని నగు నగు, లోకాప్తునిహారుల ఫేనరుచుల హయంబుల్.

చ. సురుచిరరాజకన్యకల సోఁకుట నిత్యము రూపభావముం
బొరయుట జన్మసంశ్రయతఁ బూనుట నిక్కముగాఁ బిశాచమై
పరఁగెడుగాడ్పు వేగమునఁ బొల్పడునే సరిగాఁగ మాకు నం
చుపగతివేగసంపదల నొప్పు నదుష్టములై పురిన్ హరుల్.

క. అరయఁగ నెప్పుడు సత్త్వము, భరియింపదు మనసు లక్ష్యపదమాయను వే
సరి మెట్టు లౌ నటంచు, న్హరు లప్పురి మెలఁగుచుండు నతిసత్త్వమునన్.

సీ. క్లిష్టకల్పన లేక కష్టతాదూరమై యసమర్థత నెఱుంగ కప్రతీత
తను మాని యప్రయుక్తతను రోసి పతత్ప్రకర్షనైరర్థక్యఘటన గనక
దృఢపదబంధసంధిస్ఫీతమై సుప్రసాదకాంత్యౌజ్జ్వల్యసమత లలర
లు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యములనంగఁ, జెన్నువైవాటిచూడ్కిక చ్చెరువుమీఱఁ
బుష్యరథము లసంఖ్యము ల్పొలుపు మిగులుఁ
బురవతంసము ద్వారకాపురములోన.

క. అచలత నవరత్నరుచి, ప్రచురత చిత్రప్రకారబహుసురపురస
ద్రచనతఁ బురిలో నరదము, లచలాధీశ్వరులమాడ్కి నలరుం జాలన్.

సీ. వెలఁది నీకైదండ వెల యెంత తెల్పవే యలరునాకైదండ వెల సులభమె
చను బంతు లీ రెండుఁ గొనవేడ్క చెలువరో చనుబంతులీ రెండు గొనఁగ లేవు
ఆకాశసుమ మిదెం తభ్రమే కననీయ వాకాశసుమదృష్టి యభ్రమెకద
పలునొక్కులకుఁ బొలుపడెఁగదే చిగురిద్దిపలునొక్కు లిడఁగ నీపాటివారె

వింతతావులు గనఁగ నువ్విళ్లు మాకు, వింతతావులు గనఁగ నీ వెంతవాఁడ
వనుచువిటులకుఁదమకుసయ్యాటమమర, విక్రయింతురుపువ్వులావికలువిరులు

సీ. వలపులీనఁగ సోఁగుఁ జెలువ నీకై దండ వెల చెప్పరాదటే వలయుమాకు
వనిత పుంస్కోకిలాస్వాదితం బీనన రుచ్చి చూడనీఁగదే రుచిరగాత్రి
పొలఁతి మాటఁగ నేలు పొన్నపువ్విదిమాకుఁ జెన్నార వన్నె చేమిన్న ముట్టె
వలువలో డాఁచెదు వలుదపూబంతులు పుట్టినయవిగానఁ బుట్టె మనసు
అనుచు నాగరవిటులు నర్మానుబంధ, బంధురంబుగఁ బల్కెడుపల్కులోని
గోముమీఱిన నవ్వుల మోములలర, నమ్ముదురు పువ్వులవ్వీటనలరుఁబోండ్లు

ఉ. పోయినవారిఁ దేవసమె పుత్తడిబొజ్జకునైన మాదు చూ-
చాయుల చాయనే చనిన చక్కెరవిల్తుని చాయ నెన్నికం
బాయఁగఁజేయ లక్షణముఁ బొల్పడు మాయబలాక్షిపదం బనం
జాయ విటాళి లోఁగొనుచుఁ జక్కని వేశ్యలు పొల్తు రప్పురిన్.

చ. సతతగిరీశభావమున సమ్మతశుద్ధకళావదాఖ్యసం
గతశివమూర్తులైన నధికస్ఫురదక్షికటాక్షవీక్షణాం
చితగతిమాత్ర నే రతివిశిష్టపరంపర లీను నిక్కువం
బతిశివమూర్తు లంచు విరులందఁగ వేశ్యలు పొల్తురప్పురిన్.

సీ. చందనాలయమహాచలరాజరాజత్సుగంధచందనగంధకలన మీఱి
నానామహీరుహానూననవ్యామోదసుమగుచ్ఛపరిమళస్ఫూర్తిఁ దనరి
రసరమ్యపద్మినీ*రాగసంగమపరిప్రాప్తంబు మధుసేవఁ బరిఢవిల్లి
సకలవధూటికాసముదయాశ్రయకామసంతతాధారతాసరణి నలరి
మెలఁగుచుండెడు మేనును మేను నెడమ, నతులభీతినిబలెమందగతులుసాగియ
నప్పురంబునఁజరియించు నహరహంబుఁ, బట్టుగెకొని మ్మదుమరుద్బహ్మచారి

సీ. శక్తిత్రయజ్ఞానసంపత్తి నలరారి పంచాంగనిర్ణయప్రౌఢి మెఱసి
‡యావాప్యతంత్రకార్యక్షమత్వము గాంచి వృద్ధిక్షయంబులవిధము తెలిసి
చతురుపాయవిచారచాతుర్య మిరవొంది షడ్గుణప్రజ్ఞాప్రశస్తి నెరసి
రాజ్యాంగసప్తకరక్షకస్థితు లూని ద్వాదశరూపభేద మెంచి
మతిబలస్ఫూర్తి నలబృహస్పతికిమించి, యఖిలవిద్యల నేచట†సామ్యంబులేక
యప్పురంబున నలరుదు రనుపమాన, మానగుణరత్నఖనులు ప్రధానమణులు

§ పదంబున — మూ. * రాజసంగ — మూ. ‡ తపాంస్య — మూ. † నాస్యంబు — మూ.

క. ప్రథమానిర్దిష్టతఁ బ్రా, గ్విధగణ ముపసర్జనత్వబోధకు నమగుం
బ్రథమానిర్దిష్టత నగు, ప్రథ నుతధన్యత్వ మొనరఁ బరఁగి రమాత్యుల్.

వ. ఇట్లు సకలపురలక్షణలక్షితం బై నిఖిలలోకవీక్షాపేక్షాసేచనకం బగునప్పు
రంబును ధరానుకూలవల్లరీనాయకరత్నం బెవ్వ రనిన.

చ. కలఁగనివాఁ డదెన్నఁటికిఁ గాననివాఁడు జగద్ధితార్థియై
కలఁగనిమానవప్రకృతిఁ గాంచినవాఁడు నిజాశ్రితాభిదా (?)
గలకనియెనఁ గావనను కట్టడిమాటకుఁ గానివాఁడు మే
ల్కలఁగనిచాయ నవ్వఁగనుదల్చిన నిద్దపుమోమువాఁ డొగిన్.

ఉ. తప్పనివాలువాఁ *డనిని దప్పనిమాటలవాఁ డొకప్పుడుం
దప్పనివాఁడు నమ్మికలు దప్పనిబంతి మెలంగువానివె
న్దప్పనివాఁడు తప్పులకుఁ దప్పనివారలఁ బ్రోవనన్నవా
తప్పనివాఁడు ద్వారవతిఁ దప్పనినీతిగ నేలు నెప్పుడున్

సీ. సచ్చిదానందలక్షణలక్షితుం డౌచు వేదాంతలక్ష్యత వెలుఁగు నెవఁడు
జగదుద్భవస్థితిసంక్షయహేతుత సర్వజ్ఞతాతిప్రశస్తుఁ డెవఁడు
మాయానుబింబితమహనీయతేజుఁడై క్షేత్రజ్ఞవృత్తిచేఁ జెలఁగు నెవఁడు
సేవకాభీష్టార్థసిద్ధ్యర్థమై బహురూపనామముల నిరూఢుఁ డెవ్వఁ
డతఁడుపరముండుసకలలోకానుశాసనార్థమయథార్థమనుజవేషార్థియగుచు
గృష్ణుఁ డనునామ మఘువనకేలి గాఁగ,నతిముదంబున ద్వారకనధివసించు.

సీ. ప్రామిన్కుఁగమితమ్మిపట్టుప ట్టగునంచ యంచ తేజీతేనిఁ గాంచు వేల్పు
వేల్పురాతాచాయవెలయు చక్కనితండ్రి తండ్రి నెఱుంగక తనరుప్రోడ
ప్రోడచేరువకాండ్రఁ బ్రోచుమీఁదటిగిడ్డి గిడ్డిమందలనుండు దొడ్డజంత
జంతరక్కసికానదొంతు లేర్చెడుచిచ్చు చిచ్చుక న్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల సెకఁ జల్వఁ జూపుమేటి, మేటిసుడివాలుఁ దాల్చినమేలుబంతి
బంతివలె వ్రేల బలుకొండఁ బట్టుదిట్ట,దిట్టముగ నేలు నవ్వీడు తెలివిమీఱ.

సీ. తనసుదర్శనలీల తనసుదర్శనలీలకరణిచేఁ బరదానగరిమ మెఱయఁ
దనవిక్రమస్ఫూర్తి తనవిక్రమస్ఫూర్తియనువున జగముల న్నాక్రమింపఁ
దననేత్రమహిమంబు తననేత్రమహిమంబువగిదిఁ జిత్రాలోకపటిమ నెఱపఁ
దనకరాంభోజంబు తనకరాంభోజంబుపోల్కి నసాధ్వసామోదము లీప

*డనిన.

ద్వారకాపురి నేలును దారమహిమ, మహిమలయు భారము డుపఁగా మనుజలీల
నతిపరాయత్త సంరక్షణక్రియాప, రాయణుం డగునట్టినారాయణుండు.

సీ. నిగమశిఖాపద్మినీచారుహంసంబు నిరవద్యసద్గుణనీరరాశి
నిజదాసఖేదాగ్ని నిరసన‡నాంభోదంబు నిర్మలకీర్తిధునీమహాద్రి
నిఖిలార్థదాననిర్నిద్రభూమీజంబు నిరుపమవైభవనిత్యవసతి
నిరవధికానందనియతినివాసంబు నిటలదృక్ప్రముఖసురనికరచేత
యలరు ద్వారక సర్వలోకాతిశాయి, చాతురీలేశ(హత)బహుళాతతాయి
(సాధు)చేతనమానసోత్సవవిధాయి, మాయిజనమాయివిబుధసన్మానదాయి

సీ. సైంధవజలమధ్యసంచార మందుట గిరిధారణోదీర్ణకీర్తిఁ గనుట
భూదారభావంబుఁ బొందుగాఁ బడయుట నరసింహవేషంబు నలువుకొనుట
బలిదైత్యగర్వసంపత్తి హరించుట రక్తైకతర్పణరతి నెనయుట
ఖరదూషణోద్వృత్తికలిమి వారించుట నిజకామపాలత నెఱి మెలఁగుట
యతిపరశ్రుతిగతుల సన్నుతిగలుగుట, నతులితంపుఁబ్రసాదిత్వమానిమనుటఁ
బూర్వపరలీలలప్పుడ పూనికొనుచుఁ, గృష్ణుఁడలరారు నధికరోచిష్ణుఁడగుచు.

సీ. నెనరుఁజూపులవాఁడుగొనువానిఁగనువానిఁగనువానిఁగనినరూపొనరువాఁడు
పొనరునవ్వులవాఁడు మొనమించు మొనమించు మొనమించుజిగివల్వ నెన
[యునాఁడు
భంగ మందనివాఁడు రంగారు బంగారు బంగారుఁబోఁడి చేపడినవాఁడు
కడలినుండెడివాఁడుకడపల్లుకడపల్లుకడపల్లుమహిమంబుగాంచువాఁడు
కలఁడు లేఁడను రెండుమాటలకు మించి, వింత యగుకల్మిచే విఱ్ఱవీఁగువాఁడు
కృష్ణుఁ డనుపేర నఘ మణఁగించువాఁడు, పురుషుఁ డాద్యుండు ద్వారకాపు
[రికి ఱేఁడు.

వ. వెండి యు జగజ్జన్మాదికారణం బైన యప్పురుషోత్తముండు నిఖిల*విశ్వంభరాభరోపసంహారార్థంబు గా దేవకీ వసుదేవులకుఁ బుత్త్రభావంబున మాయామానవశరీరం బవలంబించి యత్తఁ డునుప నందయశోదానందకందంబై నందునిపల్లియయందు యశోదాతత్క్షణఫలాయమాన నిజశిశుశరీర పోషణుండై వసియించుచుఁ దత్కాలంబునఁ బూతన విగతచేతనం గావించి శకటాసురు హరించి తృణావర్తు నడంచి నిజైశ్వర్యజ్ఞాపక విశ్వరూ

‡నాంభోజంబు—మూ.　　*విశ్వంభరాభరా భగోపసం—మూ.

పప్రదర్శనాద్యద్భుతంబుల యశోద విస్మయానందంబుల నందించి యమ
ళార్జునంబుల భంజించి బృందావనంబున గోపాలబాలకబలరామసహి
తుండై గోవత్సపరిపాలనం బభ్యుపగమించి వత్సాసురు విదారించి బకదై
త్యు మర్దించి యఘాసురు ఖండించి చతుర్ముఖమాయావినిర్మిత గోగోపవ
త్సాపహరణనిమిత్తంబునం దాన గోగోపవత్సరూపంబులు ధరించి విహరిం
చి ధేనుకు మథించి యమునాహ్రదంబున నుండు కాళీయోరగంబు వెడలిం
చి దవానలంబుఁ గబళించి ప్రలంబునకు బలునిచే లయంబు ఘటింపించి గో
పకన్యాసహస్రక్రీడనం బంగీకరించి విప్రభామలఁ గరుణించి గోవర్ధనాచ
లం బుద్ధరించి సుదర్శను శాపవిముక్తుం గా నియమించి శంఖచూడు
జముం జూడం బంచి వృషభాసురు మాయించి కేశిదైత్యు*మాయించి
వ్యోమాసురు నిర్జించి మథురాపురంబునఁ గువలయాపీడమహాగజంబుఁ
ద్రుంచి కుబ్జావక్రతానివారణాద్యద్భుతకృత్యంబులు నిర్వర్తించి బలరామ
సహితుండై ముష్టికచాణూరుల నిగ్రహించి కంసన్యగ్రోధాది నృశంసుల
హింసించి యుగ్రసేనుఁ బట్టాభిషిక్తుం గా ననుగ్రహించి ‡ బ్రహ్మచారితోరీ
కరణపూర్వకంబుగా సాందీపుని సమీపవర్తిత్వం బనుసరించి పంచజనుం
గీటడంచి తద్దేహగతశంఖంబు ధరియించి జమునివలనం దెచ్చి గురునకుం
బుత్త్రు నర్పించి యక్రూరముఖంబున గోపికల ననునయించి జరాసంధుఁ
గాందిశీకుంగా ఘటియించి కాలయవనపరిత్రస్తమథురాపురజనావనార్థంబు
వార్ధిమధ్యంబున ద్వారకానగరంబు విశ్వకర్మనిర్మాతచే నిర్మింపించి యందుఁ
దనయోగమాయా బలంబున మథురానివాసుల నందఱఁ బ్రవేశింపించి
ముచికుందుచేఁ గాలయవనుసమయసంకల్పించి ముచికుందుం గృతార్థసార్థ
వాహుంగా నభిమతించి జరాసంధుఁ బునర్దండయాత్రానిమిత్తక ప్రవర్షణప
ర్వతారోహణానంతరంబ తద్గిరిదాహంబు గావించి బలరామ సహచరుం
డై ద్వారవతియందు నివేశించి తదనుసమయంబున రుక్మిణీనామంబున
మానుషీవేషంబున దీపించు మహాలక్ష్మి లక్షణవతిం బరిగ్రహించి యాభా
గ్యవతియందుఁ బ్రద్యుమ్నకుమారు నుత్పాదించి జాంబవతివరియించి సత్య
భామం బరిణయించి శతధన్వుని సమయించి దీపించుచు మఱియు ననేక
ధాపన్నుండై యుపమాలంకారంబు ననుకరించుచు ద్వితీయ ప్రతిభటరహి
తుండై యనన్వయంబు ననుసరించుచు, నేకధర్మాశ్రయుండై యుపమేయో

* ఇఁకూడ మాయించి యనియే యుండఁ నా.
‡ బ్రహ్మచారితోరీకృతలక్షణపూర్వ-మూ.

పమాలంకారంబు హసించుచు భేదాభేదవాదనిదానం బై స్మరణాలంకారం
బు నిరసించుచుఁ బ్రకృతోపరంజకం బై రూపకాలంకారంబు ననుగ్రహిం
చుచుఁ బ్రకృతోపయోగిక్రియార్థాప్రకృతస్వరూపం బై పరిణామంబు నా
దరించుచు రసికజనప్రతిభావిలాసగృహీతానుభవం బై భ్రాంత్యలంకారంబు
లోఁగొనుచు నిషేధవచనప్రతియోగి యై యపహ్నవాలంకారంబుఁ గా
దనుచు బహుజనపరికల్పితబహూల్లేఖం బై యుల్లేఖంబుఁ బైకొనుచుఁ
ద్విప్రకారమనోహరం బై యుత్ప్రేక్షాలంకారంబు మార్కొనుచు ననిశ్చ
యాంతం బై సందేహాలంకారంబుఁ దోడుకొనుచు మహావాక్యప్రతిపాది
తైకత్వం బై నిదర్శనాలంకారంబు విడంబించుచుఁ గవిప్రౌఢోక్తివిషయం
బై యతిశయోక్త్యలంకారంబుఁ దిరస్కరించుచు నవజ్ఞాత‡వర్ణ్యం బై
ప్రతీపాలంకారంబు నిందించుచు బింబప్రతిబింబభావోపేతం బై దృష్టాంతా
లంకారంబుఁ బరీక్షించుచు హితాహితతుల్యవృత్తికం బై తుల్యయోగితా
లంకారంబు నాజ్ఞసేయుచుఁ బ్రసిద్ధాధిక్యవిలసితంబై వ్యతిరేకాలంకారంబు
వంక లెన్నుచు సమాహితసార్థముక్తినిలయం బై సహోక్త్యలంకారం
బు నాక్షేపించుచుఁ దత్ప్రతిభటశబ్దార్థసంసేవితం బై వినోక్త్యలంకారంబు
ననుగమించుచు నర్థాంతర†సమాక్షేపాధిష్ఠానం బై సమాసోక్త్యలంకా
రంబు నుల్లసం బాడుచు సద్భావరమ్యం బై పరికరంబుఁ గినియుచు నా
నార్థనిధానం బై శ్లేషాలంకారంబుఁ జౌకసేయుచుఁ బ్రస్తుతకార్యప్ర
త్యాయనసమర్థం బై యప్రస్తుతప్రశంసాలంకారంబుఁ జౌకళించుచుం
గార్యానుమేయకారణభావం బై ప్రస్తుతాంకురాలంకారంబు నవఘళించు
చు వ్యాప్తిసముల్లసితం బై యనుమానాలంకారంబు బెదరించుచు విశేష
భావగమ్యం బై పర్యాయోక్త్యలంకారంబు విదళించుచు *విధినిషేధవచ
నమూలం బై నిషేధాలంకారంబుఁ బ్రతిషేధించుచుఁ బరిహృతవిరోధం
బై విరోధాభాసాలంకారంబు విరోధించుచు నకార్యసంబంధం బై విశేషో
క్త్యలంకారంబు నవమానించుచు నకారణకార్యవశంగతం బై విభావనా
లంకారంబు నిరోధించుచు విలక్షణకార్యోత్పత్తిమంతం బై విషమాలంకా
రంబు బహూకరించుచు విచిత్రప్రయత్నసంబంధి యై విచిత్రాలంకారం
బుఁ బోనాడుచు సూక్ష్మోదారం బై సూక్ష్మాలంకారంబు మన్నించుచుం

‡తాపర్ణ్యం బై-మూ. †సమాధోపాధిష్ఠాన-మూ.

*విధ్యలంకారవిషయ మిందులోపించినదేమో.

‡గారణమాలాలంబం బై గుంభాలంకారంబు ఘ్షరించుచు గృహీతముక్తం బై యేకావళ్యలంకారంబుం గసచుచు దీపకైకావళీయోగం బై మాలా దీపకంబుఁ గికురించుచు నుత్తరోత్తరగుణోత్కర్షం బై సారంబు వెలపిం చుచు మఱియు నుపాదానలక్షణాలక్షితం బై జహదజహల్లక్షణావ్యాపార ద్వయంబు జయించుచు వృద్ధ*నిష్టాపదసర్వనామస్థానం బై సంస్కృతశ బ్దానుశాసనంబు ననుశాసించుచుఁ జతుస్సాధనాభిగమ్యం బై ప్రమాణ దర్శనంబుఁ జుంబించుచు, నిశ్చితవేదార్థం బై వాక్యశాస్త్రంబుఁ గేలిసే యుచు నద్విత్వం బై ప్రాకృతవ్యాకరణంబుఁ గారించుచుఁ బ్రత్యయసుల భం బై ఛందంబు నపలపించుచు స్థిరప్రాణ్యుపకృతిపదం బై వికృతివ్యాక రణంబు నపహ్నవించుచుఁ బ్రకృతివికృతిసంశ్రయం బై మహానాటకంబు నదరించుచు నమితం బై గద్యకావ్యంబుఁ గాకుపఱుచుచు సువృత్తావృతం బై చంపూప్రబంధంబు ననుబంధించుచుఁ గళాస్వరసహితం బై గాంధర్వ విద్యం గంపించుచు నస్తోకహస్తలక్షణమధురం బై భరతంబు గనికరించు చుఁ దనరూపంబు మిగుల వెలుంగ నసముండేని సముం డై యదరుం డ య్యు సదరుం డై యరిభరణప్రవీణుం డయ్యు నరిహరణప్రవీణుం డై స విశేషుం డయ్యు నవిశేషుం డై యమానుం డయ్యు సమానుం డై యగ దుం డయ్యు సగదుం డై వనవిహారశీలుం డయ్యు నవనవిహారశీలుం డై సోదయుం డయ్యు ననుదయుం డై శేషి యయ్యు నశేషి యై యహీన నిద్రాముద్రుం డయ్యు నిద్రావేశరహితుం డై యనర్జునుం డయ్యును నర్జు నాధారత మెఱయుచు లోకబాంధవుండు గావునఁ గమలాలయామోద ఘటకత్వంబునం దమోహరణపాటవంబునఁ బొటిల్లుచు స్పర్శవిధుండు గా వునజగదాహ్లాదకరత నమలినతారావళీమనోహరతం బ్రవర్తిల్లుచు సమవ ర్తిగావునం బ్రియాప్రియతుల్యయోగదండధరత ధర్మనిర్వాహణధురంధరత నాలంబించుచుఁ గాలుష్యంబు వర్షాసరిత్సరజ్జలకుపితాంగనాహృదయంబు లయందు పదనియమాభావవర్ణవైపరీత్యంబులు ప్రాకృతవ్యాకరణంబునంద యస్పష్టాలంకారత సురతమృదితముదితాధ్వనికావ్యంబులయందు విరాగత చుంబితకాంతాధరంబులయందు యసుందరత్వంబు మధ్యమకావ్యంబులంద నీరసత్వంబు వజ్రాదిమణిచిత్రకావ్యంబులంద నిరర్థకత్వం బపుష్టపదంబులం ద యకళావత్త్వంబుద్రుతప్రకృతులయందు వక్రత కాంతాఫాలాలకశరవిశే

‡ ఇందుఁ గారణమాలాగుంభశబ్దములు తాఱుమాఱయినవి.  *శిష్టా-మూ.

పార్థచంద్రులయందె వ్యుత్పత్త్యాహారవర్ణాకర్ణాకృష్టధనుఃపుంజయందె కఠినత లలనాకుచకటితటంబులయందె నీరసకావ్యతర్కోక్తికదంబంబులయందె ప్రదోషత రజనీముఖాసంస్కృతంబులందె యర్థభేదంబు శ్లేషయందె వృత్తిభిద యలంకారశబ్దమనంబులందె నిర్దయత మదనకదనకదనంబులందె స్వపక్షాభావంబు కేవలవ్యతిరేకహేతువునందె దారిద్ర్యంబు మృగతృష్ణామృగేక్షణామధ్యంబులందె కళంకంబు కళానిధియందె చాంచల్యంబు చంచలాక్షీకటాక్షసైంధవఖురాంచలంబులందె యనమ్రత యసజ్యచాపంబులందె యప్రసాదంబు మేఘావృతదినంబులందె యగుణాశ్రయంబు సురతభిన్నహారంబులందె యహిభయంబు పాతాళంబునందె యస్ఫుటత్వంబు వీణాకలకలవాద్యభేదంబులందె మానభంగహేతుత నాయకకృతనాయికాచరణపాతంబునందె పతత్ప్రకర్షత సముద్రతరంగంబులందె యనభిజ్ఞనిబంధనంబులందె యపాత్రత యుపరత నాట్యరంగస్థలంబులయందె మిథ్యావాదిత యద్వైతవాదులందె యప్రకాశత గుప్తవైతానాగ్నులయందె వికృతభావంబు ప్రాకృతాంధ్రభాషలయందె సమాధి పదబంధయోగీంద్రమానసంబులయందె మెలంగ నఖిలజనులు నగ్నిమాడ్కి శుచిమంతు లయ్యుఁ దాపకారిత్వ మెఱుంగక చంద్రుమాడ్కి నాహ్లాదకరు లయ్యుఁ గళంకులు గాక రవిభాతి సాభ్యుదయు లయ్యు నస్తంగతిఁ గానక మేరువుకైవడి నున్నతు లయ్యుఁ గాఠిన్యంబు గనక పయోధిచెలువున గాంభీర్యరత్నాకరంబులు గాంచియు భంగంబులు దెలియక కుబేరువిధమువున నర్థసంపన్ను లయ్యుఁ బరాశ్రయంబు సేయక యింద్రువైఖరి నిరుపమభోగశాలు లయ్యు దృష్టిభేదంబు లధిగమింపక యనుపపన్నఖేదు లై యనుగతమోదు లై యప్రాప్తాపవాదు లై యాశ్రితసాధువాదు లై యనురసప్రసాదు లై యతిప్రియవాదు లై యతిశయితవినోదు లై చెలంగం బరిపాలనంబు సంఘటించు సమయంబున.

[—: కథాప్రారంభము :—]

క. దిక్కులదొరకళ కిది యుమ్మక్కనదే యెంత చెలువ మమ్మక్క యనం
జక్కఁదనంబుల కుప్పగు, నొక్కసరోజాక్షి రవితనూభవ యలరున్.

క. అందముగల తలిదండ్రుల, మందానందమునఁ బెనుప మందిరమునఁ గా
ళిందీనామతఁ బెరిఁగె న, నిందితయమునాతరంగిణీసోదరి యై.

వ. ఇట్లు పెరుఁగుచు నబ్బాల తన శైశవంబున.

సీ. చెలులతోఁ బరివేషములు మేలుతనబొమ్మరిండ్లుగాబొమ్మ పెండ్లిండ్లు సేయుఁ
దారకాగ్రహవీధిఁ దరుణులతోఁ గూడి యొప్పుగా వెన్నెలకుప్ప లాడుఁ
దనరారు నయ్యింద్రధనువుపై నెక్కి యింతులతోడ నుయ్యేల లూఁగుఁ
గూర్చుకన్నియలతోఁ గూడి కుంభంబునఁ గొమరొప్ప గుజ్జనగూళ్లు వండు
మొగులుచాటున*దాఁగిలిమూఁతలాడు, సప్తఋషిబాలికలతోడ సరసమాడు
సంచబోదల కెల్ల నాట్యములు గఱపు, బాల నవశైశవారంభవేళలందు.

చ. జలదముమాటునం బొలిచి చాన మెఱుంగయి మిన్నువాఁకయం
‡చలముసనిల్పి యంచయయి, చంద్రుపిఱుందఁ దదీయరేఖయై
మలయును బువ్వుఁదీఁగియలమాటునఁ గల్పకవల్లి లీలయై
లలిఁ గిఱుకించుఁ దోడిచెలుల న్నతి†దాఁగిలిమూఁతలాడుచున్.

క. నీలాభ గవత్యంశజ, బాలిక బాలారవిందపంక్తులు దిశలం
జాలం జాలరచించుచు, లీలన్ గ్రమపడుచుఁ? దనము లేఁజూపుగమిన్.

క. దిన మొక్కచాయఁ బెరుఁగుచు, వనజాయతనయన చూడ వన్నెఁదనర్చున్
మానసిజుఁ డాడింపఁగ గవి,సన దీసిన పసిఁడిబొమ్మచందము మెఱయన్.

చ. మదపతి వాక్యపద్ధతి సముంచితరీతి ఘటిల్లి వర్ణముల్
పదులు గణింప నైదు నొకపట్టున నొక్కొకచోట నాలుగే
పదులు వసించు నొక్క యెడఁ బాయును నాల్గు లిపుల్మఱొక్కెడం
గదిసి మెలంగెడుం దెలియఁగాఁ బదియు న్మఱి నాల్గువర్ణముల్.

క. వైదర్భిమీఱు నెచ్చెలి, వైదర్భీరీత్యుదీర్ణవైభవరసధా
రోదారకవిత యొప్పు ప్ర,మోదావహ గాదు రసికపురుషుల కెల్లన్.

క. పదచిత్రతార్థచిత్రత, లొదవినకవితయు విచిత్రమొనిఁ గనుపట్టుం
బదగతులు సాపమంబై, యది నిరుపమ మగుచు మెఱసె నబ్రముచూడన్.

సీ. సుప్తిఙ్వ్యేషసంశోభితత్రివిధశబ్దంబులు దోషసర్వస్వ మెడల
శయ్య నమున్చుచు సత్వాకశుద్ధిగఁ ద్రివిధగుణంబుల రీతు లమర
వృత్తులు చెలువార వివిధరసానుగపదవర్ణసమాసనప్రాప్తు లొనర
వ్యంగ్యంబు మువ్వన్నె లమర శబ్దార్థవైచిత్రివిశేషము లెన్న మిగుల
వాగ్బలం బైనకవిత చెప్పంగ నేర్చె, భ్రాంతిచమువులప్రోవుగా రాపుఁబట్టి
విమలతన్త్రీతిమాధురివిన్న యపుడు, కవిగురులు కవితగుణితయుఁగాంచఁగలరె.

---

* దొంగుడుమూఁతలాడు-మూ. ‡ యంచలనను నిల్పి-మూ. † దాగిలిమూఁచులాడుచున్.

సీ. సంతతసన్మార్గసంచారిణిగఁ జేసె సారసాహారిహంసవ్రజంబు
వీణాక్వణత్పాణి వాణి యంతర్వాణి వాణిపి శేషసర్వజ్ఞఁ జేసె
బంధురగాంధర్వపాండిత్యనిధిఁ జేసె విమలాశ్వవదనసాహ్వజనంబు
సర్వభారతశాస్త్రగర్వితగాఁ జేసి రమితగీర్వాణపర్వాబ్జముఖులు
కల్పితానల్పసంకల్ప(కావ్య)కథల, లలితేతులు మీఱఁ గల్పనలు చేసి
దిద్దె నద్దివ్యమునిసతీతిలకకులము, నెలయఁ గాంచి సబ్బాల్యవేళయందు.
సీ. ఉదయవేళల వాణి యురుస్మృతిబహుస్మృతిబోధకగ్రంథము ల్పొసఁగ నేర్పెఁ
దనువాతియెడ ధరాధరరాజనందన మహేతాగమోక్తిమర్మములు దెలిపె
దాసిపిమ్మట రమాతరళాక్షి రత్యలంకారశాస్త్రములు పొంకముగ నేర్పె
నెడనెడ రశ్మిత నెసఁగు పన్నగరాజు శబ్దరహస్యంబు చక్కఁ బలికె
గౌతమవ్యాసకణచరకపిలజైమి, నులు స్వనిర్మితదర్శనంబులు నొడివిరి
మూఁడుమూర్తులముద్ద యాప్రౌఢ తంత్రి
యంకమునఁ బ్రోదిగాంచు నీయ్యబ్జముఖికి.
క. చదువులగని కన్యాయన, చదువులు గ్రహియింపనేర్పు సవిత్రుతనుజ దాఁ
జదువులు సాకల్యంబుగఁ, జదివె ననుచు ప్రజ్ఞనంబు చలుపఁగవలెనా.
వ. అంత.
మ. గణుతింపన్ స్మరజీవనౌషధి యనంగబ్రహ్మాతంత్రాంకురా-
ర్పణసర్వంసహ కామదైవతసపర్యావాహనాకాంక్షణా
క్షణ మస్త్రాస్త్రజగత్త్రయీవివశకృత్సంమోహనాస్త్రంబు భూ
షణసాకల్యసమానవేష మయి యోషాయౌవనం బొప్పెడిన్.
క. ముంగురులరంగు లలనకై, నంగనపాలిండ్లు మిట్టలై కనుపట్టెన్
అంగముల మెఱుఁగు లెక్కెను, శృంగారముతోడఁ జెలికి సిగ్గును గవిసెన్
సీ. నానాఁట నవయౌవనంపుఁబూఁదోఁటలో రహించు మదనాంకురంబనంగ
ననుపమనవయౌవనాంబుజలరాశి లలిఁదేఁచు పవడంపులతిక యనఁగ
సరసలావణ్యావశ్యాకాలఘనవాటి రంగుమీఱిన క్రొమ్మెఱుంగనఁగ
సలలితప్రాయంపుసానఁదేఱి లసించు నసమాయుధుని మోహనాస్త్రమనఁగ
బాలశశిరేఖ దినదినం బోలి నెగడి, మెఱయఁ గళలంతకంతకు మిక్కుటముగ
వరుస సంపూర్ణభావత వఱలుకరణి, నమరెఁ గాళింది నవయౌవనాగమమున

* సరిసమిసుఃకుపూ.

మ. తెఱవై బాల్యము వోవ బాల యతిదీప్తిం జూడఁగా నొప్పె నా
తెఱసొంపుం గటిపెంపు మేనుజిగి యుద్దీప్తస్తనౌన్నత్యము
న్మెఱిపంపున్నడతీరు పాదములయొప్పుం గాను లేమిం గనన్
ఓంబాయన్ జళిపింప సమ్మదునిచే నొప్పారుఖడ్గం బనన్.

సీ. కుటిలప్రచారము ల్కుంతలంబులఁ జెందెఁ జపలభావము నేత్రసరణిఁ జేరెఁ
బంకసాంగత్య మేర్పడ ఫాలమున నుండె నతిరాగవిలసనం బధర మంటెఁ
గఠినత్వ మెల్ల నొక్కటఁ గుచంబులఁ జెందెఁ బట్టువీడమి నితంబమున నిలిచె
కలుము లెఱుఁగముల్ గానొందిఁగె వసించె జాడ్యంబు నడపులజాడ నమరె
మురిప మెల్లను సిగ్గులో ముడిఁగికొనియె
*గుర్తెఱుంగమి యలనాభిఁ గూడికొనియె
నెలఁత తన బాల్యచేష్ట లన్నియును దన్ను
బాయకుండఁగ నొప్పె యౌవనమునందు.

చ. అలరువసంత మబ్బినపు డా నొకకొన్నిదినంబు లింతె మా
కలుములు నప్పుడు న్సమత్తకై †కొఱగా మని పల్లవంబు లా
జలజదళాక్షిపాదజలజంబులు గైకొని పూజసల్పి న
య్యలరు లనంగఁ బాదనఖరాంకురము ల్గనుపట్టు నింతికిన్.

క. జిగి దప్పి చుక్కగమి యీ,మగువపదనఖాలితోడ మార్కొనలేమిం
బగ లుడిగి యుండుటం గద, గగనములో డాఁగి రేయి గనసగుటెల్లన్.

గీ. నిలుక డెఱుఁగని చిగురాకునీటు దెంత, జాపడిన పద్మరాగమ్ము రాణయెంత
సొగసుఁగెందామరలసొంపుచూఱకొన్న, వనితపదములతో సాటివచ్చుటెల్ల.

చ. ఎడసినకాండసంపదల కెంతయు స్రుక్కుచు వాడు టంది తా
రుడుగని వేఁతకోఁతలకు నోర్చుదొన ల్కలమంపుగర్వముల్
జడిమ వహించెఁ గాన సతిజంఘలతో సరిగాఁగ నేర్చునే
జడమతు లైనవారలకుఁ జక్కఁగఁ జిక్కునె సద్విచారముల్.

క. సరసిజలోచనజంఘల, సరివత్తు మటంచువచ్చి శరములపాలై
యిరుగడలఁ గట్టి వ్రాలై, శరధులు కడు నొగిలెఁ దగనిసాహస మగునే.

క. మృదుపదమై మాధుర్యా,స్పదమై చెలిజంఘ రసము చాలఁగఁ జిలుకున్
మృదుపదమై మాధుర్యా,స్పదమై యలరారు రచనవడువు దలిర్పన్.

---

*గుఱెఱుంగమి — మూ. †సముత్కైకొఱగామని — మూ. ౨. సముత్కైకొనఁగా ?

క. పొరలేక సరస తెడలక, వరపల్లవవితతితోడ*వర్తింపక యు
ద్ధరఁ బైఁబడి తలక్రిందై, పరఁగిన సరిరాదు రంభ పదతతితోడలతోన్.

చ. తలవిరియంగఁ బోసికొని తద్దయు నాకులపాటు దోఁపఁగా
జలముల నెప్పుడు న్మునిఁగి సర్వశరీరము భూతిలిప్తమై
వెలయఁగఁ బాడ్లుఁ బూలుఁగొని వేసరకెప్పుడు మోచ దాఁ దపం
బలవడఁ జేయుచున్నయది యర్కసుతోరుతులాం‡స్థలాస్థితన్.

క. అతిమృదు వగుసతియూరుల, నతికఠినపుఁగరికరంబు లారసి చూపఁ
న్మతి రాదయ్యెఁ బ్రతీపము,హిత మల్లా నుపమ నుడువ నిలఁబ్రాజ్ఞులకున్.

గీ. పూర్వపరరూపమంజిమస్ఫూర్తిఁ గాంచి
చెలువకటి పాణినీయంబుచెన్ను గాంచుఁ
బృథ్వి విపులాతిహృద్యసద్వృత్తి మగుచు
వేదపాదమ్ము బనా మది వేడ్కఁజేయు.

క. నీల తానొప నయ్యలి, నీలాలక పిటుఁదురుచిని నిర్జించె నిలన్
వేలాతిగసర్వాంగ,శ్రీలన్ శ్రీగెలిచె సవతిచిట్టక మమరన్.

సీ. దిరదిరం దిరిగెఁ†గుమ్మరసారె రవిజాతపిఱుఁదుతో మురిపంబుఁ జెఱఁగవచ్చి
నట్టేటఁ బడియె మానక సైకతంబులు చెలిజఘనంబుతోఁ జెనకవచ్చి
బలుగిరిదుర్గంబుపాలయ్యె ధారుణి పైదలికటి సరిపడఁగ వచ్చి
రారాపిడులఁజెందెఁ దోరంపుటద్దముల్ పొలఁతిశ్రోణిచ్ఛాయఁ బూనవచ్చి
గండ్లఁబడిపోయె నరదంబుగండ్లు ముగుద
కాంచికాస్థానగరిమంబు గనఁగవచ్చి
పరుషవిషమత్వములు ప్రాసుపాటు తమకు(?)
దలఁపనివి(లేవు)బాలానితంబమునకు.

క. అరుదైన చక్రవర్తిత,నరసుల సహావసతి గలదు చాలుదు మనియో
కరము భ్రమంపడి తిరిగెడు, దరుణీమణినాభిసదృశతకు సుళ్లైపుడున్.

క. లలనామణిపక్షంబునఁ, గలిమియు లేమియును నెఱుఁగఁగానినడుము దాఁ
గలదని తెలియఁగఁజేసెన్,బలునాభీగహ్వరంబు పరిదృష్టంబై.

క. గూఢాగూఢవ్యంగ్యము,రూఢిం గనికనము లమరురుచులు దనర్పం
బ్రౌఢపయోధరమధ్యము,ప్రౌఢులమతి సమ్మదం బపార మొనర్పున్.

*వర్తింపక — మా. ‡ఘలాధిపేన్ — మా. †కుఁమ్మరసాన — మా.

ఉ. అరమణీశిరోమణికుచాద్రియుగాంతరసీమఁ బుట్టుశృం
గారరసంపుఁజాలనఁగఁ గానఁగనయ్యెను ముద్దుఁగుల్కు నూఁ
గారది నిల్వఁగా నయినయంబ్భుతనిమ్న మనంగ నొప్పుచె
ల్వారెడు నాభిగహ్వర మయారె మృగీదృశరూపవైఖరిన్.

క. అరయఁగ మనమున్ దివియుం, బరమాణువుఁ గలదటంచుఁ బల్కించిన వే
హరిమధ్యనడుము సంశయ, పరమాస్పద మౌట నెట్లు పాటిలు నుపమల్.

గీ. చారుతర సైనసనాభిశృంగారసరసి
రసము పెల్లుబ్బి కుచమహీధ్రములనంటి
పాఱునూఁగారుజాలుపైఁ బయలుపడెడు
కరడు లనమించె మువ్వళుల్ కమలముఖికి.

మ. లలిశృంగారరసప్రవాహ మొనరన్ లావణ్యవర్షాగమా
కలనోద్భూతవళీతరంగములు వీకం దాఁకఁ జొల్లుబ్బును
జ్జ్వలతేజోమయ బుద్బుదద్వయము నా జన్మించె నయ్యింతి మే
ల్వలిచందోయి మెఱుంగు లుల్లసిలు భాస్వద్బాహుమూలాంతమై.

చ. అరయఁ ద్రివేణికాజల మనంగుఁజు ద్రుంకఁగ జవ్వనంపు మే
ల్సిరి కడు నించి డింప నొగిఁ జెవ్వ(గు)పైఁడి పనంట్లు గుబ్బ లా
నురవడిఁ డించుచోఁ దొడఁక నొప్పెడు జాలనఁ గాన నయ్యెడు
న్వరహారినీలమౌక్తికసువర్ణనిబద్ధవిభూషణప్రభల్.

క. అప్రకృతభూధరాదుల, కప్రకృతం బయ్యెఁ జెలువయుబ్రపుగుబ్బల్
అప్రకృతతయును బ్రకృతత, యీప్రకృతపుఁజన్నుదోయి నెనయుం గ్రమమున్.

చ. కలయఁ బ్రసాద మొప్ప నధికస్ఫుట మై మధురత్వ మొందఁ గే
వలపదసస్వభావపటుబంధము మీఱ సమస్తభూషణా
వలులు దలిర్ప సర్వరసవాసితఁ గావ్యమునాఁ జెలంగు నె
చ్చెలిచనుదోయి క్లిష్టతనుఁ జేకొని మానదు నో విసంధితన్.

క. ఉరుకుచభూధరపతికిం, గరిఘటములు మిత్రమయ్యెఁ గనకకలశముల్
పరికింప సమతఁ గైకొనె, నరులును సఖభావ మందె నరుదు తలంపన్.

క. అరిగజకటదారణమున, నురుసుమనఃపంక్తిపోషణోదారతచేఁ
బురణించు మొనలు సూపుచుఁ, దరుణీవక్షోజభూమిధరరాజు కడున్.

ఉ. శంక యొకింత లేక చెలిచక్కనిబాహుల సాటి కేగఁగాఁ
[illegible] కంటకములనా లయి లో బలులేమిఁ జెందెఁ గాఁ

మ
బరకజనాళ్ల లట్లగుట వాని హరించు శుచిత్వవృత్తిచేఁ
గొఁకక సత్పథంబు గొను కూరిమిగల్గినహంసరాజియున్
చ. వననిధిఁ బుట్టి సన్మణినివాసము నై హరికేలు వట్టి యా
ధనపతియిల్లు సొచ్చియు ముదంబున మంగళసూత్రవైభవం
బునఁ దనరారనైతి నని పూనిక శంఖము చామకంఠ మై
ఘనత వహించి కాంచు మణికాంచనమంగళసూత్రసంపదల్.
క. నిటలాక్షుఁడు మూలంబున, నట హాళిపత్రంబుమీఁద నమరుటకతన
న్వటఫలము ఫలము గాంచెను, బటుగతిసీయింతిచుబుకభావముగొనుచున్
చ. సరసిరుహాక్షిదంతములసాటికి వత్తు మటన్నఁ గుందము
ల్విరియునుగా నిరంతరము వేసరి చీఁకటిబందిగంబులం
జొరఁబడి వాఁడుఁగా మిగులసూత్రముల న్నరిగట్ట స్రుక్కుఁగా
పొరిఁబొరిఁ గందుగా నెఱయ భూరిశుచాంతరదున్నసీమలన్.
గీ. *అక్షయంపుగుణస్ఫూర్తియమరెనేని, ఛిద్రములులేనిగుంభంబుఁజెందెనేని
తరణినందనముద్దులదంతపంక్తి, యాభిరూప్యంబు గాంచు ముత్యాలబంతి.
ఉ. పంచము లంట మే నిది యపాత్ర మటంచు వనాగమాంతశా
ఖాంచలవృత్తి నై చివుఃరుపాశ్రితమాధవసంగతైకర
క్త్యంచిత మై వధూటిమధురాధరతం జని చెందుటం గదా
కాంచెను సద్విజన్మపరికల్పితసంతతసంగసౌఖ్యముల్
సీ. జలవాసతపమై(న)జలజంబులకుఁ గళాధరునిరాకకుఁ బ్రమోదంబు లేదు
లలి నట్టితప ముత్పలంబున కగునేని మిత్రవైముఖ్యంబు మిగులుచుండుఁ
గలదు భిక్షావృత్తి గండుఁదుమ్మెదలకుఁ బాయిత్వ మెన్నఁడుఁ బాయకుండు
గగనస్థితవ్రతం బగుచకోరంబున కెన్న దోషాకరునింపు గదురుఁ
గాన చక్కని కాళిందికన్నుఁగవకు, నెన్న నివి సామ్య మేగతి నెనయఁగలవు
ఎట్టికష్టంపుఁదపమైన నిలవిగుణత, గన్న ఫలమిచ్చుననుమాటగలుగు టెల్లు.
గీ. నిచులబంధవరాలోకనిస్స్పృమీాళ(?),లమలమాధుర్యరసవైభవాస్పదంబు
లగుచుఁజెలువారుకాళిందిసొగసుఁగన్ను,లన్న లోతమ్ములోయవియబ్జములకు.
సీ. ఛానకన్నులతోడిసాటిఁబూనఁదలంచి భ్రమసి బేడిసలు గాలములఁబడియె
జెలువయక్షులతోడిచెలిమి సేయఁగవచ్చి పొందమ్మిమొత్తముల్బురదబడియె

* యక్షయ్యగుగుణస్ఫూర్తి—మా.

కలు వలు ✓ సుకులు

ముదితచక్షులతోడ మురువు సూపఁగవచ్చి కల్వలు నీళ్ల(లో) సుళ్లఁబడియె
మానిని నయనయుగ్మంబు జోడని లేటికొదమకన్నులు భీతి బెదరుపడియె
రమణిరమణీయతరవీక్షణముల తేట, లూనఁబోవుచుమదిరంబులూఁతఁబడియెఁ
బొలఁతి చూపులచెలువమ్ము బెళుకు లోలయఁ
గోర్కి తేఁటులు బికిరంపుఁగూడు గొనియె.

గీ. చన్పైక మునువ్వుఁబువ్వునుసరవిఁగూడి, యింతిఘ్రాణంబునకు సాటి నెనయ లేక
వంతనంతంతకునుదలవంపుగాఁగన్ల బండుటలుచూడమే ధరామండలమున.

చ. ఎదుట మెలంగువస్తు వొకయించుక కన్పడనీని మైలతో
నదనునఁ బెట్టు తెల్పులకు నబ్బదు నిల్కడ లేదు మార్దవం
బిది కొఱగాదు జన్మ మని యెంచి ధతిస్మరదర్పణంబు ల
మ్మదవతిచెక్కు లై యెపుడు మానని తేట మృదుత్వముం గొనున్.

క. నవనవరోచిర్నిచయ, ప్రవణము లగుకుందరదన శ్రవణంబులకున్
స్రవ తనుచుఁ బల్కుఁ దగునా, స్రైవతను సరిగాక మెలఁగునవసంఖ్యనిలన్.

చ. చెలి చెలువంపుఁగర్ణములశ్రీ హరియింపఁగ నేల వచ్చె శ
ష్కులు లకటా వివేక మొనగూడక యయ్యపరాధ ముత్కటం
బిల నొనగూడె వాని కది హేతువుగా జను లెల్ల నిప్పుడున్
సలసలఁ గ్రాఁగునూనియలఁ జాలఁగఁ జాలఁగ ముంచి యెత్తుటల్.

క. కలకంఠిమృదుకటాక్షాం, చలరమ్యద్యుతులు నిండు శ్రవణద్వయి రొ
ప్పలు నించు*చీరసంబున, విలసిల్లెడుకూపయుగళివిధముం గొనుచున్(?)

చ. జలమరుపద్మనీలజలసంభవకైరవఖంజరీటప
క్ష్యలిహరిణాక్షిమీనహరిణాంకపతత్త్రుల దృష్టిమాత్రనే
తొలఁగఁగఁజేయుఁ గన్ను లని తోయజసూతి నవాఖ్యసంఖ్యల
న్నిలిపెను బొర్బుయుగ్మమున నేర్పున నా సతిపేను లింపగున్.

ఉ. తియ్యన కాని యొండు మతితీ రొకయింతయుఁ గానరాదు నే
నయ్యలివేణికన్బొమలయందముఁ జెందనటంచుఁ జప్పనై
యొయ్యన బెండు గై కొనుచు నుండు మనోజునిచేతిసింగిణీ
యెయ్యెడఁ బిల్లపిల్లతర మించుక యేనియుఁ జేగఁ జెందెనే.

క. కనఁ గన మిగిలెడుమధురిమ, గనఁ జెలికన్బొమలతీరు గానక మరుచే
నన చెఱకువిల్లు ప్రాణము, గనఁజాలక కావె నిలువుఁగన్నులుపడియెన్.

---

* చిరసంబున—మూ.

క. పున్నమనాఁటినిశాపతి, కన్నియ నెమ్మోముసాటి గనలేక కదా
సన్న మగుఁ దజ్జయంబును, మిన్నా ఫాలంబు గాంచు మెఱుఁగులబలిమిన్.

ఉ. తమ్ములమేలు పూనమిని దక్కులవెన్నెల మేనుసోఁకిన
న్నెమ్మివహింపమిం గలుగునింద తొలంగఁగ నిండుఁజందమునం
దెమ్మెలతమ్మియుం జెలువయింపుల నెమ్మొగ మాచుఁ బూనెఁ గా
తమ్ములమేలు మేల్సొగసుఁ దాలుచు లేనగు తేటవెన్నెలన్.

గీ. నవతి గనఁడయెఁ బూర్ణదోషాకరుండు
బహుళమున క్షీణకళలు ప్రతియుఁ గావు
పరిహృతాశేషదోషమై భవ్యకాంతి
నైభవము గాంచు నెచ్చెలివదనమునకు.

క. ఎన్నఁ బ్రతిబింబభావా, పన్నం బగు ముకురమునకుఁ బాటిలు నేలా
*గన్నన్న సమత బింబత, గొన్న వికర్తనతనూజగొనబు మొగముతోన్.

గీ. కాంతివారాశి యగుభానుకన్యమోము
జిగి యొకించుక యప్పుగాఁ జెంది యొక్క
రేయి చెలువొందె యది దీర్పలేమిఁ బొడము
పాపము కళంకమై విధుఁ బాయకుండు.

గీ. బహుళపక్షపాతభావితుఁ డైనట్టి, చందమామ జడుఁడు సాటి యగునె
సమతఁబూని శాస్త్రసర్వస్వవిదురత, వఱలుచుండుచెల్వ వక్త్రమునకు.

చ. పగ లిది రేయి నాక మఱి పక్షవిభేదము గాంచ కెప్పుడుం
దగులు మహోదయస్ఫురణఁ దార్కొను నక్కనికూర్మిపట్టి మే
ల్సొగసుల నెమ్మొగంబునకుఁ జొప్పడునే సరి యంచుఁ బల్కఁగాఁ
దొగచెలికాని దోషములు దూఁకొనువానిఁ గళంకభావితున్.

క. కనఁజనియె ముకుర మిందుఁడు, కొనవచ్చంజనియె మాఱుకొన్నంజనియెన్
వనజంబు గాని నెచ్చెలి, గొనబుల నెమ్మోము సాటి గొన విజ్జగతిన్.

గీ. అమను బింబానుబింబైక్య మరసిచూడ, నరుదుబింబానుబింబులకైక్యవృత్తి
కంబుకంధరముఖదర్పణంబుతోడ, నైక్యమొనగూడెఁ జందురిన కబ్బురంబు.

ఉ. సాటికి రానినీలములు సానల రాపడెఁ బాఱఁబోతులై
తేఁటులు పోయె మేఘములు దీనత మొఱ్ఱలు (వెట్టెఁ) జామరల్
గాటపుఁదెల్లఁబా ఱొదవెఁ గన్పడెఁ బల్వగఁ గేకిపింఛముల్
పాటలగంధికొప్పుసిరిప్రాభవ మెన్నఁ దరంబె చూడఁగన్.

*గంగన్న సమతబింబత—మూ.

గీ, అఖిలసుమనఃకదంబకాభ్యర్చితంబు, నీరజాప్తతనూభవనీలకబరి
దానిసనతించు నేగతిఁబ్రూనవచ్చు, జగముకై నీరములు, మోయుజలవహంబు.

క. అమరెడుకీల్జడ సగ్ధర, కొమరుమిగులు పిఱుఁదు దలఁప గొనబగువిపులే
కమనీయతనువు చపలే, రమణీమణి యారవృత్తరత్నాకరమే.

క. చెలమా సుధ కధరము చం, చలమా కనుదోయి కుచము చాలితకనకా
చలమా నైపుల్యజితా, చలమా జఘనంబు ఘనము చానకు నెన్నన్.

క. రాకాచంద్రుని నగు నా, రాకాంత మొగమ్ము కెంపురావికి మేలౌ
రా కామినియధరము చిగు, రాకా పాదంబు సురుచిరాకారమునన్.

క. †నాకము నగుఁ గౌనమ్మో. నాకము(జిగి)గుబ్బ యలపినాకము బొమ యా
లోకముల సుదతి హారిణా, లోకమ్ము నిందించు నౌర లోకము మెచ్చన్.

క. ధరమా కుచ మాబలుఘణ, ధరమా నూఁగారు ‡నీరదాయకధారా
ధరమా కచంబు స్వర్ణవి, ధరయాధరమా మెఱుఁగు ధరణిజఘనకున్.

సీ. ఇంపారుకీల్జడ యిందనీలముఁజేయు మధురంపు మోము పద్మంబుఁజేయు
ముత్యాలసరిఁ జేయు ముద్దురదశ్రేణి రుచిరంపుమోవి విద్రుమముఁజేయు
శంఖంబుఁజేయును జక్కనికంధర గుబ్బలు బంగారుకొండఁ జేయు
భూమిచక్రముఁజేయుఁ బొంకైన జఘనంబు తలరుమధ్యమ్మునంతంబుఁజేయుఁ
గలికిపాదంబు పద్మరాగంబుఁ జేయుఁ జాననిలువెల్లఁ దప్తకాంచనముఁజేయు
నెలఁదిఁగొనియాడుమాటలు 'పేయునేల, రమణిలావణ్యమొగిసముద్రంబుఁజేయు

సీ, జలధరమాలిక జగజంపుకీల్జడ చంపకమాలిక సరసనాస
భ్రమరవిలసితంబు కొమరారుకనుదోయి మత్తకోకిల యగుమంజుగళము
శిఖరిణి యైమించుఁ జెలువారదశ్రేణి స్రగ్ధరయగు గుబ్బచన్నుదోయి
యనుపవిద్యున్మాల యగును దనూయష్టి మత్తేభగమనయగు మంజుపదము
అలభుజంగప్రయాతమె యారు దనను, బంధురంబయ్యె సర్వాంగభవ్యలక్ష్మి
యరసిచూడఁగఁబంకేరుహాప్తహూతి. విశదలావణ్యమహిమసద్వృత్తమయ్యె

సీ రమణిలావణ్యాంబురాశిలోఁ గనుపట్టుఁ దేఁటులగుంపులు చెలివిమీఁఁలు
మున్నన్నె చందురుల్ ముద్దులమోమును లుప్పిరిము లుంపెంగ సొంపునింపు
ముక్తాఫలశ్రేణి మురువంపుఁబవడంబు శంఖంబు గుబ్బలు లురసనాళ
లుందంపుఁజిగురులు పొంకైనజలనీలి బలునైనహరిగము నిబ్బరపుదీవు

---

† కావ్యమొగము—మూ. † నాకమనగారా—మూ.
‡ నీలధారాధర—మూ.

లబ్బురపుసరపులీనెడునట్టిరంభ, లరిదిగావించు కూర్మంబు లధికమ్మృదుల
పంకజాతంబు లసమానభాసమాన, కాంచనచ్ఛాయ నెప్పు*డొదవించుతీవె.

వ. ఇట్లు నిండుజవ్వనంబున దేవాసురమనుష్యలోక కాంతాదురాపకామనీయ
కలక్ష్మీలీలాయతనంబున సర్వలక్షణైకలక్ష్యంబు నగునమ్మోహనాంగిసఖి
లవిద్యావిజ్ఞానవిమలాంతఃకరణ యని విశేషించి సకలజనపరమాహ్లాదైక
కారణం బగుసంగీతశాస్త్రంబున మిగులఁ బ్రవీణ యగుట యారసి యారసి
కనీలవేణిముఖ సఖీజనంబులు తద్విద్యాపాటవంబుఁ దలిదండ్రులగు ఛా
యాసూర్యులకు డెందంబుల కమందానందంబుగాఁ దెలుపం దలంచి యొ
క్కనాఁడు.

సీ. మేటిమిన్నేటిపొన్నీట మజ్జనమార్చి చిన్ని వెన్నెలవన్నెచీరఁ గట్టి
పొంగుసిబ్బెపుఁజన్ను బొంగరంబులమీఁదసొగసుగుల్బంబట్టుకంచుకము దొడిగి
నెఱికప్పుసిరి నొప్పు నెఱికొప్పు చెలువంద నందంపుఁబూదండ లమరఁజుట్టి
రిక్కరా మొక్కపెన్నిక్కు చక్కఁగఁజేసి చొక్కనెన్నుదుటఁ జేర్చుక్కఁబెట్టి
కలువగమి కెగ్గుగలిగించుకన్నుఁగవకుఁ, గలికి కఱ†నిగ్గుమిక్కిలకాటుకయిడి
యలరు నాణెముత్తెపుసరులఱుత నిలిపి, తీర్చి రీతి వెలఁదికిఁ గూర్చ్చి చెలులు.

క. కాయమ్మునకు నాభరణాని, ‡కాయమ్ము సఖీజనంబు ఘటియించుచనున్
మాయమ్మ సాటియగు. న్నాయమ్మకు మిగులఁ జవతు మాయమ్మనుచున్

వ. తదనంతరంబ.

క. విచ్చేయుము నీవిద్యకు, డ్రచ్చెరువడి నేఁడు సత్సభాస్వాంతుఁ డగుచు
న్నెచ్చని నేలుపు విలిచెను, ముచ్చటగా నీదుపాట మురిపముచూడన్.

వ. అని విన్నవించిన.

ఉ. వచ్చె సఖీప్రయత్నమున వారిజలోచన వెన్క ముందటన్
హెచ్చు కచాదిభారమున నెమ్మెలుకొ నొగిఁగుల్కఁ గొప్పుడా
లొచ్చెము లేనిచీఁకటుల నుప్పతిల న్వడి బెళ్కు మోమునం
దచ్చపుమొల్కనవ్వు జిగి నందపువెన్నెలచాయ లొల్కఁగన్

ఉ. కాంచెను గాంచనాంగి దనుఁగాంచినదక్షు సమస్త విష్టపో
దంచితచక్షు నాశ్రితజనాననదక్షిణవిస్ఫురత్కృపా

*డొదివించితీవె—మూ. †జరెసిగ్గు—మూ.
‡కాయమ్మునసఖీజనంబు సంఘటింపఁజేసెన్—మూ.

సంచితవీక్షణా భ్రాగ్వచనసారతనూచచిదుర్నిరీక్షు నా
కుంచితసద్వపుస్త్రితయగోపనపక్షు హుతాసపక్షునిన్.

చ. కని కరమొప్ప మ్రొక్కి-నను గన్నియ నాదరణాను *వృత్తితోఁ
గనుఁగొని తన్మనోజ్ఞముఖకంజము రంజిల సత్కృతంబుల
న్నినుఁడు కవుంగిలించుకొని యింపుగ మూర్కొని తచ్ఛిరోజము
ల్పనుపడ దువ్వి చిట్లను నపారకృపారసవార్ధిఁ దేలుచున్.

సీ. పవడంపుఁదీవె రా బంగారుబొమ్మరా పొదలెడు రాయంచబోద రావె
గుణరత్నరాశి రా గొనబుఁబూబంతి రా కొమరొప్పు ముద్దులగుమ్మ రావె
యతివమేల్బంతిరా సుందాలకుప్ప రా యొఱపైనకొక్కారుమెఱువ రావె
యప్పచ్చికొండ రా యతనువాలమ్మ రా సొగసైన చందురుసోగ రావె
భ్రాంతి యొనట్టి నాతపఃఫలమ రావె, లలిత మైనట్టినవకల్పలతిక రావె,
రాణగాంచిననాయింటిలక్ష్మి రావె, తలఁపులోనఁగూర్చు ననుఁగన్నతల్లి రావె.

ఉ. బంగరు లీనుచూపు గలబంగరుబోటికి సాటియైన మా
బంగరుకొండ వచ్చెఁ గులపావనసద్గుణవార్ధి వచ్చె నా
కొంగుపసిండి వచ్చె మదిఁ గోరినభాగ్యము వచ్చె వచ్చె మా
ముంగిటికామధేను వని ముచ్చట దీరఁగఁ బల్కి వెండియున్.

క. తల్లివి గద కన్యామ, తల్లివిగద సొగసుఁగులుకుఁదనముల సిరి మే
ల్లల్లివి గద సురభూరుహా, వల్లివి గద మమ్ముఁబ్రోవ నల్లినిభాంగీ.

క. ఒప్పులకుప్పా నినుఁగ, న్నప్పటినుండియుఁ బ్రిమోద మనుజలరాశిం
దప్పక మునుంగు నాకుం, జొప్పడె నభ్యుదయ మెన్నఁ జోద్యము జగతిన్.

గీ. అమ్మ నినువంటిపట్టి మాకబ్బెఁ గాన, చాయచాయకు మర్యాద

— (ఇక్కడఁ గొంత గ్రంథము లేదు) —

దముల్బాలఁ దనర
గేయవాక్కర్త్రి యను పేరు గీలుకొనఁగ, వీణ వాయించె నవ్వేళ నేణనయన.

గీ. †తత్పదముభాతి మంగళార్థంబు గీతి, కది పరాత్మ నచించుట నంచు నెన్ను
శాస్త్ర మాగీత మగ్గీతశాస్త్రవేత్త్రి, కబ్రిమే భావిసన్మం (గళార్థ) మగుట.

క, రూపవతిగీతిభూషణ, దీపితమై మెచ్చుగాంచుఁ దీవ్రిం బువమా,
క్షేపములు వడయువని సభ, నాపాదించుచును మోదమందిరి విబుధుల్.

*ద్వృత్తితో—మూ. †తత్పంబాతి—మూ.

ఉ. చాయలు వేయు గల్గునెఱసామికిఁ జాయలు వేయి రిక్క రా
చాయలచాయ జెం సాతపతన్ ఘటిల్లె మే
ల్చాయలకెన్న మిక్కటపుఁజాయఁ బ్రివర్తిల్లె ముద్దులాఁడి యా
చాయకుమారిగీతి (గనె) సంగతశీతలమాఘురీశుభ్రితిన్.

వ. అయ్యవసరంబున విశ్వంభరానిర్భరభారాయమాణ దుర్మానకంసాదినృశం
సదు (ష్టసర్పగారుడ) మణి యగు (శ్రీ)కృష్ణదేవకపటయాదవశిరోమణి ముఖ
చంద్రబింబరుక్చంద్రి కాడంబరంబున నిజన్మయనజీవంజీవంబులకు సంజీవనం
బపేక్షించి విరించిపథావధి యగుద్వారవతీపథంబు నాత్మశరణపూతచరణ
(సరోరుహ) విన్యాసంబున ధన్యమూర్ధన్యంబు గాఁ గటాక్షించి తత్కటా
క్షసమాక్షిప్తగౌరవ పరభాగసందానిత మహాభాగవతద్విగుణితహరినామా
నుసంధానబంధురరోమహర్షాశ్రికంచుక సముదంచితసర్వాంగనయను
నందామృతధారాప్రవాహంబున నపగతమోహాదిదోషపంకాంతరిత
తాలఘూకృతంబు నణుపరిమాణంబు నతిశకరణంబు దేలియాడ మగిడి
సత్యలోకంబు స్వాలోకవిషయంబు చేయం దలంచిన (జగ) డంపుకూటిజడ
దారి గ్రిహరాజగృహరాజంబు సమీపంబున సమీచీనతానధీ చీనతదనూ
నవీణాగానామృతంబు కర్ణకూపంబులనిండారనబ్బురపడి చేపడిన వీణియవదలి
కదలక మైమఱచి పరచితిహ (?)ంబునంద(న)నిమందపడి (?) డెందంబు
ననంబు గాక మనల మెల్లమెల్లనందేర్చి కూర్చుండి శిరంబుఁ గంపంబుతోఁ
గూర్చి తర్జని నాసికం జేర్చి తనలో నిట్లని వితర్కించె.

ఉ. ఎక్కడిలోక మేఁ గనని దెక్కడిగానము (నాకుఁ గోత్రగాఁ
దక్కిన) దిట్టిగాన మొక తావున నైన వినంగ మృగ్య మ
మ్మక్క యిదెంతిచోద్య మహహా ననుఁ జొక్కఁగ జేసె నద్దిరా
యక్కమలాక్షకీర్తనముచందును డెందము డింద కుందెడిన్.

క. ఔరా మును వింటిఁ బయః, పారావారజకు సాటి (పద్మాక్షి కుమా)
రీరత్న మయ్యె సూర్యన, కారూఢిగుణాఢ్య * నీలయుతులాంశం బై.

క. అక్కన్య సకలవిద్యల, దిక్కులఁ జనసాటిలేక దీపించును బెం
పెక్కు మిగుల గీతములన్, లెక్కింపఁగరాదు మాధురీగుణ మనుచున్.

క. ఈతిరుణి యిపుడు తండ్రికిఁ, జేతం (బిగురొత్త సేవసే) యఁగఁ బోలుం
బ్రీతిగ నెచ్చెలిఁ గనుఁగొన, కీతఱిఁ జన నాకు డెంద మెనయ దటంచున్.

---

* నీనయుతులా — మూ.

వ. ఇట్లూహించు.

సీ. సంగతతత్పురుషపదనిష్ఠానర్థాత్తి నలరారుపాణినీయంబు బనంగ
సిద్ధసాధ్యవిశేషబుద్ధన్యాయాపత్తి శాక్రికృతవ్యాకృత (ఫక్కి-యనఁగ)
జ్ఞాతాత్మరీతి నిర్ధూతాంజనాత్మత సాధ్వలంకృతివిశేషంబు బనంగ
సంశ్లిష్టిరకళాప్రశస్తిసద్భావత సరసాంధ్రశబ్దశాసన మనంగ
నరుగుదెంచెను నారాయణాభిధాయ, కాష్టవర్ణమనూత్తంసకాభిధాన
చతు స్వరస్వరవిశేష, హారిషుహాతికరుండు శుభాకరుండు.

సీ. చందోపరి సితాభజలవాహరేఖనాఁ దగుఫాలగోపిచందనము దనర
నైరావతాలింగితాభ్రపగాబ్జలతాలినాఁ బసిఁడిజంద్యములు మెఱయ
నగ్రికాశ్మీరకింజల్క సముదయంబన జటాసమితి వెలుఁగఁ
గలధౌతనగమధ్యగతనీలవేదిక నాఁ గటిఁ గృష్ణాజినము దనర్పఁ
గల్పకస్కంధపరిణద్ధఘనలతమాల, వల్లి యన వీణ భుజమునం వన్నెమీఱ
నలుదిశలమేను తఱపివెన్నెలలుగాయ, వచ్చెనారముఁడప్పిభావసునికడకు.

ఉ. ద్వారమునుండి రా ముసికిఁ దూర్ణము బంగరుగద్దె డిగ్గి బ
ల్గారవ మొప్పఁగా నెదురుగాఁ జని భక్తిభయాద్భుతంబు ల
వ్వారిగ సందడించుమది వారిజబంధుఁడు సాఁగి మ్రొక్కెఁ ద
చ్చారుపదాంబుజాతములు సాధుకరద్యుతు లంటి రాజిలన్.

క. మ్రొక్కినఁ *జెయ్యులసాకిరి, మక్కువఁ గైగుచ్చి యెత్తిమది ముదమలగన్
అక్కలహాశనమునివగు, మొక్కలుచొక్కటముగాఁగ మొగమునననరన్,

క. దీవించె నీకు దుర్లభ, మేవస్తువు లేదు దీవ నిడకుండఁగరా
దేవస్తు వక్షయంబగు, నావస్తువు నీకుఁ జట్టమగు నిజ మనుచున్.

వ. ఇట్లు భావిశుంభంబుఁ దెలుపు పలుకు వలుకు తొలిపలుకులగమికానిగాదిలి
కొడుకుం గడగనని వేడుక గడలుకొన ముందట నిడుకొని వచ్చి యచ్చె
రువులకు నెలవగు తన నెలవునకుం దెచ్చి దచ్చిదిక్కు లచ్చంపుఁ బచ్చివె
న్నెలలు సొగసు ముసుంగు లొసంగు మగఱామానికంబుల పెద్దగద్దియ
నుంచి, యవంచితభయభక్తి వినయాతిశయ మ్మగునాశయమ్మున నమ్మహాశ
యునకు నిర్విశయమ్ముగా నిజకరకుశేశయమ్మున సదాశయోచితంబు లగు
నుపచారంబులు చేసి యాబేసిగుఱ్ఱంబుల తేరినెఱదొర దొర నెఱుంగని

* జెవులసామిరి-మూ.

గొప్పలకుప్పం దనకూఁతుం బిలిచి యప్పు యిప్పావరహితునకు మ్రొక్కం
జక్కంబడని దొక్కటియుఁ జిక్కదు మ్రొక్కవలయు నని మ్రొక్కించిన
సత్కారుణికపురుషమణి పురుషశిరోమణిపాణిగృహీతివి గమ్ము పొమ్మా
యని దీవించి యనుపం బదపఁ దదనుమతి నమ్మహామతి నిజానుగతసభా
జనంబుల యథాపూర్వోచితస్థానంబుల వసియింప నియమించి తాను
దత్సమీపతలంబున దివ్యభవ్యనవ్య హేమముక్తాఫలాముక్త నిర్మిద్రభద్రాస
నంబునఁ గూర్చుండి యుండెఁ దత్కాలంబున.

చ. *తొలుపటిపల్కుబల్గనులు దుష్టతమోహరణప్రవీణమాం
సలమహిమాన్వితుల్ మహితసత్పథవృత్తినిరూఢభావు లా
కలితదిగంకరాళరుచిగాఢతినూపచిరుల్ సభాస్థలిం
జెలువలరారి రిద్దఱును జేతనజాతము లబ్బురంపడన్.

క. అన్యోన్యకాంతివైభవ, మన్యోన్యముఁ గప్పఁ జిహ్న లవిషయములుగా
నన్యనియం దన్యభ్రమ, మన్యాయత్తంబుగాక యలవడె సభకున్.

క. నింపు నెలఁబోలు మునిమా, ర్తాండుని మార్తాండుఁ జూచి హర్షకైదువుపే
రుండెడుపులుఁగులు భ్రమచే, నొండొండ ముదంబు ఖేద మొందును మిగులన్

గీ. అట్టియెడఁ దమ్మివిడిమట్టుపట్టుదిట్ట, పట్టి యగుపూని కనియె నవ్వెట్టజేజె
గీలుకొనుహాసమున మోమునీటుగుల్క, మాటమాటకు నమృతంబు తేటలొలుక.

క. నీరాక రాక సుస్మిద, నీరాకరమునకు సుగుణనీరాకర యీ
నీరాక గాక యాప్ర, న్నీరాకరమునకుఁ దేవ నేనెఱుఁగుదునే.

వ. ఓసుదర్శనకరశుభకరపదభక్తి మత్సుదర్శన నిదర్శనసమధిగత నిఖిలదర్శన
కాలత్రితయపవిత్రతావ్యంగ్యవ్యంజకంబగుభవదీయదర్శనసమంజససంజీవ
నౌషధంబున మదీయతాపత్రయంబపత్రపానిలయంబయ్యెడు మజ్జనంబు
పరార్థభావంబు నొందెడు మత్తేజంబు వేలోల్లంఘనంబున నలరారెడు మద
భ్యుదయం బనస్తమయంబై చెలువారెడు మదీయనివాసంబు విష్ణుపదంబు
నం జెన్నుగాంచెడు మదధికారంబు గ్రహాతీతం బై యొప్పారెడు మత్కళత్రం
బు కాంతిపర్యాయంబై నెలుంగొందెడు మత్సంతానంబు సమందతఁ గాంచి
యు నమందత దైవారెడు నీరేడుజగంబులఁ దేజోవంతులకు దృష్టాంతంబునై
మెలంగెడు భాగ్యంబు నాకుఁ బొసంగెడు సమాధిమత్కళానిధినిరుపాధి

---

*[illegible]

కకృపాపయోధి నగునీదుసన్నిధికి గమనంబు గమకం బగు మత్పురాతనా
గణ్యపుణ్యపరిపాకంబ యని యని యరసి నిర్ణయించుకొనియెద నధిగతపరమా
ర్థతకు నవాప్తసర్వకామతకుం గేవలపదం బైన భవాదృశులకు మాదృశ
రాజసజనంబు ననుసరించి యత్కించిదర్థప్రదానంబునకు సంప్రదానత గొ
నుట గగనకుసుమంబు గనుటయె సిద్ధం బని సిద్ధాంతీకరించెదం గాదేని
దేవరచిత్తంబు కుతుకలీలాయత్తం బై యదర్థంబు విషయీకరించి సర్వా
ర్థమూర్ధాభిషిక్తంబు సేయ నవధరించెం దదర్థంబు భవత్సన్నిధాన వైభవ
సమాసాదితసంపత్సాకల్యతం దగు భవజ్జనుసవిధంబున నస్తిత్వాఖ్యా
తంబు సంయోగంబు గొని కారకత్వం బంగీకరించు నని నిస్సంశయంబుగా
సంకల్పించెద భవాదృశస్వదృక్పారతంత్ర్యంబునం బ్రవర్తిల్లు నదో వందారు
నకు నెందేని స్వాతంత్ర్యం బతంత్రం బవుట చిత్తగించి వాచావిషయత త
త్ప్రకాశకక్రియం బ్రసరింపం జేయ దయసేయవలయు నని పునఃపునారచిత
ప్రణామంబులం బ్రార్థించిన.

గీ. ఇట్లు *వేపాదములసామియింపునింపు, మధుర భాషలభాషింపఁగానివినుచు
హరికథాసుధయానినయపుడుగాంచు, మోద మందుచు నత్తమోభేదికనియె,

ఉ. ఓయిసమస్తలోకనిచయోదయహేతునిజప్రకాశ భ
వ్యాయతకీర్తి నీకు నిటు లాడఁగఁ జెల్లునె యన్యునట్లు నీ
వాయతనంబ నైతివి చరాచరసంజననావనక్రియా
పాయనిదానమూర్తులకు భద్రకరాగమరూపవైభవా.

క. మిన్నే దేవత యనుచు న్నిన్ను నుతింపం బనేమి నిగమావళులం
గన్నట్టి త్రిపదయే నిను, సన్నుతి గావించుకొనుచు సార్థక మయ్యెన్.

క. వెన్నునిఁ గన్నులఁ జూచుట, నిన్నుఁ గనుంగొనుట మాకునిజ మొక్కటిగాఁ
యున్నలినాక్షు గనుంగొని, నిన్నుం గనవచ్చినాఁడ నీరజమిత్రా.

క. ఇంకొక్కటిఁ జెప్పెదనే. వంక న్నీవ నరిది గాన వైఖరిచే నీ
పొంకపుఁగూఁతుకు వను నీ, వంశకు రప్పించెఁ జుమ్ము వనజాతసఖా.

క. నీలాలక యిది నీలా, లీలావతియంశ నవతరించిన దగుటన్
నీలాంచికా క్రొక్కాడు, †లీలాయదుమౌళి ముద్దు లేమం బ్రేమన్.

క. ఈరీతిఁ బల్కు నీనా పారీణాయుతీందువచనబంధమధురిమా
సారములు చెవులు సోఁకిన, బారాకారములసామి పలికెం బ్రీతిన్.

---

*వేయుపాయుములసామి-మూ. †నీ...యమౌళి-మూ.

చ. హరిపదపంకజాతయుగళాంచితభక్తిపరప్రవేక యా
హరి మనుజాకృతిం బుడమి నందుటకుం గత మెద్ది యమ్మహా
పురుషునిఁ జెందఁజేయఁ దగుపుణ్యపుసాధన మెద్ది రూప మ
ప్పరమున కెట్టి దింతయు నపారకృపాజలరాశి తెల్పవే.

క. అన విని వీణాముని య,య్యనుజుఁ గన్గొనుచు నగుచు నిట్లను నౌరా
వనజాప్త నీదువినయము, విని కని యెఱుఁగము సమస్తవిబుధులలోనన్.

గీ. వేదమూర్తివి నీవె కా వేదవేద్య, నెఱుఁగజాలవె యెట్టైన నెన్ని చూడఁ
బరహితజ్ఞానమార్గప్రవర్తకులకుఁ, బ్రష్టృభావంబు భూషణప్రవర మనఘ.

క, వనజాక్షభక్తిభరవా, వనుఁడవు నీవెంతభాగ్యవంతుఁడవు బళీ
నినునుండి తత్కథాస్మృతి, నెనసితి *నిటనాదుపుణ్య మే మనవచ్చున్.

క. దిన మొక్కనిముస మయిన, న్వనజాక్షస్మరణ మెలఁగ వానివృజిన మ
ద్దినకృతము సుకృతమగు స్ప, ర్శనవేధిస్పర్శ నినుము సౌవర్ణము కా.

చ. తలఁచిన విన్న మానసము తద్ద మునుంగు ముదంబురాశి మైఁ
బులక ‡ లెసంగుఁ గన్నులఁ బ్రమోదజలంబులు పొంగుఁ బూర్ణతా
కలితమనస్కు లౌ పరమపావనమానసు లైన సద్ద్విరా
బళిబళి వాసుదేవుకథఁ బాటిలుమాధురిసార మెట్టిదో.

సీ. సౌశబ్దసంగతి సడలుకావ్యమురీతి విజ్ఞానహీనమౌ విద్యమాడ్కి
సాధుదానము ‡ లేనిసంపద్వైపడి వరశాంతి నెడయు తపంబుభాతి
కంఠరక్తతమానుగానంబువడువునఁ బాలనసేయని ప్రభుతచాయ
శ్రద్ధానురుద్ధత జాఱుకర్మము క్రియ రాగంబు గాంచని రతిపరుసున
సిద్ధపాండిత్యవర్జితసేవ§ రేవ, భూరిపరిమళ మందనిపువ్వుపోల్కి
వాసుదేవునిపదభక్తి వ్రతలువాని, జన్మము నిరర్థకంబగు జలజమిత్ర.

చ. అలపరతత్త్వ మెంతటిమహాత్మునికైనఁ దరంబుగాదు గాఁ
దెలియఁగ నెట్టిదిట్టలను దెల్పఁగరాఁ దెలుపంగ శక్య మే
జలరుహమిత్ర యట్లయిన సంగ్రహసూక్తుల నాదుబుద్ధికిం
దెలిసినయంత దెల్పెద సుధీశ్వర తప్పక యాలకింపుమీ

*నిడనాడుపుణ్యా—మూ. †లొసంగు—మూ. ‡చేయుసంపద—మూ. §క్రేవ—మూ.

గీ. ఈప్రపంచంబునకుఁ బోల్త నెసఁగు చుండు
సచ్చిదానందమయు మాత్మ (సంగ)రహిత
మనసుగతరూప మన్యాపహార్య మఖిల
మానసంచారశూన్యంబు భానుమంత.

గీ. అప్పరంబు సిసృక్షచే నమరిత్రిగుణ, మాయఁగైకొని సగుణత మరగి సర్వ
కారణవిచిత్రకార్యసంఘాతరూప, మగుచు నారాయణాఖ్యత నలరుచుండు

సీ. తత్స్వరూపావాప్తి దనరు జ్ఞానంబున జ్ఞానంబుభక్తిచే సంభవించు
వేదాంతవిద్యచే వెలయురు సద్భక్తి యవ్విద్య గురుసేవ నందనలయు
సద్గురుసేవ నిష్కామత్వమున నబ్బునది చిత్తశుద్ధిచే నమరు నద్ది
కాలుష్య మణఁగినఁ గలుగుఁ దదాప్తిహేతు మలనడుఁ బాపక్షయంబు గాఁగ
నట్టిపాపక్షయంబునే లానవచ్చు, దాన యోగాదిసత్క్రియ లూనఁ గలుగు
నవియుఁ దన్మాఖకరశక్తి దవ్వులుటరిది, కర్తనిష్కామమానసుఁగాంచకున్న

క. భక్తియె స్వతంత్రకరణము. ముక్తికి నని కొంద అందు భూరివివేకుల్
*భక్తిసుసాధ్యజ్ఞానమె, ముక్తిద మని కొంద అందు భూరివివేకుల్.

గీ అఖిల మాత్మేష్టదేవత యనెడుబుద్ధి,నిరతిశయభక్తి బ్రహ్మమై పరఁగు నంత
యనుమనీషయ జ్ఞానంబునగునుగాన, జ్ఞానభక్తుల కైక్యనిశ్చయము మాకు.

గీ. కమలబాంధవజ్ఞానయోగమ్ముభక్తి, యోగమున రెండుబలునావలొప్పుచుండు
ఘోరసంసారవారిధిపారమంద, ననుచుమునికృతులలోకకొన్ని యమరఁబలుకు.

గీ అరయ శ్రవణాదిక్రమాయత్తమవును, జ్ఞానయోగమ్ము తదితరజ్ఞానవిభవ
ఘటకమవుచుండు భక్తియోగం బనంగ, భావమిాగతిఁ బలుకు నిబంధనలకు.

వ. విను మప్పరమేశ్వరుం డగునారాయణుండు లోకరక్షణపరాయణత్వంబు
నం దత్తత్కాలంబుల నానారూపంబులు దాల్చుచుండు నందువిశేషించి.

సీ. ప్రాఁబల్కుగమిఁ దమ్మిపట్టికోఁగూర్పంగ జగమంత పృష్ఠదేశమునఁ బూన
ధరణిఁ గొమ్మునఁదాల్ప దనుజుఁగొమ్ము నగుల్చ బలి నధోభువనంపుఁబట్టసేర్పఁ
గృతవీర్యజాదిభూపతుల విదారింప వనధిమధ్యం బరావణము సేయ
ముష్టికాదులఁద్రుంపఁబురసత్త్వముహరింపయవనసంహార వైభవము గానఁగ
జలచరాకృతిఁ గమఠతఁ జటులకిటిత,నరమృగేంద్రతఁ గుబ్జతఁ బరశుధరత
రాఘవతహాలితబుద్ధతలలితహయ్యత, నఖిలజనములుగొనియాడనతఁడుగొనియె

*భక్తిసాధనజ్ఞానమె—మూ.

గీ. తపన యిత్తఱి నప్పరతత్త్వ మవని, భారకారులఁ గంసాదిఘోరదనుజ
నికరములఁ ద్రుంపవసుదేవునికిజనించి, వఱలుచునుగృష్ణుఁడనద్వారవతిమెలంగు.

వ. అతనిమాయాబలపరిగృహీతదివ్యమంగళవిగ్రహంబునకు నుపమానంబు దు
ర్గ్రహం బవ నసంశయం బేమియు నైనం గీర్తనధ్యానాదిసాధనంబులం బా
పక్షయార్థు లగుమాదృశు లగుదాసులకుం దదుపమానకల్పనసాహసంబు
న నల్పదోషంబుఁ గాదని విచారించి నాయథాశక్తి నమ్మహాపురుషు నంగ
సౌందర్యం బీషత్కాలంబు గీర్తించి కృతార్థతఁ గాంచెద సావధానుండవై
యవధరింపుము.

సీ. ఇంద్రనీలచ్ఛాయ నినయుదేహమువాఁడు ముద్దుగుల్కెడునవ్వుమోమువాఁడు
ఘనశంఖనిభ మైనకంఠంబు గలవాఁడు చక్కని వెడఁదవక్షంబువాఁడు
జయలక్ష్మి లీల నాజానుబాహులవాఁడు దనరారు సింహమధ్యంబువాఁడు
జవసంపదల మించుజంఘలు గలవాఁడు తమ్ముల మించుపాదములవాఁడు
కటిని జెన్నొందు బంగారుపటమువాఁడు, ధాతఁ గన్నట్టినాభిపద్మమ్మువాఁడు
వరలు శ్రీవత్సకౌస్తుభప్రభలవాఁడు, చక్కఁదనముల *కిల్లడైజరుగువాఁడు

ఉ. కిన్కయి రేక మోఁచి పరిశిన్నతఁ గృష్ణునిపాదయుగ్మ మిం
పొంద భజించి యంబుజము లొక్కెడఁ దత్సమతాంశలేశ మా
ప్తిం †దనరారఁ బద్మములపేరది నోసఁడి తత్సమంబుగాఁ
గొందురు పాదపద్మ మని కుంఠితబుద్ధులు గారె లోకముల్

ఉ. అంగుళులే దళంబులు నఖాళులు కేసరము ల్పదప్రభా
రంగణనుప్రదేశము ఘటించితనీలమణీనుపుల్చెల
ద్భృంగములై చెలంగఁ గడుఁ దేజిలుశౌరిపదాబ్జముల్ శుభా
ళిం గరుణించి భక్తులకు లేములు వాపుఁ దమోనివారకా.

ఉ అంగజుమేన్నిషంగయుగ మాకృతి కేము సమానవైభవం
బుం గయికొంటి మింక సరిపోలము కాంతి నటంచు నగ్గలం
‡బ్రుంగి తపించి తత్తనువు వీడిన నాదొన లీడుగా వన
న్సంగతి నయ్యదూద్వహునిజంఘలఁ బోల్పఁ దలంప శక్యమే.

చ. తన కుపమానవస్తు విఁక ధాత్రిని లేదని కాదె గెల్పుపిం
పున ధరియించు మేల్బిరుదు పో యిదినాఁగ మణీవినూత్నకాం
చనమయనూపురార్భటి నెసంగెడుఁ దద్ఘనజంఘ లెంచ న
వ్వనజభవుండుఁ జాలఁడు దివాకరతత్ప్రభ నెన్న శక్యమే.

---

*ఇల్లుడై.మూ. †దనరారిపద్మములు-మూ. ‡బ్రుంగి—అనియుండుట న్యాయమైనను గొన్నిప్రాచీన ప్రయోగములిట్లుగనఁబడుచున్నవి. బ్రుంగి...బోవిడ- అనుట సరళ

చ. ఉసుగనిడాలు మీఱు హరియూరులతీరిక మేటిసాటికిం
గడఁగి సమంబుగా కనఁటికంబములుం బొరవిచ్చి పోయెఁ బ
ల్విడిసెడి దానఁ జేసి "కదళీ న కదాచన" యన్నిషేధ మె
క్కుడు వడినిల్చెఁ గాదె తమకున్ జగతీస్థలియందు భాస్కరా.

గీ విద్యుదావృత ముద్ధురవృత్తిశోభి, దీర్ఘఘంటానురణనసందీప్తిరత్న
పదలసద్గుణలలితశోభామిళితము, పద్మదళనేత్రు నుత్కటిబంధ మమరు.

క. ఘన మగునేని జడంబగుఁ, దనియాశ్రయ మట్లుగాన స్థైర్యము గొనరా
దని మెఱుఁగుఁదీఁగ హరికటి, ఘన మజడంబనుచుఁ జేల కైపున నిల్చెన్.

ఉ. దండితజాండభాండములతండము లుండఁగఁ దత్ప్రచండస
న్మండలియందునుండి గరిమ న్వెడల న్మగుడం జనంగ బల్
గండి యొనర్చిరో యి దనఁగాఁ దనరెన్ హరిదివ్యనాభి *యు
ద్దండత నల్వఁ గన్నవిరి తెద్దయు నొప్పు (చునుండ) భాస్కరా.

చ. తెనదు విచిత్రశక్తికి నిదర్శన మై తనరారఁగా బ్రవ
ర్తని మృగరాజభద్రగజరాజులఁ గొనున యానరీతియం
దు నలవరించి మించె ననఁ దోఁచును దద్విభుమధ్యయానము
ల్గనుఁగొని యెన్న నచ్చెరు వగున్ హరిసుందరభావ మిద్ధరన్.

చ. కవిబుధచంద్రలోకహితకారకమంగళజీవకేతువై
భవశరిపూత్కరంబు గెడపం గడుఁ గూడిన కాలసర్పయో
గవిధిఁ బ్రకాశమందెడు నఖండ †లసద్భుజదండకాండమై
భవముల నొప్పు మాధవుఁ బ్రస్తుతిసేయఁ దరంబె భాస్కరా.

చ. అమర ధరాంబరద్వయమునం దెసలారుగుణంబునందు ది
వ్యములు(?)సురారివైరిరతనాకృతి దాలిచెఁ గాఁ(దా) ననం
తమణిసితాసితార్యగురుధామ వినూతనచంద్రసౌమ్యభా
వముఁ గనఁజాలునే రశనభావము లోనఁ దలంప భాస్కరా.

ఉ. కలికితనాన నోట మిటు గప్పడె నాపను లింకఁ జెల్ల వం
చలవలరాజు చేతొనిశితాసియుఁ బల్కయు నాన ముంగిట
న్నిలిపి స్వజన్మదేశమున ‡నిల్చెనునాఁ గనుపట్టె నారును
నులుకటురంబు నల్లయదుకుంజరుఁ డొప్పుఁజుమీ యహర్పతీ.

---

*యందండత-మూ. †లమసద్భుజ-మూ. ‡నిల్చెనసా-మూ.

క. చతురాస్యవదనమారుత, గతిచే వక్షమున కెగసి కనుపడునాభీ
విరతిపయోరుహకేసర, వితతి యనం గౌస్తుభంబు వెలయున్ హరికిన్.

క. ఒత్తులలువడుచు వక్షార్ధన, భృత్తయు *సుస్వనత లేక వెలవెలఁబోచున్
రిత్తనడి శంఖ మచ్యుతు, కుత్తుకయై పొలిచి సలిచె గుణసిధి యగుచున్.

క. మంజుభుజకీర్తిహీరా, సంజితధవళిమము భూమిసాకల్యధురా
రంజితము కంసదానవ, భంజనుకే లమరు శేషఫణిసన్నిభమై.

చ. తను వెలగాఁ గొనుం బసిఁడి దాన మెలంగుటఁగాని చెల్వులే
దని యలకెంపు తద్విభుశయద్వయమై నవరత్నకోటికాం
చనతను †చీయఁ బుచ్చుకొనసాగ విదోషసదోషభావతన్
గొనబు వహించుఁ జూడ్కులకుఁ గోరిక లీరిక లీనుచుండఁగన్.

క. అకలంకశోవిలాస, ప్రకటిత దోషాసిరుద్ధభావతఁ గొనుచు
స్వీకసించు తన్నఖంబున, కకటా దుష్టములు నెలయు నబ్జము సరియే.

చ. తమిగొను ముద్దుకై తలఁచు తామరసాలయకన్య కన్యకా
భ్రిమ జనియింపఁ దచ్చనకుఁ బన్నిన నిద్దపుఁదళ్కుమించుట
ద్దము లనఁ దోఁచు జూపఱకుఁ దద్దయు మేల్మనుజెక్కు లార చి
త్రమునను వాక్కునం దలఁపఁ దత్ప్రభ సన్నుతిసేయ శక్యమే.

క. బలుగండ్లు నోపఁ బవడము, జలజాక్షుని మోవి యయ్యె సాగెనట వధూ
విలసద్రదనక్షతములు, తొలఁగ దెచట బాధ రాగదోషము గొన్నన్.

చ. ఘనవదనాలవాలముసఁ గమ్రివచస్సుధ నాటుదేరి చి
న్నినగవు వెన్నెలం గలసి చిక్కనయప్పవడంపుమోసులో
యన రదనాళి యింపొనవె నాదటఁ దక్కసలం బనంగఁ గృ
ష్ణునిమధురాధరంబు గడుసొంపు వహించు నిలింపవందితా.

క. కమలాహితవరకాంతులు, శమితతిమిరజూర్తు లమలసత్పథవర్తుల్
భ్రిమిశోరు తారకంబులు, కమలాక్షునియంబకములు కడుఁ దనరారున్.

ఉ. భవ్యతరంబుగా భరణభారసలాంచితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతయుమనం బయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజిలును దైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యదుదారవైఖరులు తెల్పఁగనా కగునే విభాకరా.

*సుస్వనత-మూ †వివ-మూ

క. శ్రీవిన్ శ్రుతిపదగములై, భావింప సువర్ణశబ్దభరణాంకములై
దైవారెడి మంగళమహా, శ్రీవృత్తము లగుచుఁ బొలిచె శ్రీపతిపీనుల్.

క. హారికప్పుబహిరిగద్ధము, *సారిదిగ నవ్వదనచంద్రుఁ జుట్టికొను దళ
త్స్మరరాజనీలశోభా, పరిపంధిప్రభలఁ దనరుపరివేష మనన్.

క. హరిచెక్కుల సొంపారెను, గురుతరనవపద్మరాగకుండలరుచి శ్రీ
తరుణీకృతచుంబనవి, స్ఫురదురుతాంబూలరాగముం దలఁపించున్.

గీ. విషయగంధరాగవిఖ్యాతిచేఁ జెన్నారు. కమలపత్రనేత్రుఘ్రాణమునకు
విషయ మనఁగరాదు వివరింపఁగా గ్రంధ, ఫలిని†గంధమాత్రఫలిత మగుట.

క. గుణవృద్ధులగుచు రాజిలు, ఫణిరాజశయానుబొమలు పరికించునుగా
గుణిగణము వక్రమే †యిది, గణుతింపఁగ వక్రతమమెకా‡ యనియనుమున్.

క. చక్షుఃప్రియమృగమదతిల, కాక్షీణసులక్షణైకహరి యగురమా
ధ్యక్షునలికంబునకు నప, లక్షణవక్రింపునెల తులయనం దగునే.

గీ. ప్రథమకైవడి సత్కళాప్రథనహీంచు. దీపితాకారమై సంవృతి కెన యగును
శక్యమే సన్నుతికి యదుసార్వభౌము, లాలితచ్ఛాయమృదులనిటాలతలము.

గీ. మహితజలధరమాలికామైత్రిఁ గాంచి, వఱలుచుండెడుహరివాలబంధ మొప్పు
లఘుగుణౌజ్జ్వల్యముఖ్యతరాజిలంగఁ, జాల రహిఁజెందుచంపకమాలి కమర.

గీ. అతిససౌందర్య మతసకల్యాణగుణము, లనవశేషంబుగా నెన్న నవిగాదు
వదనములు నాల్గు గల్గినవాని కైనఁ, దలఁచు వేయింట మొలఁగెడు చిలువకైన.

ఉ. అట్టిసమస్తలోకనిధి యట్టిజగద్ధితవేషధూర్వహుం
డట్టిదయాపయోవసతి యట్టితమోపహనామకీర్తనుం
డట్టివిచిత్రరూపఖని యట్టిమహాద్భుతకార్యకర్త నీ
పట్టికి మేలుపట్టయిన పట్టు సుమీ పరికించి చెప్పితిన్.

క. మదిలోపల నిక్కార్యము, వదల ననౌచిత్య మచట వదలదును వదా
వదపదనవనజములు సమ, పదభాషితభూషణంబు పద మందదుగా.

గీ. అబ్జబాంధవ యింతపర్యంత మిట్లు, హరికథాగోష్ఠి సమయ మత్యంతమధుర
మగుచు వెడలెను సత్యలోకానుసరణ, వాంఛ దీర్పంగ నాసతీవలయుననిన.

*సారిదిగనన్ వదనచంద్ర- †గంధమాత్ర పరిచ-మూ. ‡రెండు తావుల 'యని' 'యనియే'కలదు.

గీ. ఇట్లు బలు *పోటునాటలనింపుగాంచు, మించుజడదారిరతనంపు మేలుమాట
లాలకించి ముదంబాత్మఁ జాల నించి, యనుఁడుసద్భక్తిఁబల్కె మెల్లనహసించి.

ఉ. అంతర మోహనంబుబలు పాఱుప నేఁపు గల్గినాఁకు నే
కాంత యనంత మా నుదయ మంది తనంతపదంబు గంటి శ్రీ
కాంతసుధాతికాంతకథఁ గర్ణయుగం బొగిఁ దన్పి తీవు నా
కాంతితనూజ నమ్రజనకల్పకభూజ సుధీజనోత్తమా.

క. ఏకగుణహాని యెఱుఁగని, జోక విశేషోక్తి యందు శోభిలు నమృత
శ్రీకలితసామ్యదార్ఢ్యము, లోకహితాచార బోధలలితవికారా.

గీ. అనఘమీరానతిచ్చినయట్లు నడచుఁగాక యీజనుఁడన్యథాగతిమెఱుఁగునె
వైదికోక్తికి మీవంటివారిమాట, కరయ సత్యత నీరెంటి కర్థమొకటి.

న. ఇట్లు వచించి విరించితనయునకు సవినయంబుగా నమస్కరిండు నమస్క
రించి యతం డనుగఁ గొంతద వ్వనుగమించి మగుడఁ దదనుజ్ఞ భరించి తిరిగి
వచ్చి కూఁతుం గాంచి గ్రుచ్చి కౌఁగిలించి మెచ్చుగా ముచ్చట దీర న
మూల్యభూషణాంబరంబులు ధరింపించి తక్కిననీల వేణీముఖసఖీజనంబులకుఁ
దగిన సభాజనంబులు సభాజనదృక్సభాజనంబుగాఁగావించి యయ్యింతి*ని
లపుటింతులతో నంతిపురంబునకు ననుపుటయు.

క. పరమార్థరూప వినమ. †చ్ఛ్రీకమార్గవిధానదక్షసంస్కృతనామా
సురమాన్య మాన్యచరితా, పరతరమానీంద్ర హృదయపంకజభృంగా.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి
మాధవయజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజన
వంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణశశాంక అభినవనన్నయ
భట్టారకాహ్వ§బలపత్యాహ్వయకవిమహోపాధ్యాయభట్టారక ప్ర
ణీతంబైనకాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమా
శ్వాసము.

---

*పాటినాటల-మూ. †మేలుపుటింతులతో. ‡సరమార్గవిధాన. §విలసత్కా-మూ.

# కాళిందీకన్యాపరిణయము

—: ద్వితీయాశ్వాసము ;—

క. శ్రీమైథిలీమనోహర, కామితఫలదాయ సుజనకల్పమహీజా
శ్యామలవిగ్రహ నుతసు, త్రామా సాకేతధామ దశరథరామా! ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము, ౨

క. తనతండ్రికి నారదుఁ డా, వనజాక్షునిచరితములను వర్ణింపంగా
విని మనము నాఁటి కామిని, తనకుం దగినట్టివిభుఁ డతండని తలఁచెన్. ౩

ఉ. ఉల్లము రంజిలం దనుఁ బయోరుహ*నేత్రలు గొల్వవచ్చి తాఁ
దల్లికి మ్రొక్కి యాయమ ముదంబున సేస లొసంగి దీవనల్
తెల్లముగా నొసర్ప నొకతీరునఁ గైకొని యొయ్య నొయ్యనే
పల్లవపాణి యందుఁ దగుబంగరుగద్దియఁ జేరెఁ జింతతోన్. ౪

చ. వనజభవేంద్రచంద్రధరవాఙ్మనసాతిగమై వెలుంగు కృ
ష్ణునిలలి సొంపునింపు జిగిసోయగము న్విభవంబునుం ద్రియా
తనునకు నారదుండు తదుదంతము సాంతముగాఁగఁ జెప్పఁగా
వినిన మెలంత కచ్చువడి వేగ మొలెచ్చె హృదంబుజంబున. ౫

చ. తలఁచినయంతనే మిగుల దర్పకుఁ డేఁపఁగ నంతకంతకు
న్వలపులు చింత వంత బలవంతపుఁగాఁకలు వింతసేయఁగాఁ
జెలుల కెఱుంగనీక తనచెక్కిటఁ జెయ్యిడ నేరకుండె నా
జలరుహపాణి పౌర్ధ్యమునఁ జెయ్వులు దక్కుచు లోనఁ గుందుచున్. ౬

ఉ. వీనుల విన్న యంతయును వెన్నునిచక్కఁదనంబు సంతత
ధ్యానము సేయుచో నతసియాకృతి కన్నులఁ గట్టినట్లయై
మానుగఁ దోఁచినంతటన మానిని సిగ్గున మోము వాంచినం
గానమి నంతలో వగచి కన్నుల నించును బాష్పపూరముల్. ౭

చ. నెలఁతకు వెంటనే మరుఁడు నెమ్మదిఁ గొల్పి వియోగవహ్ని రా
ల్కొలుపను మించఁగా నెడలు క్రొత్తఁగాడ్పున వేఁడియూర్పు వై
ద్దొలఁకెఁ దదుద్గతాభినవధూమఘనాంకురపాళినాఁ బయిం
బులకలు నిండెఁ దద్రసముపోలికఁ గ్రమ్మె శ్రమాంబు చెక్కులన్. ౮

---

*నేత్రలు.మూ.

చ. తఱుగక నే మెలంగినను దామర*కంటికి మోము దమ్మికో
నెఱేఁ దొవరంగు పొం గిడెను నీటరి సాటి యటంచుఁ బల్కఁగా
నుఱియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీతము గాదటంచుఁ దా
నలివలి లయ్యెఁ జెమ్మట నోయారపుఁగస్తురిబొట్టు మోమునన్. ౯

ఉ. క్రమ్మిన చెక్కుక్రొంజెమట గన్నుకరంబులఁ గ్రుమ్ముచున్ గగు
ర్పొమ్మెయి పైఁడిదువ్వలువ మూఁత దలిర్పఁగఁ గోరిక ల్మది
న్మమ్మర మేనియు న్మఱుఁగుఁ బూని త్రపావశత న్వయస్యలం
గొమ్మ యెఱుంగనీక యటు గొంత మెలంగెఁ బ్రమోహమగ్నయై ౧౦

క. ఈగతి విన్నంతనె మను, లాగక రేఁపన్ హృదంబుజాత్తపునస్సం
ధాగరిమన్ గరితను నాఁ, లోఁ గనఁబడియెన్ రమేశురూపం బెల్లన్.

ఉ. శౌరియచింత్యరూపపటుసంపద సింగిణి గాఁగఁ దగ్గణో
దారత నారిగా హరిప్రధానమనోహరసౌమనస్యశ్రేం
గారము లంపకోలలుగఁ గైకొని మన్మథుఁ డేయఁజొచ్చె నే
పార శిరీషపేశలము లైనతలోదరిసుప్రతీకముల్. ౧౨

ఉ. ఈయదుసార్వభౌముకథ లిట్టివి భావభవానుమోదదం
బై యెదఁ బాయకుండె సఖులార సదా యతనుప్రభావమో
హో యని వారువారుఁ బ్రకృత్యోక్తు లవన్నిని మగ్గ గాఁపున
న్నాయెడఁ గూర్చి పల్కు టని నాన నతాననయై వసింపుచున్. ౧౩

వ. అంత నగ్గద్దియనుండి ముద్దియ దిగ్గన లేచి. ౧౪

సీ. శుక్తికానిర్ముక్తమౌక్తికంబులరీతిఁ గన్నుల బాష్పాంబుకణము లొలుక
జాలాంతరవిలోలచక్రద్వయములీలఁ జన్నవ పైఁటలోఁ జౌకళింప
ఘనసంఘనిర్గతకరకలకరణిగాఁ దుఱుమున నరవిరు ల్దొరఁగుచుండ
సారసోపరిహిమజలబిందువులపోల్కి మోమునఁ జెమ్మట మొల్లలెత్త
నడుము గడగడ వడఁకఁగ †బెడఁగుగడవ
నుడిగెపుఁబడంతు లుడిగెము లొగిఁ బరాకు
చేయుచును జెల్వకై దండ సేయ నదియు
నిచ్చగింపక యింటికి నేగి యచట. ౧౫

* కంటుక—మూలము. † బెగడు కదుప—మూ.

—: కాళిందివిరహావస్థ :—

క. కసికాటుగ భుజియింపుచు, విసువున నేతెంచి పాన్పు వెసఁ జేరె మనో
రసజాతతీవ్రవిరహా, రసమున్నహతాప యాచు రమణి రయమునన్. ౧౬

చ. ఎడయనిమోహవేదనల నెంతయుఁ గుందుచుఁ గృష్ణురూప మే
ర్పడ నునులేఁతకల్పతరుపత్రముమీఁదట వ్రాయు వ్రాసి యిం
పడరఁగఁ జూచుఁ జూచి తనయక్కునఁ జేరిచి ముద్దుగొంచు నా
పడఁతుక నెమ్మదిం బొడమి ప్రాయని ప్రేముడి రేఁప నెంతయున్. ౧౭

క. వనితకుఁ దాపజ్వర మెచ్చినచోఁ బ్రియుకథల రతిని జెందుచు ననిశం
బును మెలఁగ నయ్యకథ్యా, బునఁ గాదే మిగులఁ దాపము న్గలుగక్కైన్.

గీ. సంతతధ్యాతహరికథాసరసిలోన, నెప్పుడును దేలుచుండు నాయిగురుఁబోణి
కదియ సుమ్ము వియోగతాపాహితజ్వ, రాంకురంబున కగుహేతు వాదిమంబు.

సీ. తళుకొత్తుచెక్కుటద్దములకాంతులతోడ మందహాసంబులు మంద మయ్యెఁ
జెలులతోఁ జేయుముద్దుల ముచ్చటలతోడ శృంగారరచనలు రంగు దప్పె
నుడుగక వెడలు నిట్టూర్పులగమితోన కన్నీటిముసురులు గడలుకొనియె
సతిమనోహరరుచిరాకారములతోన మేల్మిబంగారునెమ్మేను డస్సె
మోహదశతోన కోరికల్ముంచుకొనియె, వెడఁదకన్నులతోఁ జేష్టవిప్పువడలె
బడలికలతోన చెమటలు వొడమఁ జొచ్చె, విరహవేదన నాక్రాంతవేఁగుచుండ.

క. గురుతరమదనజ్వరవిస్ఫురణం
జూడ నప్పుడు, ఖరశిఖసంతప్తకనకకళికను సరిదై. ౨౧

వ. ఇట్లు దినదినప్రవర్ధమానవిరహవేదనాదోదూయమానమానస
న నిట్లని వితర్కించె. ౨౨

చ. నిగమగణోక్తికిం బరమనిర్మలమానసవృత్తికి న్సదా
సొగియనియట్టి కృష్ణపదసూచితవస్తువుఁ గాంతు (నేనెటన్)
పయోనిధి నీఁదఁగోరెద
న్మిగుల సుధాంశుమండలము మిన్నక చేతులఁ బట్టఁ గోరెదన్. ౨౩

గీ. అమ్మచెల్ల మహావిరక్తాగ్రయాయి,
ధికరాగసదావృతస్వాంతులైన, మాదృశులకబ్బుననుచు నమ్మంగవచ్చు.

క. చిత్తము గోరిన నబ్బులు, విత్తము లభియించునెడ దు
వ్వత్తరమై తాపవహ్ని వారకపుట్టెన్. ౨౫

సీ. నిఖిలగాయనగాయిసీసుర్లభం బైన యింపులపాట నా కేల యబ్బె
నబ్బుఁగా కేమి నా
నంపుఁగా కేమి నే నగ్గతి వినిపింప నద్దివ్యముని యేల యటకు వచ్చె
వచ్చుఁగా కేమి యవ్వాసుదేవస్వామిలాలితచారిత్ర (యేలచెప్పె)
యచ్యుతునిఁ గోరి నీకోర్కి యజ్ఞరచిత
కావ్యశేఖరి విఫలతఁ గాంచి హాస్యపదము గానున్న దిం కేటిబ్రుకుత్రోవ.

ఉ. కన్నజ
విన్నయతండు దీర్ప మదిఁ బెట్టునొ పెట్టఁడొ ప్రేమఁ బూన న
న్నన్నలినాక్షుఁ డియ్యకొన నయ్యెడునో మఱి కాఁడొ యిట్టినా
బన్న ౨౭

గీ. వేఁడివేలుపు కృష్ణుని వేఁడఁబోవ, గురుత కొంచించు కాంక్షయే కొఱఁతవడిన
గౌరవముఁబోవు నని చెప్పఁగాఁ బనేమి ౨౮

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనిచానలు చాలఁజాల న
చ్చక్కఁదనాలకుప్ప యనుచంద్రునిఁ దామె వరించి రన్న నే
నొక్కతెఁ బోల నెట్లు
సౌఖ్య మీవిరహ మెట్లు తరించెద నేను దైవమా. ౨౯

క. అరయఁగ బహుకాంతాజన, వరణాస్పదమైన వరుని వరునిగ మదిలో
ధాత దా నఘమొందుఁ.

* * * *

వ. ఇట్లూహించువేళ నబ్బాలయూహాబలంబున. 30

ఉ. కన్నియయుంగకమ్రదిను గన్నులఁ దమ్మి జయింప బల్వెత
న్నిన్నక పంచతం గొనుచు మేల్గొనఁ దన్ను భజించు నమ్ములం
దిన్నఁగఁ దెల్వి చేసి పగ దీర్పఁగ వేళ యిదంచు మన్మథుం
*డన్నువవెంట నంటుచు శరయంబున లోఁగొనె నైదుబాణముల్. 31

ఉ. తమ్ములుఁ గల్వలు న్నుచు బృథగ్గతి సాటికి రాక నీటిలోఁ
బమ్మి తపం బొనర్చి మెయి వాయుచు నెచ్చెలికన్ను లయ్యెఁగా
యమ్మదనప్రతాపతపనావృతిగాఁ దమచేష్ట వాయమిం
జు మ్మరవిప్పు మోమ్ములను జూడఁగ నయ్యెను నింతినేత్రముల్. 33

* దన్నువువెంట- మూలము.

క. కలువలుఁ దప్పులు సరిరా, మెలఁగుట కోర్వంగలేక మెలఁతుకకన్నుల్
*బలుకోపుగదుర నిద్దుర, నొలయవు ను వికాసభావ మొందవుఁ దలఁపన్.

క. కాంతకు మదిఁ బుట్టెడుతల, పోంతలతో వేఁడియూపుపులతో మరుబ
న్తోంతలతో మయిపూఁతల, రోంతలతో రేలు హ్రస్వలుప్తము లయ్యెన్

క. కృశగాత్రి యనుచు నెప్పుడుఁ, గుశబుద్ధులు పిలువఁ బికకుచయుగంబుల్
కృశతఁ గొని బుధగణోక్తుల, వశమే తప్పింప నెట్టివారికి నైనన్ ౩౭

క. రవణములు †మీఱఁబడియెన్, ధవళేక్షణమేచకచ్ఛిగ దాఁ గృశియింపన్
రవళి యిటు మాటఁ జెల్లదు, తవిలెన్నూభష్యతయె నిల్వఁదరమాయనుచున్

క. తరుణికిఁ గ్రమమున రుచితోఁ, నరుచులు మిక్కుటము లయ్యె నతివకురుచిగా
కురువేదన దినదిన మ, చ్చెరువుగ నంగంబు లెల్లఁ జిక్కఁగసాగెన్. ౩౮

క. ఆసమయంబున గుణవతి, యాసురచనసాధ్వలాక్రియాసాహిత్యా
బీసడ చేసి నిజేష్టర, సాసన్నస్వాంతవృత్తి నైవర్తిల్లెన్. ౩౯

ఉ. ఉత్తమగాత్రి కట్టియెడ నుత్తమ మయ్యెను గేశపాశ ము
త్యుత్తమ మయ్యెఁ జిత్తము మహోత్తమ మయ్యెఁ గటిప్రదేశ మే
కోత్తమ మయ్యె మోహనపయోధరయుగ్మము చిక్కనంగము
ల్మత్తచకోరలోచనకు మధ్యమవైఖరిఁ గాంచెఁ జిక్కుచున్. ౪౦

చ. విరహనిదాఘకాలమున వేమఱు మోము వడంకసాగె ని
ర్భరహృదయానురాగరసవారిఝురు ల్వయి నుబ్బ నూర్మికో
త్కరములు కంకణాకృతులఁ దాల్చె నెలంతకు నొత విం తయి
ట్లరయ ఘటింపలేఁడె ఘటనాఘటనాకృతి మారుఁ డెంతయున్. ౪౧

గీ. మారనాడింధముండుతాపభారవహ్నిఁ
గ్రాఁచి తనతూపుమొనవాఁడి ‡కమ్మి యచ్చు
చేత సంఘర్షణముసేయఁ జిక్కిచిక్కి
కనఁగనగుఁ జెల్వలలితాంగకనకలతిక. ౪౨

గీ గోకులాయతచేష్టసంకోచ మొదవె, నెమ్మిపురివిచ్చెఁగాలుష్య మిమ్మకొనియె
హంసజాతాంగయాతనాయత్తమైన, యతనుశరవర్షమవిరళంబగును. ౪౩

మ. స్మరదావాగ్ని హృదంతరాళము దహింపం బైకిఁ బొంగెక్కె ని
బ్బరపుచ్ఛ్వాతి యనంగ నంగమున ధావళ్యంబు దైవాఱె భీ

* బలునొప్పి — † మీఱఁబడియెన్ — ‡ కలిమియిచ్చు — మూలము.

కరతత్కామశరప్రవర్షణమునం గన్పట్టు దూర్వా(తృణాగ్ర)
కురపున్ *జొంపమనంగఁ దీప్తు నెఱపెన్ గుంపై నెఱు ల్సోమునన్. ౪౪

గీ. ధార్తరాష్ట్రవినాదంబు లార్తులొదవ, మీఱఁగాఁ బాండురాజకుమారగోచు
లనుగ సద్వర్గమామోదమంద మెలఁగ, నతనుశరశయ్య గాంగేయసుతను †వారగ

కం. పువ్వులవిలుతునిపువ్వుల, ఱువ్వుల నునుఁబూలబంతిఱువ్వులు మఱచెం
బువ్వులు నవ్వులు మఱచె బువ్వులు దవ్వులను మఱచెఁ బూఁబోఁడి సెగన్.

సీ. తనువున నవమహాధనచేలము ధరింప దష్టలంపు ముకకర్దమ మలఁదకు
మోహనప్రాలంబముఖమాల్యములు గొన దతిరుచిరలలంతికాము లిడకు
భృంగికనకధారణాంగీకృతికి రోయు నశనవాంఛకు దూర మగుచునుండుఁ
దాంబూలరుచు లానుతలఁపుఁగో మెలఁగకు చమువులపై భ్రాంతిమొదవనీకు
హీరమయపంజరాంతర చారుకీర, శారికారావములు వినఁ జేరఁ జనదు
చిత్తపద్మనికేతనశ్రీనివాస, రూపజాలంబులోఁ జిక్కి రుచిరగాత్రి. ౪౭

గీ. అతనుసుమహేతిసముదయం బతనుకుచను
నతనుసుమహేతిసముదయం బయ్యె నపుడు
అతిఘనాబ్జసుచిస్ఫూర్తి యబ్జనయన
కతిఘనాబ్జసుచిస్ఫూర్తి యగుచు మెలఁగె ౪౮

కం. అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానుపూర్వి కమలేక్షణకున్
అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానుపూర్వి గతిఁ గననయ్యెన్

లయగ్రాహి. ఆటలకు ముందెసఁగుమాటలకు
నింపొనరుపాటలకు లేనగవుతేటలకు నెమ్మే
నీటులకుఁ గప్పురపువీటులకుఁ బూఁబఱపుఁ
జోటులకుఁ గేళవనవాటులకుఁ గూర్చుం
బోటులకు రేనిమురపాటులకు రచనముల
కోటులకు బోనముల నేటులకు శారీ
చాటులకు సౌధముల చోటులకుఁ గేళలయల
వాటులకు బాల యొలెవాటులకు రోసెన్. ౫౦

గీ. అంతరంగము మాధవధ్యానపటిమ
కలితమై యొప్పఁ దద్వశగతము లగుచు

---

* జొంపమనారి— † వరగ— మూలకు,

నఖిలవిషయములుమెలఁగ బాహ్యాంబుమఱచి
యయ్యయోగిని యోగిని యనఁగఁ బరఁగె. ౫౧

క. అదిమఱచె నిదియుమఱచెఁ, బ్రదవ్వతి యని పలుక నేల మది హరి నొకనిం
గదియించి మఱవదెప్పుడు, నదియునియక నేమి బాహ్యమంతయు మఱచెన్.

గీ. సర్వకార్యాంతరాయంబు సంఘటిల్లు, బ్రీడగైకొన్న ననిచూచి బ్రీడమాని
బ్రీడవతియాత్మలోని యభీప్సితంబు, కన్నతండ్రికి వినుపింపఁగాఁ దలంచు.

చ. నగుఁ దల యూఁచుఁ గన్మొగుచు నల్లడఁ జూచు వడంకు లేచు బ
ల్విగగొను మ్రొక్కుడుం బొరలు వాడును శౌరిఁ దలంచి వేఁడు మై
గగుఁరుపుఁ జేర్చు నుస్సు రను గద్గదపాటు గనుం జెమర్చు నిం
పగుచెలిఁ బిల్చుఁ బల్కుడుపు నంబుజలోచన మన్మథార్తయై. ౫౪

శా. రంభారూపిణి చెట్టవట్టకొన నారంభించు శ్రీకృష్ణుడో
స్తంభం బంచు గృహేంద్రనీలరచితస్తంభంబుఁ దచ్చారువ
క్త్రాంభోజం బని గేహకుడ్యఖచితప్రాంచన్మహాదర్పణం
బంభోజానన ముద్దులాడ మొగ మొయ్యం జేర్చుఁ గామార్తయై. ౫౫

శా. నేత్రమ్మీలన మశ్రుచైత్యవిరతం నిష్కంపతాం స్విన్నతాం
గాత్రం యాతిచ హృష్టరోమచయతాం కంపైకసంపన్నతామ్
పాత్రం దుశ్చ్యవిసంగతే ర్భవతి సద్వక్త్రం చలైశ్వర్యభా
క్తత్రాత్మప్రభవామణే స్సుమజని గ్రీవా హ్యయోగక్రమాత్. ౫౬

క. మదనాసమశరమయ మని, ముదమున లోకంబు లెల్లఁ బొగడుట నిజమై
యొదవ మదనాగగామిని, మదనాసమశరమయంబు మానక యయ్యెన్.

క. అరయఁగ సస్ఫుటతాసు, దరతాన్విత మగుచు సాధుతాభావితమై
తరుణీమణివచనము ప్రాగ్వరచితసరసప్రబంధవిధములు దెలుపున్. ౫౮

గీ. విషమశరశరవేదనోద్విగ్న యైన, వెలఁదిమైఁదోఁగ భారతీవృత్తిఁ గనియె
నట్టివేళన పంకేరుహాక్షసూతి, విన్నని మొగంబు భారతీవృత్తి వదలె. ౫౯

గీ. వాక్ప్రతోడుత నత్తేటచెక్కులాఁడి
చాలఁజాలంగ నెడసెఁబాంచాలిపొందు
చిత్రమొనరంగనవ్వేళఁజెల్వమేను
చాలఁజాలంగఁ గొనియెఁ బాంచాలిపొందు. ౬౦

గీ. విషమబాణుండు విషమాస్త్రవేధ సేయ
నతనిమూఁద మహాతపం బడరికాయ
నతసిసేనాఘనార్భటు లరిది డాయ
మోహనాకార బలు వైనమూర్ఛ మునిఁగె. ౬౧

—: కాళిందివేదనకుఁ గారణము నీలవేణి యడుగుట :—

వ. ఇబ్భాగి ననంగదశాలింగితాంగి యై పౌరలు యమునాతరంగిణీసోదరిం గని సఖీసుముఖు లందఱు గుంపులు గూడి క్షూడనిమనంబున గుజగుజలం బోవ వారల వారించి యమ్మించుఁబోఁడి విషాదంబు నివాదంబై సంభవిల్లుటఁ దన్నిదానం బిద్ది యని నిదానింప నంతఃకరణం బకరణంబుగా నేర దిది యేమొకో తెలియఁ దగు నని సఖీజనంబులు నెఱుంగకుండ రహస్యంబుగా నీలవేణి యయ్యలివేణి డాయం బోయి. ౬౨

ఉ. అల్లన లేవఁగాఁ దిగిచి యంకతలంబునఁ జేర్చి కన్నులం
జల్లఁగ జాఱునశ్రువులసంతతి కైవనఁ బాపి పెన్నెఱు
త్తెల్లన గుంపుదీర్చి చనుమిట్టలపైఁటఁ గుదిర్చి కౌఁగిటం
జల్లఁగ దార్చి చెక్కుఁగవఁ జక్కఁగ నొక్కుచు మేను దువ్వుచున్. ౬౩

క. అమ్మవు గద రెండవమను, నమ్మవు గద కాఁక దేఱు నట్టియుదిరిమే
లొబ్బమ్మవు గద మరు నాఱవ, యమ్మవుగద యనుచు ముద్దులానుచుఁ బలికెన్.

క. కన్నియ విశ్వంభరుకుడి, కన్నన రాజిల్లునట్టి ఘనుఁడు గదా నిన్
గన్నట్టితండ్రి గావున, నెన్నఁగ దుర్లభము నీకు నెద్ది జగములన్. ౬౫

సీ. వ్యాకోచనలినంబు వన్నె తక్కువగాఁగఁ గన్నులు విప్పవే వన్నెలాఁడి
యుదితరాకాచంద్రు నొఱపు కొఱంతగా మోమెత్తి చూపవే ముద్దులాఁడి
కలికి చిల్కలపల్కు కులుకు లుబ్బుల్కఁ జెందఁ దేటగాఁ బల్కవే నీటులాఁడి
తఱపివెన్నెలరంగు తలఁపులో మెలఁగంగ గొబ్బుగా నవ్వవే గుబ్బలాఁడి
విన్నఁదన మేటికే నీకు వింతలాఁడి, యేమి కన్నీరు నించెదే యించులాఁడి
వగకు నింతకుఁబని యేమిసొగసులాఁడి, తెలుపవే తెల్లముగ మోహితీపులాఁడి.

గీ. మగువ యక్లిష్టముఖపద్మమండలమునఁ
బాయకుండెడు బిందుసంపాతమునను
మాధుపులు దేల్పఁ దలఁచి లోఁమాంకుఁ దెలియఁ
బలుకఁగాఁ జిత్త మిడవమ్మ పైఁడిబొమ్మ. ౬౭

శా. కొమ్మా నీవిధ మెంతయుం దెలియ మాకుం దోఁచ దేమమ్మ నీ
విమ్మై లోపలఁ గుందుచున్నదిఁ గని మా కెంతే భయం బయ్యెడు
న్నమ్మి న్నీ కొనఁగూర్చు నెచ్చెలిని నే నిన్నంటి యుండఁగ నో
యమ్మా చెప్పిన దోసమే యెఱుకసేయన్రాదె య్యేవింతనే. ౬౮

క. ఏమైన మున్ను నాతో, నేమంబునఁ జెప్పుదువు నీ కిపు డీవిం
తేమమ్మ తెలియఁ బలుకవు, తామరసదళాక్షి యింత దాఁపుర మేలా.

గీ. అతివ నీప్రాణపద మైనయట్టివస్తు
వితతిఁ బో గొట్టికొన్నట్టివిధము దోఁచు
చున్న యది నాకుఁ జూడ నో సన్నుతాంగి
మాయ వెట్టక యెఱిఁగింపుమా నిజముగ. ౭౦

క. మానుగ నాకన్నను నెన, రైనచెలు ల్నీకుఁ గలరె యరమర సేయం
గా నేల తెలుపు నీతం, డ్రానసుమీ నలువతండ్రియానయుఁ జుమ్మా. ౭౧

ఉ. ఈగతి నీలవేణి కమలేక్షునియాన మెలంగఁ బల్కఁగా
నాగజయాన సిగ్గు మది నాఁటఁగఁ గొంకుచుఁ గొంత దేఱి చే
తోగతిఁ బ్రేమతోడ వగ దొట్రుకొన న్మును నారదుండు దా
నాగరుడధ్వజుం దెలుపు టాదిగ నంతయుఁ జెప్పెఁ జెప్పినన్. ౭౨

వ. విని యక్కాళిందీకీరవాణికి నానీలవేణి యొక్కింతవిచారించి యి ట్లనియె. ౭౩

క. ఇంతీ యింతటిపనికిం, జింతింపఁగ నేల యొకటి చెప్పెద వినుమీ
యెంతైనఁ దల్లిదండ్రుల, వంతుసుమీ కూఁతుఁ దగినవరునిం గూర్పన్. ౭౪

వ. అదియునుంగాక. ౭౫

గీ. బాల్యమున మాతృపితరులుఁ బ్రాయమునను
మగఁడు *ముదిమిని దనయుండు మగువ కరయ
నధిపు లగుదురు తదధీన లగుటఁ గాన
మానవతులకుఁ దమయిచ్చ మలయఁ జనదు. ౭౬

క. జనకాధీనలు కన్నియ, లనుట నిజం బాట హేర లనుమతి సేయం
జనుఁ గాని తమకుఁ దామే, పనుపడి వరుఁ జేరఁ దగదు బాలల కెందున్.

వ. కావున మావలన నీవిధం బెఱింగి నీతండ్రి యగులోకలోచనుం డుచితో
పాయంబున శ్రీకృష్ణదేవుని రప్పించి నీమనోరథంబు సఫలంబుగాఁ బెండ్లి
సేయు నంతకు ధైర్యం బవలంబించి యుండు మని పల్కిన నీలవేణికిఁ గా
ళింది యి ట్లనియె. ౭౮

* ముదిమిం బు–మూ.

—॥ కాళింది నీలవేణికిఁ దనయభిప్రాయంబుఁ జెప్పుట ॥—

ఉ. కూఁతురు పుట్టినన్ జగతిఁ గోరికతోఁ దలిదండ్రు లెల్లెడన్
భాతిదనర్చు మేల్వరుని బంధులలో వెదకంగఁ జూతు రి
ట్లీతఱి *నప్రయత్నగతి నిట్టివిభుండు లభించు నప్పు డ
య్యో తలిదండ్రు లేలొకొ నయోచితిఁ గూర్పఁగఁ జాల రంగనా. ౭౯

ఉ. తల్లి ధనాఢ్యు సశ్రుతునిఁ దండ్రియు బంధులు సత్కులీనుఁ గా
నెల్లరు నోదనప్రదుని నెన్నఁగఁ గన్నియ రూపవంతుఁగా
నెల్లెడఁ గోరు నిన్నియును నేర్తెఱఁ గల్గినకృష్ణుఁ గూర్పలే
రల్లము రంజిలం దన కయోచెల యిట్టి యయోగ మారఁగన్. ౮౦

శా. ఎన్నాళ్లోగాలె నాకుఁ గూర్మి గలవారేకా చెలుల్వీరలై
నన్నున్ డెందమునందుఁ బొందుపఱుపంగాఁజాల రై రక్కటా
నన్నుం గాంచిన తండ్రిగా తపనుఁ డైనం దాఁ బ్రసన్నుండుగా
కున్న న్నన్నని మన్నన న్ననయఁగా నూహించువా రెవ్వరో. ౮౧

చ. తమమది నెన్నరా వరుని దార్చినకన్యలబుద్ధి నెట్లుగా
నమరునొ యంచుఁ గాదె జను లట్ల స్వయంవరక్లప్తిఁ గాంతు రిం
తమనికితంబు లేక యిటు నాథుని మాధవుగాఁగఁ గోరికొం
టి మది గరంగి తండ్రియు వడిన్ ఘటియింపఁ డి దెట్టిభాగ్యమో. ౮౨

ఉ. కాఁకలు ముంచికొన్నమెయి గాంచినవానికి జన్మమంది నేఁ
గాఁకలు ముంచికొన్నమెయి గాంచితి హేతుగుణంబు గార్యము
న్సోఁకదె తప్పనంటిఁ గొఱనోములు నోఁచిననాక యిట్టి బ
ల్కాఁకలు గాక యాజమున కాఁకలు గాంచెనె సూర్యజాత నై. ౮౩

చ. గ్రహములు గన్నవారు గ్రహరాజకుమారిక సాటి గాంతు రే
రహిఁ నని తోడ నాడఁగ విరాజిలుదు న్నది నట్టివారె ప్ర
త్యహ మవియుక్తలై కువలయాష్టశిలామయసౌధవీథిలో
బహువిధసౌఖ్యము ల్గనఁగఁ బంకజలోచన నేనె చూచెదన్. ౮౪

వ. అని యిట్లుత్తలపడి పలుకు నమ్మత్తకాశినిచిత్తంబు పురుషోత్తమాయత్తం
బగుట యెఱింగి యన్నీలవేణి యప్పువ్వుఁబోఁణి కిట్లనియె. ౮౫

*సంప్రయత్న-మూ.

క. ఇపు డేను బోయి రవికిం, గృపపుట్టఁగఁ దెలియఁబలికి కృష్ణుని బిలువం
జపలాక్షి పంపి వచ్చెద, జపలత వోనాడి స్థిరతసంధిల*వమ్మా. ౮౭

గీ. అనిన సమ్మతించి యతివ ధైర్యంబూని, చలన ముడిగి కొంత శాంతిఁబొంది
స్నానపానవిధులు సలుపుచు నొకరీతిఁ, జెలులఁ గల్సి మెలఁగి చింతదేఱ.

ఉ. అంతట నీలవేణి చెలు లందఱ కవ్విధ మెల్లఁ జెప్పి మీ
రెంతయు నాటఁ బాట మఱి యొప్పుల గానవిశేషవైఖరిన్
ఇంతికిఁ గృష్ణుపై మమత యించుక యైనను దోఁపకుండు నా
వింతలు చూపుచుండుఁ డిట వేగమె యేఁ జని వచ్చునంతకున్. ౮౮

—( నీలవేణి ఛాయాదేవికిఁ గాళిందివృత్తాంతముఁ దెలుపఁ బోవుట )—

సీ. అని నీలవేణి యి ట్లతివలతోఁ జెప్పి కాళింది నూరార్చి కడఁక మీఱ
నతిరయంబునను ఛాయాదేవికడ కేగి సరవి నాయమ కుపచారవిధులు
సలుపుచు సుతవార్తఁ దెలిపి వే వెలుఁగున కావార్తఁ దెలుపంగ నవసరంబు
వడయక సందడిఁ బడియుండె నిచటఁ గాళిందియుఁ దమకూర్చు లేమగముల
యాటపాటల వింత సయ్యాటములను, హంసగతులను కేకినాట్యములఁ జిలుక
పలుకులను మఱి పుట్టింపఁ బడియుఁ బడక, వంతమరుఁ డేఁపమన్మథావస్థఁ జెంది.

చ. బయలును గౌఁగిలింపఁ గయిబారలు సాఁచు వికావికన్నగుం
బయఁటఁ దొలంగి కన్బడుఘనస్తనగుచ్ఛము లప్పళించుచు
న్నయమఱి పాదుదప్పి ధర నల్గుడుగైకొను పువ్వుఁ దీఁగెఁ బో
లి యొరలి సజ్జపైఁ బొరలి లేచు వగ న్సరుబారి కగ్గమై. ౯౦

క. చదల శశాంకుని గనుఁగొని, మదిలో శ్రీకృష్ణు వదనమండల మనుచున్
ముద మొదవ సువదనామణి, వదనం బాగి వాంచి ప్రేలవసుధన్ వ్రాయున్.

చ. వలపులు గుల్కు పంకజము వారిజలోచను వక్త్రమంచుఁ దా
వలపులు బల్పు గైకొనఁగ వాసనచూడఁ దదంతరాళస
మ్మిళదళి వే చుఱుక్కునఁగ మెత్తనివాతెఱ నంట నొచ్చెరా
తలతలలోరి ధూర్త యని తన్వి మొగం బెగఁ ద్రిప్పు వేమఱున్. ౯౧

చ. చెలువలు మేనిపూఁతకయి చెంగటఁ బెట్టు మృగీమదంబుఁ దాఁ
నొలయక †యొల్ల మీఱి వికచోత్పలలోచన రోషవీక్షణాం

* గమ్మా. † నొల్లమీరి వెనుకన్ వికసితోత్పల-మూ.

చలములఁ జుర్చురం గను నిజప్రియసీలతనూపమంబుగా
మలయజగంధి గన్గొను సమందరసావహదృష్టిలీలలన్. ౯౩

క. ఘనసారరజముఁ జూడఁగ, వనజేక్షణ వెఱచి శౌరివరహాసన్రశ్రీ
తనరు నని తలఁచి వేఁడుచుఁ, గనుఁగొను నొకకొంతతడవు కడుమోదమునన్

ఉ. సిగ్గున మోము వాంచి నునుఁజెక్కులఁ జెమ్మట గ్రమ్మదేఱ మే
లగ్గుమిటారిగుబ్బచనుజక్కవ లుక్కున నిక్కి గ్రక్కునన్
లొగ్గక పైఁటఁజఱికలో నుడుటూరఁగ స్మారసాక్షి చే
నిగ్గులతమ్మి ద్రిప్పు హరినిద్దపుఁగైసుడివాలు *డంబుగన్. ౯౫

సీ. మృదులఫాలమునందు మృగమదంబుధరించి అొమ్మనఁజారురత్నమ్ముఁబూని
నాసికాగ్రమునందు నవ్యమౌక్తికమూని కరమున రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి రాణించుపీతాంబరంబు గట్టి
కొంతతడవు సుఖింపదు కోమలాంగి, యాత్మనాయకకమలాసహాయవేష
సముచితాలంక్రియావస్తుసమితిఁగొనుచు, నార్తిచేఁగొంతసేపునకవియుఁగినియు.

గీ. మాధవునిపొందునకు నేను మనసుపడితి
నింపు గాకున్న నతఁడు నన్నేలఁడేని
అక్కటా యిద్ది కథయు దృష్టాంత మగుచుఁ
బరఁగునో యేమొ యిల రసాభాసమునకు. ౯౭

సీ. ఏగతి నతనిపొం దే నందనమ్యెద బహువల్లభాప్రియుఁ బడయు నేమి
నీరజాక్షుని గన నేన పోయెద వేగ నీయెడ నింకేమి సేయుదాన
నిదెతా నెవిభుఁ డిటకెలమినే తెంచెఁగా యితనిమోము గనంగ నెనయదుమతి
వేళంబ కావలె వెన్నునితోఁ బొందు నింతలో సీసౌఖ్య మేల కల్గు
నిట్టిచెలువున మెలఁగెడు నింతివిడుచు, మనసు గైకొన వెట్టియే మాధవుండు
ననుచు మన్మథవేదన నబ్జవదన, భావభేదంబులను జాల బడలుచుండు. ౯౮

గీ. ఇట్లు దరిలేనివేదన నింతి యొఱల, నింతనంత మెలంగెడు నిగురుఁ†బోండ్లు
మిగులవగఁగూరుమనసుల మేలుదక్కి, భామ వినకుండ మెల్లనఁబల్కుకొనిరి.

గీ. తలఁప జగతి నయోగఖేదంబు గాంచు
వెలఁదులను గన్నయది లేటో వినఁగ లేదా

*దంబొగిన్. †బోట్లు.

మనచెలి యతనూఁగవేదన గనఁగ నరిది
గడనసేయను విరహదుఃఖంబు నైన. ౧౦౦

క. మగబొమ్మఁ జూడనొల్లని, మగువ మగఁడు గావలె నని *మరుగుచు వేర
మ్మగుసిగ్గు మూలముట్టుగ, దిగఁద్రోచెను గాక యింతటింద్రము గలదే. ౧౦౧

చ. అనుచుఁ దొడంగునిందుముఖుఁ లందఱు నెవ్వగఁ జెంది మొ†ల్లొకో
వనరుహపాణి నివ్వెతలఁ బాపునుపాయము నీలవేణి వ
చ్చినతరువాత నన్నియును జెల్వగుఁ జేరకపోయె నంచు ని
ల్చినఁ దలపోయువారలకు లోలవిలోచన డాసి నిల్చినన్. ౧౦౨

వ. ఇట్లు నిలిచిన నచ్చెలు లందఱు నీలవేణి మనమాటలోనె వచ్చె నింక నేల వలవనివలవంత చింత లనుచుఁ గచ్చుకొని తన్నుఁ జుట్టుకొని గజిబిజిపడు నగ్గజగమనలం గసరుకొని తనతరువాతిప్రోడ యగుశుకవాణిఁ నిది యేమి యో యని యడిగిన నప్పడంతి యప్పొలంతి కి ట్లనియె. ౧౦౩

—( కాళిందివిరహమును శుకవాణి నీలవేణికిఁ జెప్పుట )—

ఉ. కప్పురవీడ్యమొల్ల దొసఁగన్ జిలుగున్ జిగివల్వఁ గట్టఁ గా
నొప్పును చామరంపువిస రోపఁగఁ జాలదు పూలదండలం
గొప్పున నున్పఁగానియదు క్రొన్నెలుటద్దముఁ జూడ ‡దింక నే
మప్పరొ యూడిగంపుఁబను లప్పను లన్నియు మానె నింతికిన్. ౧౦౪

చ. దిరిసెపుఁబువ్వువంటి నును దీఁనబంగరుమేను కాఁకచేఁ
దెరలఁగఁ బాఱె నైనసముదేర విభూషలు జాఱెఁ §జెయ్యులం
గఱకటివాఱె గుబ్బచనుగట్లు వణంకఁగ వేఁడియూపుల్
దఱచులు మీఱె నీకొలఁదనం గనరాని విరాలిఁ గూరెడిన్. ౧౦౫

క. ఎక్కడితాపము చెలువకు, నక్కజ మిది చూడ ముక్కునందలిముత్యం
బెక్కుడునూరుపుఁగాఁకల, స్రుక్కుచు బలవైరినీలరుచి స్రుక్కించెన్. ౧౦౬

ఉ. చక్కనిపెన్నిటిం గొన విచారము సేయఁగఁ గార్యసిద్ధికి
న్నిక్కము చాలఁ దప్ప నటునిల్వఁగ నంటునఁ గందు దీనిమే
నెక్కెడ నిట్టితాపభర మెక్కడఁ గప్రపుఁదావు లీను నీ
చక్కనికొమ్మ నెమ్మనము చాల మహానలకీలి లీనెడున్. ౧౦౭

*మగనిమరువేరెమ్మగు- †ట్లకో- ‡జింతయే- §చైవులు-మూ-

చ. అలికులవేణిసమ్ముఖమునందు వసించుద్విజాళి నాఁగు మే
ల్గల పవడంపుఁగో టగు చొకాటపుమోవిడి వేఁడియూర్పులన్
బలువిశిఖంబులం బగులువాఱఁగ నేసె మరుండు వానిమై
నిలువది యంత నీ ఘనుని నిక్కము గా మన యీసుదీఱెమున్. ౧౦౮

మ. చ్యుతసంస్కారతఁ బొంచి రక్తిను గుణస్ఫూర్తి న్నివారించి సం
తతపారుష్యము మించి సద్రసమ్మృదుత్వంబు ల్విసర్జించి సం
గతిఁ దప్పించి వ్రణంబు మించి శుకనిగ్రంథంబువోలెం గటా
సతిదంతచ్ఛద మొక్కహాస్యపదతం జాలించె వీక్షించితే. ౧౦౯

చ. హృదయమున *న్నివిష్టజగదేకభరాతతకుక్షి శౌరి దాఁ
గదలక యుండుటం బొడమెఁ గావలె మేన నలంత సేద ని
మ్ముదితకుఁ దత్పదానుగతభూరిభుజంగవిషాగ్నికీల లో
వదలక నిల్వఁగాఁ బొడము వక్త్రవినిస్సరదాశుగావళుల్. ౧౧౦

క. అనలంకృతి వ్యాకీర్ణతఁ, గని యక్రమ మైన పతత్త్రుత్కర్షం బగుచున్
వనజాక్షి కచకలాపం, బనభిజ్ఞకవిత్వరీతి నతిఖిన్న మగున్. ౧౧౧

క. అక్క యిక్కాంత చింతకు, నెక్కడిమే రకట చెక్కు నెడయదు హస్తం
బక్కుసుమధన్వుఁ డేయం, జిక్కినని మతూఁడుఁ దమ్మిచిలుక న్మనఁగన్. ౧౧౨

ఉ. పంజరమధ్యసీమ శుకభామునకుఁ బల్కులు నేర్ప దంచక్షు
న్నంజలు గూర్ప దున్నదశిఖాన్వితపాళికి నాట్యవైఖరుల్
రంజిలఁ జూప దింపు లలర న్మశివీణియ మీటి పాడ ది
మ్మంజులవాణి †నొందిలిక మాతరమా తరలాక్షి చెప్పఁగన్. ౧౧౩

ఉ. అంగన కంగజాతదశ లంగమునం గనుఁ దోఁచె సందియం
బుంగన లేదు కృష్ణుకడ మోహము దాహము దాఁకె నేలయం
చుం గనుపించుకోక సతిచుట్టు మెలంగితి నీవు వచ్చి తిం
కం గర మారయం దగునుగా యనఁ జెల్లెలి కక్క యిట్లనున్. ౧౧౪

గీ. వినుము శుకవాణి నీకన్నమునుపు నాకుఁ, దోఁచెనేఁ జెల్లయీచెల్వదోసమేమి
యువత యేనియు వెన్నుని ‡యవ్వనాఢ్య, భావరేఖావిలాససంభ్రమము లెల్ల.

ఉ. కన్నులఁ గన్న వీనుఁగవఁ గ్రన్నన విన్న నటంత నే వడిం
గ్రొన్ననవిల్తుఁ డమ్ము విలుఁ గూర్చు నెడ న్మొగిలేక పైఁడిజం

---

*న్నివిష్ట. †నిందలిక- మా- ‡యావన- అనుట యుక్తము, గాని, పాదాదియందు యె వళ్ళయుకటుకు యవతయని ప్రయోగించుటచేఁ గవిప్రయోగ మిదియె యేమో. [illegible]

టన్నఁగు కన్నె గేదఁగితుటారిమిటారికటారిఁ దాఁగటా
యెన్నికఁ దీసి యాయమునవే యదరంటఁగ దానిఁ గ్రుమ్మఁడే. ౧౧౬

గీ. అయిన నిట్టిమాట యావెలందుకయొద్ద, ననిన డిల్లగుడుచు నట్లు గాన
సరయుదను పదుఁడని యతివలఁదఱుఁదాను, నింతియింటికేఁగి యెదుటనచట.

క. కనుఁగొను నెడ నచ్చేడియ, తనమది మదనానలంబు దరికొని కాల్పన్
వనటం బొగులుచుఁ గృష్ణుఁడు, తనకన్నులఁ గట్టినట్లు దనరినఁ బెలుచన్.

—॥ కాళింది మనసునఁ దోఁచినకృష్ణుని బ్రార్థించుట. ॥—

క. పలుకుం జెలి నునుముంజేఁ, బలుకుంజిగి ముద్దుఁజిలుకపలుకులఁ బ్రోవం
బలుకుఁగులుకొలుకుపలుకులు, పలికెం బలుకుల్ర్చిలుకు భావముదోలఁక॥.

ఉ. కాయము మారుబా(ణముల) గాయముల న్వగఁ జెంది వేఁడఁగా
దాయపు మోముఁ జూపవుగదా యమునుగుండియ పూని యేఁపఁగా
నాయము గాదు సిగ్గు విడ నాయముగా దని మిన్నకుండఁగాఁ
జేయదు పాప మీవలపు చిత్తము తత్తఱ మాఱఁజేరవే. ౧౨౦

సీ. ఇపుడుగా కనుగల్గె లింపుసొంపులుమీఱి వెలసె నీరాకకు విబుధచంద్ర
యిపుడుగా యీమేన నెనయుతాపం బాఱె నినుఁజూడ సత్కాంతినీరవాహ
యిపుడుగా హృత్పద్మ మెసఁగె సామోదమై సరస నీవుమెలంగ సాధుసూర్య
యిపుడుగా మానసం బేర్చుఖేదతమంబు స్రుక్కె నీచే సుతేజోమహితాశ
యిపుడుగా కామినీమాత్ర మెనయలేని, సౌఖ్యసంపదఁ గైకొంటిసన్నిధాన
మిపుడుగా సౌమనస్యంబు నిరవుకొనుచు, సొబగు మీఱఁగనలరెదసురభిచరిత.

సుగంధి. మానరా చలంబు నిన్ను మాని యన్యుఁ బూనరా
పూనరా నిజార్తి మాన్పఁ బుణ్యమొందు గానరా
కానరా కృపం దనర్చి కావు నేను దీనరా
దీన రానికీర్తి లేదు దేవ నీకు దానరా. ౧౨౨

ఉ. చొక్కటి నీదుముద్దుజిగి చొక్కపుఁబ్రాయపు రూపుమేల్మికిం
జిక్కితిఁ గమ్మఁదేనె జడిచిల్కులఁ (జిమ్మెడు) మారుబాకికిం
దక్కితి నీకు వాఙ్మయసుధారసధారలు గ్రుమ్మరింపఁగా
గ్రక్కున గారవింపు బిగికౌఁగిట జాగిటు లేల యేలరా. ౧౨౩

చ. మనమొగి సర్వకాలమును మానక నిన్నె భజింపఁ దద్బలం
బున భవదాకృతిం గనియెఁ బుణ్యవరేణ్య మనంబు కూర్మియున్

మనసిజవేదనాభరము మానుగ దేవరకేల లేదొ యి
ట్లనఁ దగు నెట్లు నీవు ఘటితాఘటనాకృతివాదు వీశ్వరా. ౧౨౪

చ. స్థిరత గనంగఁ జాల దొగిఁ జిత్తము బాహ్యవిశేషవస్తుసం
సరణము గాంచు నంచుఁ బలుజంపులు సేయుచుఁ బ్రోవకుండెదో
యరయ నణుప్రమాణ మగునట్టిమనంబు సమస్తకుక్షి వై
పరఁగెదు నీవు ముంచికొన బాహ్యముఁ జేరఁ జరింప నేర్చునే. ౧౨౫

ఉత్సాహ. వగపు జాఱ వగలు మీఱ వలపు లూరఁ జేరరా
నగవుసోన మొగముతోన నలువుపూనఁ బల్కరా
తగవు మానఁ జనదు గాన తలఁపులూనఁ గూడరా
బిగువుఁజన్ను లురముచెన్నుఁ బెరయ నన్ను నంటరా. ౧౨౬

క. కరుణ వొడమ నీకరణిం, గరుణ స్వనతఁ బలుక మదిఁ గసఁబడు మాయా
తరుణుం డూరకయుండినఁ, దరుణీమణి హృదయసీమఁ దలకొనునలుకన్.

గీ. నెనరుచేఁ బాలొసంగెడునెలఁతపాలు, విసముగాఁదలపోయుచుఁబిన్ననాఁడు
అకట తెగటార్చుపనివాఁడ వౌటఁ దెలిసి, వెండి నినుఁగోరుకొల్లను వెఱ్ఱిగాదె.

చ. కల నయినం బయిం గనుట గానని వ్రేతలనెల్ల శీలముం
దొలఁగ విరాళి ముంచి రతిఁ దోఁగఁగఁ జేసితి వాదియందు ని
వ్వల బతిమాలినం దిరిగి వంగియుఁ జూడ వటన్న విన్కని
న్గలయఁగఁ గూడ దా వలపు గట్టిగఁ బట్టె న దేమిసేయుదున్. ౧౨౯

క. అగుణుఁ డరూపుఁ డనాముం, డగుట న్నాకతఁడు లక్ష్యమా యని శ్రుతులే
తెగి చాటి చెప్పఁ దెలిసియుఁ,దగని తగులునకు మనంబుఁ దాఁ బరువెత్తెన్.

చ. మునుపటిపుట్టుక న్భువనమోహిని మైథిలకన్య (కూర్మి) నిం
డినతనభార్యఁ జిచ్చున వడింబడఁ జేసెను నిర్దయాత్ముఁ డై
నను నిపు డమ్మనోభవునవారతబాణపరంపరాహుతా
శనఘనకీల మ్రంద నిడఁ *జాలఁడె తాళఁడె వీఁడు జాణఁడే. ౧౩౧

గీ. ఒఱలు చిట్టి కృష్ణునొడబెఱుంగకదూఱు,కొనుచు మోహవశతఁగూరుచున్న
తరణితనయఁ జూచి తరుణులు మది మీఱు,నార్తి డాయవచ్చి యతివ కనిరి.

క. వచ్చె మనసీలవే ణిదె, మచ్చికఁ గను విచ్చి చూడు మనికిత మెల్లన్
విచ్చును సత్యం బాడెద, మెచ్చేము లే కిచ్చలెల్ల నొదవెడుఁ దల్లీ. ౧౩౩

*జాలెడు-మూ-

వ. అని పలుక నచ్చిలుకలకొలికి యించుక కన్నువిచ్చి హెచ్చు మనోజవేదనాభరంబున. ౧౩౪

చ. అదె సఖులార పట్టుఁడు మదంతరశాంతినితాంతరాగసం
పదలు హరించి చోరుఁ డటు మాయముఁ జెందు నటంచుఁ బల్కఁగా
మదితరొ విం టె యహా నవ్వును ముద్దియకో యని తారకాంతగా
మది సరిపుచ్చుకొంచు నడుమాననినెవ్వగ నీలవేణియున్. ౧౩౫

ఉ. డాయఁగవచ్చి యమ్మరుకటారికి డాయఁగవచ్చు నెచ్చెలిం
బాయనికూర్మిఁ గౌఁగిటికిఁ బాల్పడఁజేయుచుఁ దల్లి చింత నీ
కీయెడ నేల చింతిత మొకించుకనాఁడు సహింపఁ జేకుఱుం
గా యదునాన నానకృప గల్గఁగఁ గల్గని దేమి నీకగున్. ౧౩౬

క. పరమాణుమధ్య వినుమా, పరమాణుద్రష్ట లేని పట్టఁగ నిది మా
తరమా యనఁదగునట్టిది, పరమార్థం బైన దొరకుఁ బరమార్థముగన్.

క. తరళేక్షణ పరిమాణ, స్వరసంధిక్రియ విపత్తిఁజను పటుధైర్య
స్ఫురణము తద్ధ్యాంచ, త్స్వరసంగతి సాటి శోకసంగతి కమరున్. ౧౩౭

గీ. ఇట్లు నీలవేణి యెంతేని నెనరున, జెలులతోడఁ గలసి చింతదేర్చు
చుచితమైనయట్టియుపచారములుచేయు,చుండియించుకెడయనొకదినమున.

క. ఇంతి యయోగవ్యథచే, నెంతయుఁ దెలుపెక్కు మేన నెనయు త్రియామా
కాంతద్యుతులుం దెలియు ని,తాంతోష్ణినుచేత మిగులు తాంతతకలిమిన్.

క. మొగు లెఱుఁగనిబలుచిత్తడి,మిగుల నొగిలెఁగన్నుదోయి మొలఁతకు దానన్
మిగులుచు నశ్మాయితాపము, తొగకంటికిఁజిత్రమరయఁదొలఁగక నిలిచెన్.

—( కాళింది చెలుల మొఱఁగి యుద్యానమున కేగుట )—

వ. అప్పు డమ్మోహనాంగి సొంపు దొఱంగి కుసుమశరుండు కుసుమశరాసనం బు గుడుసువడ భసలగుణంబునం బొసంగించి మించి కుసుమశరవిసరంబు లు విస్మయరగతిం గసరి ముసురుకొనఁ బరఁగింప వెఱఁగుపడి విరహపరితాపశరధిఁ దరియ దరి లే దని తదుద్భటభట చటులమహాటవిం బడి వడిం ద ద్విశిఖశిఖిశిఖాసంఘాతంబుల నిడి యెడలు విడుతు నని కడిందిసాహసంబున నుడిగంపుఁబడంతులఁ గూర్మిపడంతుల నెఱుంగ నీయక యొంటిఁ బడుకింటి లోని పాన్పు డిగ్గి వెడలి చనుసమయంబున. ౧౪౨

క. అత్యుద్ధతకుచజఘన, ప్రత్యక్షం బగుచుఁ గ్లేశపడు నవలగ్నం
బత్యంతదుర్బలం బై, యత్యుద్ధతు లొదవఁ బేద కబ్బునె సుఖముల్. ౧౪౩

చ. వెనకపోలంతు లత్తెరుపు వేగఁ గన స్సుమనో వ్రజంబు గాఁ
బెను నెఱిగుంపుటి గ్గొరసి పెల్లు వడుం గరిసంపు రత్నముల్
సను *నటుసేయఁ దద్గుణము సన్నను దత్కృతి కేల చాలెడుం
గనుఁగొన †నట్టి నైకగుణగామిత సన్మణులందు వింతయే ౧౪౪

క. వలఁ బాసిన జక్కవకవ, పలె జాలియ నెడయు మేలు బంగరుబొంగ్రం
బులు నాలెఁ గుచము లగపడ, బలుతొమ్మపయి న్మెలంగుపయ్యెదజాఱున్.

చ. తెఱచకుఁ గెంపుఁగంట నెడ తెవ్వని బొప్పకణంబు లత్తఱిన్
ముసు వగుఁదొల్తఁ గావి తెలిముత్యములై మఱి వెండి యూర్పుఁ బె
క్కఱిమినఁ గందు మోవిపయి నాని వెసం ‡గయి పెక్కుఁ గెంపులై
నెఱిఁ జనుగట్టులన్ దొరసి నీటుగఁ గ్రాఁగిన పౌనజంబులై. ౧౪౬

గీ. కన్నె కైదండ లేక మున్నెన్నఁడేని, నడుగు వెట్టఁగఁజాలని యబల తెంపు
గతన లేనిదిజవమూనికడఁగినడచె, నహహ ప్రాఁబోణులధిక సాహసలుగారె.

ఉ. అంతము లేని పంకజభవాండము లొక్కెడఁ దాల్చుకుక్షి మే
ల్పొంతలమాయగొల్లని నవేద్యమహామహిమంబుచే నణు
స్వాంతమునందు లీలగ నహర్నిశమున్ భరియించునట్టియ
క్కాంతికిఁ దోడు గావలెనె కంతుఁడు తోడుగ నొంటి §గూడునే. ౧౪౮

వ. ఇట్లు చని యంత. ౧౪౯

క. నవరసఫలరుచిశోభిత, కవిరాజము సుప్రసాదఘటితము నగుచున్
ధవళాక్షి సమ్మతం బగు, కవిసత్కృతిఁబోలు కేళికానన మొందెన్. ౧౫౦

స్రగ్ధర. చిగురాకుంజిమ్ముమంటన్ జిగిదళుకొని పింజించి పూఁగమ్మదుమ్ముల్
మొగిసుళ్లుగట్టి మింట న్మసరు తెరువునఁ బువ్వుఁదేనెల్ జడి న్మం
పఁగ మేల్పంపంగిపుప్పొంబదువు రవితపో ల్పర్వఁ గల్పాంతకాలం
బుగతిం గొల్పాపుకోనం బొంపడుచు వడి న్మార్గిలం బొఱియంతన్ ౧౫౧

ఉ. తెప్పిఱి యెట్టకేల కటు దెర్లినఁ బైపయినుండి పూవిరుల్
గుప్పిల నున్నుమేనునను గొబ్బున బొబ్బలు లేవఁ గ్రిందటం
బుప్పొడి సోఁకి పాదములు పొక్కఁగఁ జేతులఁ దోఁగితోఁగి చే
యప్పటియట్లు పొక్కనను హాయని యూర్చుచుఁ బొర్లిపొర్లి యున్. ౧౫౨

ఉ అంతట నొయ్య లేచి చరణాబ్జములం గలకాబ్జపత్రపున్
దొంతర దాసినూలుకొని నూల్కొనఁ గట్టి జరంగుచు నద్రిం

*నిటు సేయుసద్గుణము-మూ †కఁటి-యూ- ‡గటి పెక్కు-మూ §గూడ నే.

జింతిలె నక్కటా మొదలు చెచ్చెర వీడఁ దలంచినన్ క్షణం
బింతట నిల్వఁగా దొరకునే మఱి యిటులేలొకో దాఁటి వచ్చితిన్. ౧౫౩

వ. అనుచుఁ జింతింపుచుఁ గనువిచ్చి కనుంగొనఁ గట్టెదుట నంత. ౧౫౪

ఉ. తామరతూఁడునాళములఁ దార్కొను సొమ్మొద యిప్పగుండు లు
ద్దామతఁ గూర్చి వల్లిగిసెతావులపుప్పొడిమందు గూరియున్
హేమలతల్ ప్రసూనాగ్నిశిఖ లేరుచు జానకి తా దమర్చి యా
పై మొగరంబుగట్టిన తుపాకులపై ల్లెలగోలుమూఁకలున్. ౧౫౫

మాలిని. చికిలితళుకుఁగళ్కు లిజ్జుక్క జాళ్వామొనా
నికరపుఁబనుల నాఁటించుగేదంగిపువ్వ
ల్లుకలకు మొనయీఁకెల్లుంపుగాఁ గూడి యచ్చోఁ
బ్రకటత నెలగోలుంబారు నెక్కొంజెలంగన్. ౧౫౬

సుగంధి. పచ్చతొటిడాలుటెక్కపక్కెరల్ చెలంగఁగాఁ
బెచ్చుపంచదార మెక్క బీరుమీఱు రంతుఁగన్
గుబ్బి పాంథవైరకోటి గుండె లల్ల ద్రవ్వఁగాఁ
బచ్చి దేఱు మారుతేజిపౌఁజు లొప్పె నాదటన్. ౧౫౭

ఉ. తుమ్మెదసర్వెణ లొప్పరయ దూఁకొని పుష్పరసోరుదానముల్
గ్రిమ్మ భరమ్ముగాఁ గురియఁగాఁ జిగురుంజిగి మేలుధాతుచి
త్రిమ్ముగ నొప్పఁ బువ్వుగమి దట్టపుడాలు మెఱుంగుఁగత్తులై
ప్రిమ్మగఁ గుంజకుంజరపుఁబంక్తులు రంజిలె *నక్కజంబులన్. ౧౫౮

మత్తకోకిల. వల్లిరశ్మిపినద్ధచక్రనిబద్ధకోకిలఘంటికా
వేల్లదారవకీరఘోటకవిస్ఫుటోదయకేవలో
త్ఫుల్లసూనశరాసబాణమనోజ్ఞతూణసమగ్రతా
సల్లలత్రుచిత్ర భూరథసంఘ మాదట నొప్పగున్. ౧౫౯

శా. నానాసేనల నీగతి న్భవనసన్నాహ్యాత్మజై త్రైకయా
త్రానూనంబుగఁ జైత్రమంత్రివరుఁ డాయత్తంబు గావింపఁ దే
జోవవ్యుం డరమాయుధుండు నిజవిస్ఫూర్తి న్విడంబించిన
ట్లైనం జాన యిఁకెట్లొకో తెలియుమం చాత్మ న్విచారింపుచున్. ౧౬౦

మత్తకోకిల. ఇంకనొక్కయుపాయముం గల దీతఁడుం దనప్రాణముల్
గొంత నొక్కతఱిన్ హరింపుడుఁ గూరి కాఱియ వెట్టకే

*నక్కరంబులన్ - మూ.

నంకిలింతయుఁ దీర వేఁడెడి నాతనిం బ్రియమందఁ ద
త్సంకటేషుశరాగ్నిదుస్సహాశయ్యపై నొడ లేర్చుచున్ ౧౬౧

క. మారుదయ చాలు నతనికి, మారుఁవలుక వెఱచునొక్కమారును దేఁటుల్
మారుతములు శుకపికభా, మారుతములు మదనదహనమారుతము లొగిన్.

వ. అని నిశ్చయించి. ౧౬౩

స. పసిఁడిమిటారిగట్టుదిగువం దగునెత్తమునం దఖండమై
పొసఁగు మెఱుంగుఁజప్పదరపున్ జిగిరత్నపు మేలుకట్టుపైఁ
బసగలకోనలోఁ దళుకుబంగరరంటులతోఁటకోటలో
మునరి జవాదిపున్గునలపుం దగ సూరెలపై బుగుల్కొనన్, ౧౬౪

శా. పూవుం దేనియ కాల్వచెంత విరిమావు ల్పొన్నచాల్కంచెగాఁ
గ్రేవ న్సంపెఁగగోఁటల్ బెరయుచక్కన్మల్లెగుర్వింద పూఁ
గీవల్లుం *బలుదాక్షకప్పగల †పందిళ్లంటులోఁ దమ్మిపూ
బావిం జెల్వగుచల్వచప్పరముగప్రింపుంబలుందిన్నెపై. ౧౬౫

శా. కందప్పుం దిగవొందఁ బాంథవని తాకాం × తాంగధాతువ్రజం
బందంట న్వడి గుబ్బి త్రిప్ప వెస నాయాధాతువు ల్గ్రమ్మ సం
దంబం బొందగు చెందొవ ల్మొదలుగా నప్లేర్చు పువ్వమ్ముల
రం దాఁ గొన్ను రచించి యందుపయిఁ దాఁ బ్రియోపవేశంబుగాన్

వ. ఒడలిడి యుడుకుచుఁ బడంతుక పొడ గడలుకొన నుండి తనమనంబున.

చ. తనమదిలోన నుండుకొనఁ దాపము దుర్భర మయ్యె మేనునన్
ఘనపవనమ్మెగ్రోలు నగు ‡శాఁకను నేగతి సైఁచె నొక్కొ య
వ్వనజదళాక్షుఁ డక్కట యబద్ధము డోఁచెఁ §జరాచరాత్మయా
ఘనున కిదేలయబ్బు మయింగాఁక మనుం డిడునంచుఁ జింతులున్. ౧౬౬(?)

ఉ. అక్కట వేగిరంపడుచు నందితి నమ్మరునంపవెజ్జలో
నెక్కొనుశౌరి ఖేదపడునే నమి వచ్చె నటంచు లేచుచుం
జిక్కెనె యిట్టివేదనకు శ్రీపతి యూశరరాశిమీఁదఁ దా
నెక్కొని సౌఖ్యమొందెడ నని నెచ్చెలి (వ్రాలెను) సెజ్జ మెల్లనన్. ౧౬౮

గీ. మదనునాఱవయ మ్మన మగ్గునెలఁత, యాత్మనైపమ్య ముడిపిన దైన సింతిఁ
బాన్పువైఖరిచేబాధపఱిచె నమ్మ, లెనయునౌచిత్య మిల నచేతనము లెల్ల.

వ. ఇవ్విధంబున వనంబునం గుసుమశరశయ్య మెలంగు మెలంగ నంతనక్కడ.

*. యాగా. †పందిళ్లుగా. ×దాగదాధువ్రజ. ‡కాంతకు. §జరా ససరాంత-ము

ఉ. సుందరయాన యిందుమణిసుందరమందిరసీమ లేమికిం
దందరఁ జెంది సుందరుల తద్విధ మెంతయు నీలవేణికిం
బొందుగఁ జెప్పినం జెలులఁ బల్కనఁ జూచుచు నుల్కి నెమ్మదిం
గొందల మంది హా యెటకుఁ గోకకుచామణి యేగెఁ జెల్లఁబో. ౧౭౩

క. అని చెలుల దూఱుచును మది, వనటం గూరుచు లతాంగి వడి నచటచటం
గనుఁగొని చొప్పరయుచుఁ జెలి, ఘనతరశృంగారవనముఁ గనిచొచ్చి వెసన్.

చ. అడుగులజాడఁ జూడ మలయానిలపోతవిధూత మైనపు
ప్పొడి పయి సంతతం బొదవు పూవిరితేనియ వానఁ గానఁగా
నపుడమిఁ బువ్వుంబొద ల్చిగురుమ్మావులు తావుల జోక మోక చొ
ప్పడు నిరవు ల్గలంకుగమిపజ్జలు నన్నియుఁ జూచి యంతటన్. ౧౭౪

ఉ. మిమ్మర మైన మైసెక లపూర్వపుటూడ్పు కడింది వెట్టియుం
గ్రిమ్మఁగ మిక్కిలిం గమలి కన్పడు నిర్గడ తీవెజొంపముల్
*గుగ్రిమ్ముడి జాలుపువ్వులును గుబ్బచనుంగవ పీఁచురత్నముల్
గొమ్మపదారవిందములు గూడఁగ నోఁచినతోఁ నెఁ దెల్పఁగన్. ౧౭౫

క. అత్తైమవునఁ జన నొక్కెడఁ, జిత్తభవునియంపసెజ్జఁ జేరి బలువగల్
కుత్తుకబంటిగ నొంటిగఁ, జిత్తము తత్తఱముఁ జెందఁ జీ తులుదాఁకన్. ౧౭౬

చ. పగలొనరించుజేని సెకి పగ్మినలేఁదొగజేని రేకతోఁ
దగవున కేగుదాని సెకదాలుపువేలుపు సోఁక జోకనో
నొగిలినపూలదండ పగ నూల్కనుదాని వసంస్కృతాంగి యై
జిగి × విడనాడు కాకవితవిన్నతనంబు వహించు నెచ్చెలిన్. ౧౭౭

సీ. వీనులు ముయ వచ్చి † వె (సనేం.గు) ళులువీడుఁ గలకంఠకలకంఠ గానతతికి
ముసుఁగు వెట్టఁగఁబూని వెసఁదోఁచు బటిమంటమాధుర్యమాధుర్యమధువిస్మృతికి
సీత్కరించియు నెండి ‡సీత్కరింపమిఁ జెందుఁ బల్లవపలవభల్లహతికి
వడఁకియుముగుడ గొఅడుపాటు మలయాగమలయాగమసమీర చలకృతికి
నిట్టూర్పులుదొ ల్లథ యపడియెఁజేగిచుంతెఁ, దనువుదొఅఁగంగఁదలఁచినదానికకట
మారుచెయ్యల కేలాకోమా అకోనఁగ, వనుచు వెచ్చగనూర్పుచునడలుదాని

చ. కనుఁగవ విచ్చి చూచు మదిఁ గన్పడుఁ గృష్ణుఁ డటంచుఁ జెంగటం
దనసుతమాలసాలరుచిధట్టము దార్కను రిత్త కౌఁగిలిం

*గగ్రిమ్ముడి-మూ- కగముడి- శ్రీపతిగారి భాసనవ్యాఖ్య- కొగ్రిమ్ముడియనుచివర్ణవఁహారము
† వచనాకు †వె...ల్గటలు- ‡సీత్కరింతఁగ.

చినఁ దనచేతిలోఁబడమిఁ జెన్నఱి కన్నుల నీరు *నించి యం
(ది) వనలపాన్పుఁ జేరి విధిఁ దిట్టుచు వెచ్చగనూర్పు నిచ్చెలిన్. ౧౭౯

క. ఉడుగనికన్నీర్వాఱదం, బడి జాఱెను శయ్యఁ జూచి పాపప్రదేశం
బొడలిచట విడువ × నీయఁడు, చెడఁజూచెనుఁ గటకటాయిసీ యనుదాపిన్

ఉ. అత్త మొలం జెలంగెను మహావసనంబు కరంబు చేగచే
హత్తి హరింప మున్ను మన సందన నాఁడవు మమ్ముఁబోఁటులన్
రిత్త మొల న్మెలంగ విహరించుట నీమది కెగ్గ దోఁచునే
దత్తరకాఁడ యంచనఁగఁ దత్క్రియ నీవొనరించు టెన్నఁడో ౧౮౧

ఉ. పల్లవవృత్తి వీ వధరపల్లవఘాతకు మొగ్గిసు టీరో
పల్లవమున్ హసించు జిగిపట్టెని యంచునో తత్సమాసము
న్వల్లభ సంచరించుఘటన వర్తిలఁజేసితో యంచు నే నన
న్మెల్లనఁ బంట మోవి గొని మేలగు కెంపులు నించు టెన్నఁడో. ౧౮౨

చ కలికిమిటారిగుబ్బచనుగట్టుల వ్రేగున జోర్వఁజాల వి
చ్చలు క్షణమాత్రి నాయెడఁ బొసంగఁగ నిల్పుదునో సుధారసం
బు లొలుకనీక మోవి పలుమోపున నానుదునో యిఁ కేమి కా
వలె నది సూత్రనంచుఁ దమి వాఱఁగ ని ట్లలరించు టెన్నఁడో ౧౮౩

చ. తలఁపున నిల్పుచు న్మమతఁ దాలిమి నిల్పఁగ లేక కౌఁగిట
న్నిలుపున గుబ్బచి మోముపయి నెమ్మొగ మూఁది యు మోవి తేనియ
ల్పలుమొన లాని చెక్కుఁగనఁ బల్మఱు గీటుచు నంతఁ గేళిమై
యలరులపాన్పుపైఁ †బెనఁగియాడుట యెన్నఁడొకో మనోహరా. ౧౮౪

చ. మగని ‡మెఱుంగుఁజేల మిటుమార్పడఁ గట్టితి వాతఁడు వ్రయ
మ్మొగ భవదీయవస్త్రమును బూని నెఱుంగ రిదేమి వింత యిం
త గలవటే సయాటములు నాతిరొ సన్నకుసన్న పోయి పూ
ర్వగతి బొసంగరాదె యని రామ లనంగ మెలంగు టెన్నఁడో ౧౮౫

చ. అని పలవించు దానిఁ దను వారియ నెంతకడింది యోజ ది
ట్టను విడ జార యుం చిటునటుం బొరలాడెడుదాని నింక న
న్ననినఖరాత్ము దూఱికొనఁగాఁ బనియేమి దయం దొలంగెఁగా
నెనరుది నీలవేణి యని నెవ్వగ వెల్లి మునుంగుపైదలిన్. ౧౮౬

*నింగమె.....పగల. + నిస్పృడు ‡మెఱుఁగువారు- వహా. పెనఁకువాడుటనియు నర
వస్త్ర. † [illegible]

గీ. సకలభూషణలక్షణసంగమంబు, పీడనాడుచుఁ జూడ్కికి వింత యగుచు
లలితవైఖరి గనియునబ్బింబుగాఁగ. సదృశవస్తునిబంధన సడలుదాని. ౧౮౭

చ. అనయము మారుఁ డేయుపువుటమ్ముల నెమ్ములు గాఁడి వాడి నె
మ్మనమున వంతఁ జింతిలుచు మక్కువఁ జెక్కిటఁ జేయిఁ జేర్చి నె
క్కొను (పెను) వేదురందు ననుఁగున్నవలారతనంబుఁ జూచి గ్రొ
క్కున భయవిహ్వలాత్మ యయి క్రొమ్మెఱుఁగారు మిటారికత్తెలన్. ౧౮౮

ఉ. సంపడి చెందకుండ నొకచాటున నుంచియు నీలవేణి తాఁ
ముందుగఁ బోయి కౌఁగిటను ముద్దియఁ *జేర్చి ముఖాంబుజంబుపైఁ
జిందునునుంగురుల్ లతగఁ జేరిచి చెక్కిట నిచ్చలంబుగాఁ
బొందిన మేలు కేల్దుడిచి పొందుగ విందులు సింద నిట్లనున్ ౧౮౯

ఉ. అమ్మకచెల్ల చెల్వ త్రిణమైన వయస్యలఁ బాయ వెన్నఁడున్
నమ్మజి వారికన్నఁ దమి నాపయి నెక్కుడు గల్గుగాన పి
విమ్మయి నొంటి రాఁ దగునె యీకడుగోలవు నీకడింద్రి సొ
ధమ్ముల కేమనందగుఁ బదమ్ములు పుష్పపడి క్లేటు లోర్చునే. ౧౯౦

ఉ. పల్లవసంగతి న్మెలఁగుపంచము లుంగెసుచోటు మాటకే
యుల్లస మైన బేరజము లీఁగెడుమాలు విసాళిపాటు అం
పిల్లెడికావు చూడఁగనె బ్బెట్టు హారించెడిముచ్చ పెంచ్చి సాం
పిల్లెడునిక్క యక్క యిది భీతిల కిన్నటి కేలవచ్చితే. ౧౯౧

క. నగవారి నెఱుఁగనైతివి, తగ వారడిపాలు సేయఁ దలఁచితివయ్యో
మగువా యింతటి కట్టిడి, తెగు వాను మటంచు నెవరు దెలిపిరి తల్లీ! ౧౯౨

క. శయ మానుచుఁ జెక్కిట సం, శయ మాసఁ బనేమికసుమశరుఫలనయో
భయమా నవలా నీకు న, భయ మానలినాక్షుఁ డిచ్చుఁ బరమార్థముగన్.

చ. సకియ మరుండు నీదుకనుసన్నలవాఁ డట యొక్కకత్తుకై
పికము శుకమ్ము నీపలుకుఁ బేరిమి దాఁటఁగ లేదు నీదు స
త్కి కచగుణంబు నంచగమి; సీవి వసంతుఁ డలంతి నీపనీ
పనుఁ డటు నడ్డసేయుచు భవాద్భుత కీర్తులు రాఁగ నర్హమే. ౧౯౩

క. మొదట ననంగుఁడు మదనుం, డదనున విరియంగఁ బాఱునట్టివి శరముల్
వదల వవి మృదులవిషమున, మదనువలన భీతి నీకు మది వలదమ్మా. ౧౯౪

* పె.

ఉ. నీరపరాగదోషముల నీటు దొలంగఁగఁ దాఁ బయోరుహం
బీసుచిరంపు గన్నులకు నీ డనఁగూడక యుండుఁ దొల్తఁ దద్
న్నీరజజాతికిం దవము నేఁడు ఫలించెఁ గదే కటాకటా
నీరపరాగము ల్గలిగి నీ టఱు నీకనుదోయి ఘాటిగన్ ౧౯౬

చ. చెలువకు పూవుఁదేనె బిలుచి త్తడి నైనను మాన కెప్పుడు
న్మలయుచు నుండుఁ బుష్పాశిదుమారము నేగతి నోర్చితమ్మ సం
కులమదబంభరప్రకరకుట్టన నైనఁ దొలంగ కెంతయుం
గలయఁగఁ బర్వు తేనెజడి* కారియ మూరియఁ దాని నైఁచితే. ౧౯౭

సీ. జలమున జీవించుజలజనాళంబులు దినుమందగతులు సంధిల్లుచోటు
నతిరక్తముఖత సంతతసత్ఫలచ్ఛిద నడరుకల్లరులు నజ్జాడునిక్క
కనుగెంపుగదురఁ జొక్కపులేఁజిగురుఁ బోఁడిచి మనుపినాళులు చెలఁగుఁబ్రాయ
మలినచ్ఛదముఁ బూని మధుమాత్రి వాసన సోక్కుమత్తాళి పెంపెక్కవంక
యిటను మెలఁగంగఁ గటక తేమిటికి వచ్చి
తో ఘనమృణాలభుజకాండ యోసుబింబ
దశనవసన యోకిసలయతరుణచరణ
యోసురభిళాంగి నెమ్మది నోటలేక.

చ. మెలఁతరో కృష్ణుపై మనసు మెత్తని దెంతకడింది యయ్యెనే
కలితమృదుత్వసంపదల గాదిలి చందురమామ యాదిగాఁ
గలసుకుమారవస్తువులఁ గా దను నిచ్చెలువంపుమేను నేఁ
జెల యిటువంటి బల్కటికిచేష్టలఁ బెట్టఁగఁ బట్టె నక్కటా. ౧౯౯

క. గురుశిక్షచే మహాగమ, గురుమర్మము గనియె మున్ను గురుకుచ యిప్పుడుం
బరికింపఁ గనియె మన్మథ, గురుశిక్ష మహాగమంపుగురుమర్మంబుల్ ౨౦౦

గీ. అతిఘనాగమసంబంధ మతివ కమరె
నతిఘనాగమసంబంధ మబలఁ గన్న
యినుఁడు చెందఁడో చాయయు నెనయ లేదో.
కారణగుణంబు కార్యంబు గనఁగ రాదో. ౨౦౧

గీ, కృష్ణునందు సరాగత గీలుకొన్న
యింతి శపరాగసాంగత్య మెట్లు పొసఁగు

నెన్నఁగఁ బరాగ మెపుడు సహించునింతి
కిపుడు దాని సహించుట యెంతయరుదు. ౨౦౨

గీ. విదుషి వభ్యర్హితపదార్థవేత్రి వీవు, తండ్రిఁబోలుచు మమ్ము సంతాపపడఁగఁ
జేయు నేటికిఁ దల్లియా ఛాయ బోలి, చల్లఁజేయవె మమ్ములఁ జంచలాక్షి. ౨౦౩

వ ఇట్లు పల్కుచు నాలోన.

ఉ. అక్కట యెందునైన హరిణాక్షులు చక్కనివారిఁ గోరరో
మక్కువెఱింగి తండ్రి గరిమంబ్రియుఁ గూర్పఁగ వేరమింపరో
చక్కఁగఁ గూడి యిట్టిపలుజాడలబూమెలు చూచినారవా
యక్కరొ నీకు" గల్గె నని యాడెను చేడెలఁ జూచి వారలన్. ౨౦౪

చ కనలుచుఁ బల్కు పల్కు కనుగందని ముద్దులగుమ్మ యమ్మనీ
మనమునఁ గోరుకొన్న యలమాధవు నీధవుఁగా ఘటించు నీ
జనకుఁడు *నేఁడొ తేపొ యతిసౌఖ్యము నొందెదు తెల్లవాఱినం
గనుఁగొనువారు మెత్తురు వగల్గొని తెంపున కిట్లు చొత్తురే. ౨౦౫

చ. పొలఁతిరొ యాఁడుచందమునఁ బుట్టినవారికి నెల్లఁ గోరికల్
గలయవెనీకె యన్నటులు గాదిక నే మని యంటివేని పైఁ
దొలఁకఁగనీక కూర్మి మదిఁ దొట్టిన గుట్టుగ మట్టు సేయుచు
న్నలఁగుపొలంతి యెన్నఁదగు మేటి నెలంతలలోనఁ బైడలీ ౨౦౬

క. కన్నుల నీ రేటికిఁ దెలి, గన్నులచెలి కొన్నినాళ్లు గడవం దగవే
కన్నుల మూఁతం జేకొని, కన్నులవిల్కానిబాధ గడచెదు పిదపన్. ౨౦౭

మ అని సిగ్గక్కఁగఁ బల్కునం దరుణి యయ్యబ్జాక్షి కంఠంబున
న్ననుఁగేల్దమ్ములు గట్టిగాఁ బెనఁచి కన్నుంగోనఁ గొ్రవ్వఁడినీ
ర్వొవఁక న్వాడిన మోము దమ్మి చెలిమ్మద్దుం జన్నుఁబూబంతులం
దను నొత్తిల్లఁగఁ జిక్కఁ జేర్చి ‡రహించిందం బల్కు మందంబుగన్. ౨౦౮

†ఉ. కాఁకలుముంచు మేనుగలకట్టిడితండ్రికిఁ బుట్టునాకు మై
కాఁకలుగాక (సౌఖ్యములు గల్గు) నె యక్కట తప్పవంటిఁగా
కాఁకల కోసమై కొఱఁతగాంచిన నోములు నోఁచునాకు బ
ల్కాఁకలు గాక యాజమున కాంచెనె కాఁకలుతత్తనూజయై. ౨౦౯

ఉ సానలుపట్ట నోర్చు నినుచక్కని కూఁతురఁ (గాలియోరగా)
నూనవిపానఁచ్చటల కోడని §యేటికి ముద్దుఁజెల్లెలన్

*నెనె రేపె ‡రక. మూ †చూ ౨౩వ పద్యముపోలికి. §యట్టికి-మూ.

హానికి మూలమై జగతి నాడిక కోర్చినతేనితోడఁ గా
నేని భరింప నావశమె యిట్టి యయోగదవాగ్నికీలలన్. ౨౧౧

చ. నను గనినట్టివారలకె నావయిఁ గూర్మి యొకింతలేక య
న్వనటఁ దొలంగఁజేయుట యవాస్తవమై యిటు లుండుకోఁగ ని
ప్పుని మది మీకుఁ బట్టదని పాల్పడి చెప్పఁగనేల యిద్ది మీ
కనభిమతంబ యేని రుచి*యబ్బనె గ్రక్కున నీదృశోక్తులన్. ౨౧౨

క. అటువంటితల్లిదండ్రుల, నిటువంటి యనుంగుఁజెలుల నే నందుటఁగా
యిటు లాప డెడసి కోరిక, చిటుకురు మనసుండ నమరి చెలు వందిరిఁగా.

ఉ. నీలరుచు ల్దొలంకు సురనిమ్నగచెంగట దర్శచంద్రికన్
మేలగుదచ్చినాదముల మెచ్చగ నప్రిజకన్నమూను లే
వేళ నుతుల్ ఘటింతు రతివేలమదీయమనోవ్యథాభిదా
లాలసతం జనించి యతిలాలితిఁ జెందెదు మీదుకీర్తులన్. ౨౧౩

సీ. కన్నవారికి జెప్పి కరుణ పుట్టఁగఁజేసి తలఁపు చేకూర్పరే తల్లులార
మీరైన హరికి నామేనితాపముఁ దెల్పి యతని నింపరే యమ్మలార
మున్నిట్టి కార్యంబుఁ జెన్నుగా ఘటియించు చెలువల వినరటే మెలఁతలార
భాగ్యవంతుల కిలఁ బ్రాణదానము మించు పుణ్యంబుగలదటే పొలఁతులార
నే విశేషించి మీదాన నెలఁతలార, మనసు మీదెంత కటికియే మగువలార
యనునయంబునఁ దీసనే వనితలార, తాళఁజాలను మీయాన తరుణులార!

సీ. వెతకింతకైనఁ దాళితి నయో నేఁజెల్ల నేనెంత కటికినే నీలవేణి
యాఁడుఁబుట్టుకఁ జెందినట్టి యింతులకెల్ల నీలాగు లేదటే నీలవేణి
యెటువంటిపని యైన నీడేర్పఁగలవని నెమ్మి నమ్మితి నిన్ను నీలవేణి
కూర్మిచే నుండెదు కొమ్మలలోఁజాల నెనరుదానవుగదే నీలవేణి
నీదునేన రెండుఁ బోయెనే నీలవేణి, నేర్పుచేఁ గార్య మీడేర్పు నీలవేణి
యేల యీవట్టిమాటలు నీలవేణి, తాళ హరియాన యిఁక నేను నీలవేణి

ఉ. చక్కెరవిల్తుఁ డేయుసుమసాయకపంక్తిఁ దరిప్రాభిమానముల్
గ్రక్కునఁబోకమున్నె చెలికత్తియ మొత్తము సేయునారడిం
జిక్కఁగఁ †బల్కు లంగడికిఁ జేరకమున్న ప్రియంబుగాఁబ్రియు
న్నక్కున గారవింపఁ గలయంతకు నోఁచితినంటె నెచ్చెలీ. ౨౧౪

* యబ్బదె †బల్పులంగడికి

సీ. మాధవాధరసుధామాధుర్యమునఁ దేలు వంశంబుజన్మంబు వడయ నైతి
హరిభుజాంతరవాససిరతి నింపార హారమణిస్వరూప మై యమర నైతి
యాదవహాళిమోహాసితాపాంగకలాపంబు నై యేని యొప్ప నైతిఁ
గమలామనోనాయకమనః ప్రియోద్దామమాధవి నై యెట్లు మలయ నైతి
నకట వీనిలో నేదైననొకటి నైనఁ, బొంగునుబ్రియాంగసంగమాభంగసుఖము
తపనసుత నైతిఁ దాపంబుఁ దఱఁగ నైతిఁ, జెలులు మీ చేతిరట్టు చేసలయ నైతి.

క. వలపు పగవాగ్ని కైన, న్వల దది యెటులన్న నట్టి వలపున నేనం
దొలఁచెదుఁ బ్రాణము లిగడే, ని ఋపుట యేగండమయ్యె నిక్కము చెలువా.

గీ. ఒకుల వెత యొకు లెఱుఁగ రౌ నుర్వి ననుట
నిజ మనుఁగుఁజెల్వ లే రవ్వ నెఱపఁజొచ్చి
రకట మది తాప మిటు మీకు నరసి తెలియఁ
బడదు మోచు (వాఁడెఱుఁ)గుఁ గావటిభరమ్ము. ౨౧౯

చ. పతులను గోరు నెల్లరకుఁ *బాటులివే యయినట్టు లైన నీ-
సతులు చెలంగి నన్ను నెకసక్కెము లాడుదురే యిదంత నా
కత యగుఁబోలు నెట్టయినఁ గానిము ప్రాణము లిపు డేన ను
న్నతఱిఁ గదా యిఁ కెవ్వరు ననంగల యాడిక లబ్జరోచనా. ౨౨౦

గీ ఔర యప్రస్తుతప్రశంసాస్వితంబు, పల్కనను వ్యాజనిందానిబద్ధసూక్తి
లలితసంగతభాష నేర్పొలయునన్ను, మీరు నవ్వులయెఱుఁగ నెమెలఁగోర

గీ. వనిత యర్థాంతరన్యాస మొనరు నెట్లు, మదికి నిరపేక్షవస్తుసమర్థనమున
మదికి నిం పగుఁ గాదె సామాన్యఘటిత, భవ్యవస్తువి శేషసంబంధమునర.

సీ. కలదన్నఁ గలవానిఁ గలిమిచేడియఁ జేనిఁ గరమున నుడివాలు గలుగువానిఁ
గడలినుండెడువానిఁ గరిఁగాచునగవానిఁ గరుణసిక్కెడుచూపుగాంచువానిఁ
గలికినవ్వులవానిఁ గౌస్తుభద్యుతివానిఁ గనఁగ నశక్యమహాకతలవానిఁ
గనకంపురుచు లీనఁగలపచ్చడమువానిఁ గలుగుకాలం బెల్లఁ గలుగువానిఁ
గన్నె వేత్రలవయసులు గొన్నవానిఁ, గన్నయింతయు నవలీలఁ గన్నవానిఁ
గన్నులను †మంచుసెకమించుగన్నవాని, గాంతుగానోఁచునక్కాంతకాంతకాంత.

చ. అలదమయంతిఁ (బోలె) నను నంచితపుణ్య నొపర్పు మన్నలుం
దలఁపుము మాధవాప్రకృతతాకథనస్ఫుటభాగ్యగా నమో

*పాటియదే † మించు

విలసిత యానమాత్రమున విస్మృతి నొందకు మంచకై వడిన్
వెలయుము తత్క్ర్యశ్లోకకృతి వేగ నొనర్చి క్రియాసరూపతన్. ౨౪

వ. అని తరుణీతనయాతరుణి యగు యోగశిక్షాశిక్షారణి యై పలుకఁ జప్పలుకులు (ములుకులు) వోలె మదికి నులుకఁ జిలుక నచ్చిలుకలకొలికి యక్కలికికి ధైర్యంబు కుదుర నెనరు గదురం దియ్యందనంబు మొదుర నిట్లనియె. ౨౫

సీ. పంచత్వమే కొను బాణము ల్గాంచిన యతనుఁడు నీ స్నేహ మనఁగలండు
*ఘనసైరమున మందగతిఁ బూను వెల్లనౌ రాయంచగమి యేమి సేయఁగలదు
మధుసేవనంబున మాట ప్రూను పికాళి వలసి భయం బేమి వచ్చు నీకు
మధుపత్వమున భూరిమాలిన్యగుణావృత్తి దేరు భృంగములు నీ కెరువు రావు
బహుళపక్షవిరోధి యగు పంకజారి, జడత గుణగంధమాత్రంబు వడయు గాలి
నెక్కసపుమాటలాడుచుఁ జిక్కఁజిలుక, యంతమాత్రంబునీ కేలవంతతల్లి.

గీ. చెట్టు చెట్టున కొకకొన్న చుట్టుకుండుఁ
జెలువు చెలిమికి నొకకొన్న సేయుచుండు
మనసునేఁలు నీవంటి మానవతుల
ధైర్యకంచుక ముగలింపఁ దఁచునెల్లు. ౨౬

మ. నెడతూపుంగమి నూలుపోఁగునను జీవింగట్టదుం దుంటవిల్
గడికండ ల్పడ గానుగాడి రసముం గాచితు మీనాంకమున్
మడుపంటం బడఁద్రోచి గాలముఁ గుమ్మింజేసి కందర్పనిం
బడఁతీ దుర్బలుఁ జేసి పుచ్చెద భయోత్పాతంబు నీ కేటికిన్. ౨౭

వ. అని యాయుడిలం బలికిన చప్పలుకులయెడ ననాదరంబు చేసి వెడసవ్వ నవ్వి యవ్విరిఁబోఁడి నీలవేణి కిట్లనియె. ౨౮

చ. కలికిరో పాడచేడియవు గాన నెపం బిడి యోట దీరఁగాఁ
బలికితి వింతె నీకు మఱుమాట వచింపఁగఁ జాలఁ గంతుపూ
ములుకుల కున్న నాయొడలు మోహము దాఁకి తొలంగుఁ బ్రాణముల్
బలువగ నిల్పి తింతవడిఁ బట్టఁగలేనిఁక నిక్క మోచెలీ. ౩౦

ఉ. కన్నులు మూసినష్ట పొడకట్టిన (నాథుఁడు) గాఁగి లీరయం
చున్నదువంగ నోరెగువఁ జూడఁగ†నీ దపు డేడనుండియో

---

*ఘనవైశమున - † నీవపుడే

పన్నుచు వచ్చు నాదుప్రతిబంధము వీడియు నంతలోనె మే
నున్ననుచుం జలించును గనుంగవ విప్పఁగ మాయ (మా) సఖీ. ౨౩౧

మత్తకోకిల. నీవు నాయెడఁ గూర్మి బోటివి నెమ్మి నాపయిఁ గల్గినం
బూవుఁబోఁడిరో నాదుకోరికఁ బొల్చు నొక్క రహస్యమే
చూవె నీమది నెంతలే దని చూడ కప్పని వేగమే
చేవ దప్పక తీర్చు దేనియుఁ జెప్పద న్వినుఁ తత్ప్రియన్. ౨౩౨

వ. అది యే మని యంటివేని. ౨౩౩

శా. సాక్షాన్మాధవగాత్ర సంగతికి నోఁచం గావునన్ దీని క
ర్జ్యాక్షుం గస్తురివన్నె జృంభితసువర్ణాంభోజపత్రంబుపై
నక్షీణస్థితి వ్రాసి నన్నును దదీయాంచన్మహోదారస
ద్వక్షోమధ్యమపీఠి గూఢిగ లిఖింపం జూచి యైనం జెలీ ౨౩౪

క. చిత్తరి చిత్తములోపలి, యుత్తల మొకకొంతయైన నుడిపెద నిటుగాఁ
జిత్తము నిలుపంగదవే, యుత్తమసుకృతంబు నీకు నొసఁగు నటంచున్ ౨౩౫

చ. పలికి గళ న్మరందరసబంధురగంధరసాంధబంభరా
కలితరవంబులం బ్రసవకమ్రమిళన్మరిసాహ్రమతామ్రకో
మలనవపల్లవగ్రసనమంజకషాయితకంఠకాకలీ
కలకలకంఠనాదములఁ గల్కి తిటాలున నుల్కి యుల్కియున్. ౨౩౬

వ. అప్పు డప్పల్లవపాణి కపటగోపికాపల్లవాయల్లక మెల్లం...దురంతసంతా
పంబున నెంతయు నొల్లంబోయిన నీలవేణి శోడి నీలవేణులం గూర్చి కటక
టంబడి చింతించి యీయుంతికి సంతాపంబు బలవంతం (బలంతుల) నంతం
బుఁ జెందనేర దీయెడఁ గొంతకొంత శాంతిబొంద శిశిరోపచారంబులు పచ
రింపం దగు ననినఁ దత్సహితలై తత్సహితలు తత్క్రియాయత్తచిత్తలై
రయ్యవసరంబున. ౨౩౭

—కాళిందికిఁ జెలులు శిశిరోపచారములు చేయుట—

ఉ. తావుల మోక* మావిగమి తావుల గొజ్జఁగనీరుయంత్రముల్
కేరిలఁ జిల్కఁగాఁ జిగురు†గేదఁగిపూదడిగట్టి వట్టివేర్
పై వజిలాటచెంగలువపందిరి చెందొవ రేకనంటి క్రొ
మ్మోవులచందువాపొగడమొగ్గల నిగ్గులచప్పరంబులోన్ ౨౩౮

*మావిగమి † గేదడిపూఁదడి

సుగంధి. కప్పురంపుఁదిప్ప నొప్పఁ గమ్మపైఁ శీతమ్మి మే
ల్పుపొప్పడి ప్రచించినట్టి పువ్వు సెజ్జమీఁదికిన్
• అప్పడంతిఁ దెచ్చి, తెచ్చి రంబుజాక్షు లందఱుం
జెప్పరాని వేగ మూని శీతలించు వస్తువ్రల్. ౨౩౯

ఉ. సారసచంద్రనైణమదసంకుమదాగురు కేసరాళిక
ర్పూరపరాగకుంకుమసముజ్జ్వలపల్లవహల్లకాచ్ఛక
హ్లారతుషారనీరబిసహారసమంజసపుష్పమంజరీ
వారము లాడిగాఁ గొనుచు వచ్చి కరంబు ముదాకు నేర్పునన్. ౨౪౦

చ మలయజకర్దమం బొడల మాటి కలంది మృణాలవల్లరీ
వలయచయంబు లంఘ్రులను బాహువులం గడియించి వేనలి
న్వలయఁగఁ దెల్లదమ్మి యిడి పెల్లుగఁ గస్తురి కంధరంబునం
గలయఁగఁ బూసి యింతి శివుకై పడిఁ జేసి రసంగభీతికిన్. ౨౪౧

చ మృగమదచర్చ యంతటను మేన నలంది పరాగరాగసౌ
భగకదళీదళంబుఁ గటిపై నిడి చెందొవపువ్వుటెత్తుఁ బొ
ల్పుగ నెసనుంచినప్పు డసి వొల్చె ననారతశౌరిభక్తియో
గగుణజాంతరంగ యగుగాన దగాకృతి దాల్చెనో యనన్. ౨౪౨

ఉ అంగజుఁ డంగనాఘన హృదంతరకర్పరసీమ స్నేహము
జ్భంగి నభంగురం బగుచు భాసిలఁగా దశపై దశాంతరం
బుం గదియించి ప్రోవఁ బరిపూర్ణతఁ గాంచి యయోగదీప మే
చం గడు ప్రస్ఫుటించుఁ గిసలసంఘటితవ్యజనానిలంబునన్. ౨౪౩

సీ. పదములఁ జిగురాకు లొదవించి జంఘల స్మరతూణతిలకము ల్మరువుకొల్పి
తొడల నరంటిద ప్పడరించి సొబగారుకటిపైఁ బరాగసైకతము నించి
నడుమఁ బుష్కరభంగి దొడరించి యాసిన జోఁకగాఁ గస్తూరిరేక దీర్చి
చన్నుల గుచ్ఛము ల్పనరించి నెమ్మోనఁ జందనం బలఁది భుజంబుల బిస
కాండమిడి చెక్కులను జంద్రఖండమలఁది, వేణి శైవాలమునఁ గూర్చి వెలఁదియంగ
సామ్యసదసత్పరీక్షావిచారిణ బలెఁ, జెల్వ లీరీతిఁ జేసిరి శిశిరవిధులు.

చ. ఎడపక యింతులెల్లఁ గదియించినపల్లవసూనగుచ్ఛముల్
తొడరి వియోగవహ్ని సెక దొట్టఁగ *జివ్వున నీరుదీసి యె

కుట్టఁడు గములంగ నవ్వు డలకోమలిగాత్రము వొల్చె నామరుం
డడరుచు దోహదక్రియకునై †రవణించిన లేఁతతీవనాన్. ౨౮౫

ఉరుతాపమీలద్ద్రుతోత్పలంబుల మిత్రకరమార్జనక్రియఁ గఱపరాదు
వగఁ బొగలొక్కని మంట లెగయుచెందంబునఁ జంపకస్నేహంబు సలుపరాదు
కన్నీటిచఱవలు గ్రమ్ముచన్నట్టుల ఘనసారజలధార లునుపరాదు
నిట్టూర్పువడగాలిఁ బట్టూడు మైఁదీఁగ నల వహ్నిశిఖ నిల్పఁదలఁపరాదు
చండసుమ కాండ తేజః ప్రచండకిరణ, దండవిభవ
మోహబహుళాంధకారంబు ముంచిజాఱి. నమ్మృగమదంబువఁదిలకముర్పింపరాదు

గీ. అతనుతాపంబు హరియింపనంగములను, జెలులు సేర్చినబహువిధశీతలములు
నతనుతాపంబు హరియించె నంగవితతి, నతనుతాపంబుహరియింపవబ్బరంబు

గీ. జడములగుటనుసంతాపశాంతిసేయు, నంచుఁ జెలులేలయిడిరిసుమాదిగములు
జడతఁ గాంచినదియ్యది జగతినియుతి, గలవు సేయుఁగఁదప్పహత్యాకార్యమొల్లు

క. తనులతఁ బల్లవసుమములు, ఘనతం గొనునేని యతనుఘనశిఖ యేచెం
దనులత తాపం బడఁచునె, ఘనములు నవియెన్ని కృష్ణఘనమే చిక్కన్.

క. ఈవిధమున నేర్పొప్పఁగ, వావిరి శిశిరోపవిధులు వర్తించి యొకిం
తావెలఁదిఁ దెలిపి నగరికి, వేవేగం దోడి తెచ్చి చెలఁదులు ప్రీతిన్.

గీ. పసిఁడియుప్పరిగె నునుబూఁబాన్పుమీఁద
నకియ నిరవొంద నునిచి హెచ్చరిక మిగులఁ
గలితపూర్వకథాప్రసంగంబుచేతఁ
బొద్దు గడపుచు నుండిరి ముద్దు చేసి.

క. మాయాసహాయసీతా, జాయానిరపాయభవ్యసాకేతపురా
ధేయ మునిగేయ జలద, చ్ఛాయలసత్కాయ సకలజగదున్నేయా. ౨౯౧

గద్యము. ఇది శ్రీమదామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణపోలూరి మాధ
వయజ్వసముజ్వలత్కృపోక్షితకటాక్షాసాదిత పాండిత్యాభరణ ప్రభంజన
వంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ నన్నయభ
ట్టారకాహోబలపత్యాహ్వయకవి మహోపాధ్యాయ భట్టారక ప్రణీతం
బైనకాళిందీకన్యాపరిణయంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

† రవళించిన

శ్రీ రస్తు

# కాళిందీ కన్యాపరిణయము

## తృతీయాశ్వాసము.

క. శ్రీరాజమౌళిహృద్గయ, స్ఫారాంబుజచంచరీక ప్రణమజ్జనతా
ఘోరాఘతిమిరదినకర, తారావల్లభవిరామ దశరథరామా. ౧

వ మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

— సూర్యాస్తమయవర్ణనము —

క అంతట నంతటనెచ్చెలి, యంతర మగలంగఁ గూఁతు నలమట గనుచుం
గాంతి దొలంగుచు వ్రాలెను, జింత ననం దనదు కాంతి చెదరఁగ వ్రాలెన్.

గీ. వారుణీసేవతనదుదుర్వార*మహిమ, మంతకంతకుఁ దఱుగనొయ్యన వెనుకకు
మేను†నొగులంగ నప్పుడుభానుమంతు, డధిక (దీన)స్వరూపంబునధిగమించె.

సీ. అసురక్తమండలుం డగుచుఁ బూర్వాగమ మూని ప్రబోధ మిం పొప్పఁజేసి
సర్వవర్ణాశ్రమాచారము ల్నడిపించి తా సత్పథంబునఁ దనరి నిలిచి
నలుదిక్కులను గరంబుల (చేత) నలరారి చక్రసద్ద్విజవృత్తి చక్కనునిచి
కుముదంబులకుఁ బొంగు గ్రుంగునట్లు మెలంగి పద్మిని కామోదపటిమ గలిపి
కాలగతి వయసుమించినఁగడకదక్కి, కాంతిగైకొని యపరాగమాంతమంది
వసువు శుచి కిచ్చి పరరక్తభావుఁడగుచు, వఱలునానందవారిధి వ్రాలెనినుఁడు.

గీ ప్రాచి పశ్చిమదిశయుఁజేపట్టి యూఁడు, బంతిగాఁదత్క్షరచ్ఛవిపట్టెసూర్యుఁ
గానిచో నెద్దికత మన్యకాల మెడయు, నరుణిమచ్ఛాట సంజలఁబరఁగుచుండ.

గీ చండమార్తాండకోచిరఖండసహ్ని, కీల నెంతయుఁ గ్రాఁగినఁ జాలఁజాల
నరుణిమ భజించె నాజరతాతపమున, దండినెఱిపెక్కు బ్రహ్మాండభాండమెల్ల

క. కొండలకు మేలుబంగరు, కొండలరాయనికి మైత్రి గొనకొనఁ జివురుల్
మెండుకొనుమావులకు దరు,షండములకు నట్టియెడఁగదాకచి యమరెన్.

మ. తను లోకంబులు లోకబాంధవుఁ డనం దాఁగర్మసాక్షిత్వముం
గొను చత్యున్నతిఁ గాంచి కాలగతిచేఁ గుంఠీభవత్తేజుఁ డై
చని యవ్వారుణిసేవ గైకొనియె నుష్ణప్రాంశుఁ డ ట్లాటచేఁ
గనియెన్ ఘోరగభీరవార్ధిపతనాకారోరుపాతిత్యమున్.

---

* పఱిజ- † నొగయంగ

సీ. సకలజగచ్చరజంతుసంతానసంతత నేత్ర రశ్మిసంతతులతోడఁ
జక్రాంగదాంపత్యసరసాభిలాషసంఘట్టనైక హేతుభాగ్యంబుతోడఁ
వసుధారణక్రియాధావదుచ్చావచపక్షభృద్వ్యాహృతిభరముతోడఁ
బద్మినీముఖపద్మభవ్యతరామోదకారణాదృష్టవైఖరులతోడ
నస్తమించెను జలరాశి నతిరయమున, వనధిజల మెల్ల నధికపావనతఁజెంద
దొలుత నుడివెదునుడువులఁగడలుకొనెడు, బెడఁగుఁబోఁడిమిగైకొన్న పెద్దవేల్పు
గీ. అక్షిగతురీతి జనులుదన్నక్షిగతుగఁ జలుపఁ బరెరి పితృప్రసూసంగియనుచుఁ
గలుపమదివోవఁగడిగివలయునసిరియొ, వనజమిత్రుండు వేగంబవనధిమునిఁగె
సీ. ఇనపాతకృత మైనఘనవివరంబునఁ బైకెక్కు బాడబప్రభ యనంగ
జలములోనుండి యుబ్బలుత్రోవ మీఁదికిఁ బొంగు లేఁబవడంపురంగనంగఁ
గాలుండు జక్కవకవ మది నేర్పఁగఁ జిందించి పొడమించు చిచ్చనంగఁ
గుముదిని నిద్ర పైకొనకుండ నపరాశ వెలయించు దీపంపువెలుఁగనంగ
నపుడుసూర్యుండుహరియాటవతెనితోడఁ గొంతదవ్వేగియతఁడబ్బింగుక్రింకిపోనఁ
దీరమున నిల్చుగరుడని తేటయనఁగ, నింపుదళుకొత్తెసాంధ్యరాగంపుసొంపు.
చ. అరయఁగ సర్వమిత్రుఁ డగుచట్టి యినుం డరుగంగ నింక మా
కిరవులు సేరి సద్దడఁగి చేపటి యుండెడి వేళయే నిశా
చరుఁ డధికారి తాద్రుశులె సౌఖ్యము గాంతు రటంచు సంకుల
స్వరములు సేయుచు న్విహగజాలము సేరుఁ గులాయసీమలన్. ౧౩
ఉ. తారలఁ బెండ్లియాడఁ బ్రమదంబున రా జరుదేర నింపు సొం
పార నభోరమారమణి యాకసపుంబలు వేదిమీఁద వి
స్తారముగాఁగఁ గల్పసుమజాలము నించెను నా నభంబునం
దారక లుల్లసిల్లెఁ గలితద్యుతు లెల్లెడఁ బర్వుచుండఁగన్. ౧౪
క చండాతపత ప్తదిశా, శుండాలము లుదధిఁ గ్రుంకి శుంభచ్ఛుండా
దండములఁ బైకిఁ జిమ్మఁగ, నిండెడి శీకరము లన్నఁగ నెఱసెం దారల్.
చ. పగ లొనరించు చుగ్ర కరభావము గైకొని మమ్ము నేఁచుచుం
దగు లయినట్టిపంకజపితానము నేడు నినుండు వోయె నె
వ్వగ మది మాకు మాని ననివారణ శీతకరుండు రాజు దా
నొగిఁ జనుదెంచు నంచుఁ జెలువొందెను మిన్ననఁ దారకావళిజాల్. ౧౫

గీ. పుట్టినప్పుడుసుత పగ లుప్పని కువల, యంబు(నేఁచెడు)నిన్నుఁ డేగె నట్టి కాని
గొనముఁలకుమాఱుగ్రైకొన్నకౌమరురాజు, వచ్చునని తారకాప్రజవఱలెఁజదల.

సీ. రాణ సత్కృత్ప్రజారాతులు గడిదేఱ ద్విజవృత్తు లెల్లను దెంపువాఱ
జారచోరస్ఫూర్తి చాల విజృంభింప నీరసులసౌఖ్యవైఖరి కృశింప
వరధర్మవిజ్ఞానవార్తలు సడలంగ నన్ృతాభిసంధి చయ్యన మెలంగఁ
గుముదంబుల మెలంగుకొంకు శంకను జెందఁ బరఁగి ప్రదోషంబుపటిమనఁద
నంజనాచలరోచిర్నవాభ్రకాంతి, భంజిన మొనర్చు చాయ లపారములుగ
నంధకారమహాకలి యావరించె, నఖిలదిశల నరాజకం బైనయపుడు. ౧౮

ఉ. వేలుపుఱేఁడు నామఱుఁగు వేకొని యాత్మవధూటిఁ జెంద న
జ్ఞాలి నసూయ పుట్టఁగ విచారము సేయక భావమంచు న
న్నోలి రచించె గౌతముఁ డహో యిదె రూపము నాబలంబు లో
కాళి గనుంగొనన్వలయు నన్నగఠీ బలసెం దమశ్ఛటల్. ౧౯

సీ. తా నొకబలియుఁడే తరణి లోకాలోకగిరిదుర్గమునఁ బడి కరము లన్ని
గలిగియు నావలెఁ గడవఁగా శక్తుఁడో యెట్టులో నారాక యెఱిఁగి నీళ్ళఁ
బడెఁ గాక పట్టనో భవ్యసున్నామగంధమున నతను బట్టఁ దమము శక్తి
గాంచెను నారాక గననియచ్చోటనె తనకాఁకలును దాను బనికివచ్చు
నంటరానివానియందుఁ దా వసువెల్ల, దాఁచి పోయెఁ గాన దక్కెఁ దనకు
ననుచు వేగ వచ్చె నన బలునీలిమ, గప్పికొనఁగ నిరులు గప్పికొనియె.

సీ. నే ననిర్వచనీయనిజరూప మగు చనాదిత మెలంగుచుఁ దత్త్వధీ నడంచి
వెలయు నవిద్యనై మెలఁగెద మచ్ఛబలతఁ గాంచియే యాత్మ బ్రహ్మ మయ్యె
నటుగాన నాయందు నమరు కారణలక్షణం బతివ్యాప్తిదుష్టంబు గాదు
బ్రహ్మవిద్య యెటంచు బలవత్ప్రమాణంబు మఱి గుహాశయత బ్రహ్మంబు నేన
యఖిలమును నాదురూపంబు ననుసరించి, నిలుచునో లేదొ చూడుఁడీ నిఖిలజనము
లనెడి వైఖరి రోదసు లాక్రమించి, యంధతమసంబు వరఁగె భయంబు వెఱఁగ.

క. ఘోర తమోబల మయ్యెడ, నేరీతి వచింప శక్య మేరికి నైసర్గ
ధారాళతరవివేకవి, హారులకును వస్తు వరయు టరుదై తోఁచెన్. ౨౨

గీ. చంద్రతారావివాహంబు సమయ మనుచుఁ, గాలకజ్జలకారుఁ డఖండపద్మ
జాండమంజుకరండంబు నింపుకొనఁగ, నునుచు కాటుక యనను ఘనతమంబు.

ఉ. వేళ యెఱింగి సూర్యుపయి వేళమ వచ్చుగుహాంతరాళధా
రాళతమంబు వెంట గ్రహరాజహతవ్యతు లౌట వచ్చి య

వ్వేళ నినుండు పోవుటకు వేదనఁ గుందుచునుండుఁ జ్యోతులో
నా లలిమించుఁ గప్పు పయి నల్వఁగ నొప్పు గృహప్రదీపముల్. ౨౪

క. వడి నినుఁడు చనఁగ వెంబడిఁ, బడి చనఁదడఁబడుచుఁ జక్కి బలునిరులు గొనన్
వడి యుడిగి యచ్చటచ్చటఁ, బడియుండెడు రశ్ముల్లనఁగ భాసిలు దివియల్

చ. తలఁపఁగ శబ్దమాత్రవిదితం బగుచున్ గుణమాత్రహీనతన్
మెలఁగుచు నప్రతీతగతి మేదురసంశయవృత్తి నందుచున్
బలునసృతంబు వాదములప ట్టగుచుం గరుణాప్రయత్నముం
దలకొని కుప్రబంధమతిఁ దార్కొని యుండెను లోక మత్తఱిన్. ౨౬

ఉ. రాజవియోగవేదనఁ గరంబుఁ గృశించి తమంబుఁ గాంచి ప్రా
గ్రాజనిభాస్య రాణ సెడరాఁ జనుదెంచును వేగ మంచు వే
శౌజలజాక్షి దెల్ప నతిలాలసమూన........దన్ముఖాం
భోజము నవ్వుపూనె ననఁ బొల్పెసఁగెం దొలి తెల్పు ప్రాగ్దిశన్. ౨౭

చ. విరహిజనంబు నేఁచ నతివేగమ వచ్చు ననంగవీరు భా
సురతర కేతకీశరముసొంపున రేక, తదర్ధచంద్రసుం
దరవిశిఖంబునా సగము, తజ్జయకారణచక్రమో యనన్
సురుచిరబింబము న్వరుసఁ జూడఁగ నొప్పెను బ్రాక్కకుప్పునన్. ౨౮

—— చంద్రోదయవర్ణన ——

క. అలప్రాచి కుంకుమచ్ఛవి, నలరెడు మోమునను నీల మగుమృగనాభిం
దిలకము దిద్దె ననంగాఁ, గలువల చెలి కెంపుమేనఁ గప్పపు దొప్పెన్. ౨౯

సీ. విరహిజనంబుల వేఁగింప మారుండు తెలివిఁ బెట్టిన గండదీప మనఁగఁ
గమలచక్రము లేర్పఁగడలితోఁ బొడముచు హెచ్చిసొచ్చెడు వింతచిచ్చు ననఁగఁ
గుముదినిపాలింటి కొమరారు పూర్వంపు బలుతరంపుఁదపంపు ఫలమనంగఁ
గలశాబ్ధి వెడలి వెన్నెలపుల్గునిసువులం బోషించు నును వెన్నముద్ద యనఁగ
విరహిమోహాకశరకాండవిసరమండి, *తస్మరైక్షవవృక్షకోదండ మనఁగ
దండి రుచులనజాండంబు నిండుకొనఁగఁ, బండువగవచ్చె నైందవమండలంబు.

చ. †నలువఱి యంధకారవసనంబు ముసుం గిడి యున్న యద్దిశా
లలనల మేనఁ గప్పు శిథిలంబుగఁ జేయుచుఁ గప్పురంబు దా

* తస్మరైక్షవవృక్ష † నలుదరి—మూ.

లలితకరంబుల న్నినిచె లాలితి మీఱ నన న్నిజచ్ఛవుల్
నలుదెసల న్మెలంగ నలినంబులసూడు వెలింగెఁ బొంగుచున్. 3౧

చ. సరసులు స్రుక్కెఁ జక్రములు సంగతి దక్క వియోగమానసం
బరుదుగఁ బొక్కెఁ గల్వగమి కందము లెక్కెఁ జకోరపాళికల్
శరబడివొక్క ఘూకములసంస్మృతి నిక్క ధరాళి నూష్మము
ల్పరువడిఁ జిక్కెఁ జక్కఁ గనుపట్టెను రిక్కలతేఁడు గ్రక్కనన్. 3౨

సీ. సురలయాఁకటిచిచ్చుపాబగార్చుమేఘంబు పాంథులపాలింటిప్రళయవహ్ని
జారమల్లిమ్ముచోచ్చాటనమంత్రంబు హాతదృష్టిపేచకేద్ధాంజనంబు
కుముదిని నేదెకు కులదేవతామణి యురుచక్రసంతాపహుతభుగరణి
సరసజీవంజీవనంజీవనౌషధి తాపదరిద్రతాదానకర్త
తండ్రి నుబ్బించునందంపుదాఁపురంబు, పొసఁగు తమ్ములబడలికపుట్టినిల్లు
కళలు నాఱుపదింటికిఁ గాణయాచి, చెలఁగుఁ జుక్కలతెరువున సితమరీచి.

చ. హరునకు సొమ్ము కమ్ము జలజాకరపాళికిఁ జక్రవాకసం
సరణము కీడు దోడు జలజంబులసామికిఁ గైరవాటవీ
స్ఫురణము పొందు విందు సురభుక్తి(కి) భవ్యచకోరపారణా
చరణము పొంగు రంగు గని చాల వెలింగెను నింగి చెంగటన్. 3౪

సీ. కలశపాథోరాశిగర్భసంజాతంబు ప్రాగ్దిశావసథవిభ్రాజితంబు
విమలనిజద్యోతవిశదీకృతాశంబు నభ్రంలిహాదభ్రవిభ్రమంబుఁ
గాళికసంచారకార్యధౌరేయంబు నురుకరోద్ధూతపద్మోదయంబు
బహుళద్విజాళిసంభరణప్రవీణంబు నుపకంఠతారాళియోజితంబు
తీవి నారబడె శశభృదైరావణంబు, రుచిరతారకమార్గసగోచరంబు
భవ్యనక్షత్రవీచికాబంధురంబు, సంకునకసద్గ్రహగ్రాహసంకులంబు. (?)3౫

గీ. క్షీరజలరాశిదీప్తిసం(జీ)వనంబు, పంకరుహకాండఖండనపండితంబు
పక్షయుగధారి తారకావర్తచారి, రాజిలుచునుండె నవ్వేళ రాజహంస.

క. చెన్నారుచుండె వెన్నెల, మిన్నావెన్నెలలతేట మించియొసఁగఁగా
నన్నలినజాండ మొప్పెను, సన్నపుఁ దెలికప్పురంపుసంపుటముక్రియన్.

క. చందురునివంటిబిడ్డని, పొం దేడయఁగలేక పాలమున్నీ రరుదే
నిండెల్లఁ బాలు నిండెన, నం దగె లోకమునఁ గుముదనాథాంశురుచుల్.

సీ. కలువలగములబొక్కపువాసనలతోఁడఁ గమలసంకోచంబు ఘనతగాంచె
వెన్నెలపులుఁగులచెన్నుఁదనంబులోఁ జక్రాంగఖేదంబు చాల మించెఁ
జంద్రకాంతోపలస్రవదచ్ఛవారితో విరహినేత్రాంబువు ల్విస్తరించెఁ
గాకారిముఖజంతులోకాభయంబుతో జారులమది భీతి సందడించెఁ
బుడమిచెలి మేనఁబుట్టిన భూరితాప, భరముతో నంధకారంబు పఱవఁజొచ్చె
వలులనెఱతావు సద్గుణావలులప్రోవు, నీరజంబులదాయ వెన్నెలలు గాయ.

క. లోకాలోకాంతరమున, భీకరమై యుండుతమము బెదరి గిరిగుహా
కోకహృదంతరసీమలఁ, గాకెక్కడఁ బాఱి యుండఁగల దీవేళన్. ౮౦

క. చలివెలుఁగుచాయ తమముం, గలయన్ హరియించు ననుట గాదబ్రము కో
కులహృదయము నిడి చిత్రము, తలఁపఁదమోమయముగాఁగఁదస్రుచి చేసెన్.

ఉ. అడరి తమంబు సర్వజగదాత్మకవస్తువు గ్రస్యుచుండఁగా
నడఁచెను గోవిలాసముల నత్తమ మంతయు వస్తుదృష్టి చే
పడఁగ నొనర్చె సద్వితతి భవ్యముదంబుధి నోలలార్చెఁ దా
నెడయఁ డుదారవిష్ణుపద మీాద్విజరాజు మహోన్నతిన్ గనన్. ౮౧

గీ. తలఁప నబ్బుర మీాకళాధరునిగోవి, లాసమాధుర్యమహిమంబులబ్ధవర్ణ [గ
హృదయములుతత్ప్రసక్తిగానెటులుకరఁగ, కుందుఁదెలిఱాలుగరఁగుటకొప్పికొనఁ

సీ. నిజగోవిలాససన్నిహితనానాపదార్థప్రపంచంబున దీప్త మగుచు
మాధుర్యము ప్రసాదమహిమతోనెనయంగమిగులనర్థవ్యక్తి మెఱుఁపు గొనఁగ
ననృతవాగాదిదోషాత్మకతిమిరంబు దూరింప వస్త్వలంకారరసము
లలరారఁ జిత్రబంధాదివిశేషము ల్వాలఁగ శుచిరసాస్వాదిరసిక
వరకవులుమెచ్చినవరసాస్వాదమందఁ, గుకవిబృందంబుత్న్మహాప్రకటమహిమఁ
జూడఁ జాలక స్రుక్కఁగ జోడులేని, లాలితి వెలింగె మేటికళాధరుండు. ౮౨

చ. ...మొక్కఁ దేప్రబలునొందుగుణంబు గనంగలేక వి
స్ఫురణము దక్క లోకమున శోభిలఁజేసె గుణవ్యవస్థ దా
విరహిజనాంతరంగములఁ బెందముముం గుముదంబులందు ని
బ్బరపురజంబుగాకరి............గిరిసత్త్వముఁ న్పుచున్. ౮౩

క. వెన్నెలరాయునివెన్నెల, వెన్నలపైఁ బర్వ గిరులు వృక్షము లెల్లన్
వెన్నెలజిగి గిరితరువుల, యన్నలుఁ దమ్ములు ననంగ నలరెన్ ధాత్రిన్.

మ. తొలుపక్షంబునఁ దారకల్ విరళతం దు............తంతకుం
జలినిఁ గెక్కుడుచాయఁ జేకొన మదిన్ సంధిల్లె నిత్తెల్వి తా
రలు మేటుల్ మగఁ డేగుదేరఁ బరమాహ్లాదంబైన భావంబునం
జెలువొప్ప న్నదు రేఁగి *తత్తనువు నాశ్లేషించె నెంతేనియున్. ౪౮

గీ. మృదులశీతలకరముల......చుఁ జేసి, కువలయానంద మొనరించెఁ గ్మారాజు
కువలయానంద మొనరింపఁ గోరువాఁడె, రాజనుచు నెన్నుదురు బుధరాజు లెల్ల

చ. ఇనుఁడు చనంగ సందుగొని హెచ్చినరక్తత నైంద్రిఁ జెంది య
...నిన్నిశాచరుఁ డొయ్యారమునం గర మంది నన్ను న
య్యనునిపతివ్రతం జెనక నేపునఁ జేరెడు వీనిఁ జూచు లే
పని యని పద్మినీరమణి పద్మముఖంబును వాంచె గ్రక్కునన్. ౪౯

చ. సరసి తుషారరశ్మికరసంగతరశ్మితుషారశీకరో
త్కరఘనబాష్పపూరములు గ్రమ్మఁగఁ దామరమోము వంచి యం
తరతరులీనభృంగచయ తారనినాదము లుప్పతిల్లఁగాఁ
బురణ దొలంగి జక్కవలు పొంగక పొక్కఁగ నేడ్చె స్రుక్కుచున్. ౫౦

క. రతు లుడిగి పొంత ద్విజదం, పతు లడలఁగఁ జూచి(చూచి)పాపక్రియకున్
వెత గదుర సరసి లజ్జా, నతముఖి యై యుండె నపుడు నలువెడలంగన్ ౫౧

సీ. తనతమ్ములను జేరఁ దలఁపఁగఁ బగవాని శరబడి తొవల సంసర్గఁ జేయ
ఖరకరుం డగునినుం డుకుతీవ్రతఁ గడంగి పవలు గాఁచించు నుత్పలవిచికిల
బంధ్యగారంబులఁ బడవేసె యుష్ణాంపు మధురాన్నములు లేక మాఁడఁ జేయు
నినుఁ బాఱఁదోలి చల్లనిరాజు చనుదెంచి బెడఁగుకరంబుల వెడలఁ దిగిచి
కలువపూఁబళ్లెరంబులఁ గలుపుదీఱ, హితరసాన్నము గల్పింప నింపు గాఁగ
నారవస్తుతు లెసఁగంగ నారగించెఁ, దనివిమదిఁ దీరఁగ మధువ్రతద్విజాళి ౫౨

ఉ. చల్లనిరాజు వచ్చి కరసంగతి సేయ నినుండు సేయుఁగా
కెల్లఁ దొలంగ నంగసుఖ మొంతయుగా సుఖనిద్రఁ జెందెఁగా
కెల్లరుఁ బద్మినీరమణి యెప్పుడు నొల్లను చంద్రునందు రి
క్తల్లకు మెత్తురా యని పకాపక నవ్వెఁ గుముద్వతీసతుల్. ౫౩

గీ. సరసులకమిత్రుఁ డగునెమాచందమామ, యలఖరాంశుండు దమ్మెమియాదరించెఁ
గాఁకగావించిజీవనగ్రాహిగాఁగ, ననుచు నవ్వునవ్వొననఁ గల్వ లపుడు విరిసె.

* త తరువు.

ఉ. ఏమగవారు నామగనియొప్పు వహించిరి చంద్రుఁ డన్న య
న్నామము న(ర్వ)మోదఘటనం గలిగెన్ శశికంచుఁ జెప్పరే
ప్రేమను నన్నుఁ జేకొనఁగ బెట్టుగ నీరసమూని పద్మినీ
భామయ మోము మోడ్చె నని పక్షున నవ్వెను గైరవావళుల్. ౧౫

సీ. సితపక్షగతి గాంచి చెలువారి పంకజాసనభావవైఖరిఁ జాలఁ బ్రబలి
వెన్నెల లీనెడు వెలిమేన దైవాఱి జంకకప్పులు పూనుపొంక మమరి
యచ్ఛంపుగుణమూని లచ్చికిఁదోడౌచు విధుసమాఖ్య జగంబు వినఁగ నలరి
తమము పోఁగొట్ట నుత్తమధర్మరీతులు సాకల్యముగఁ దెల్పఁ జాగ గలిగి
మూఁడుమూర్తులవేసంబు ముచ్చదుపుల
యాకృతియు నొక్కవేళన యానుకొనుచుఁ
గాలభిద గోరి తద్వృత్త గాంచునినుని
మించి దీపించు దివి మంచునించువేల్పు. ౧౬

సీ. ధరణీధరోరుకందరమందిరోదారతమ మణంపమికిఁ దా నమరె నేమొ
ఛాయాపహరణధారేయరశ్మిచ్ఛటావాప్తి లేమిడికిఁ దా నమరె నేమొ
ద్విజరాజసంతతి* దీనత్వ ముడుపఁగా నేరుపులేమిడిఁ జేరె నేమొ
సరసుల నామోదసంపద నందింప బలిమిచాలమికిఁ జేపడియె నేమొ
యొకకలంకంబు నెమ్మేనఁ బ్రకటమయ్యెఁ
గళలు పదియాఱు వెలుఁగంగ మెలఁగుదొరకు
సకలసద్గుణనిధి యైనచక్కనయ్య
కొక్కదోసంబు లెక్కింప నొచ్చె మగునె. ౧౭

సీ. జారసంకల్పంబుఁ దూలింపఁగాఁ జేసి చోరుల మూలకుఁ జొరఁగఁ జేసి
సన్మార్గ మెల్లను సత్ప్రకాశముచేసి పంకజావళిఁ బటాపంచ చేసి
యరిజాలములనెల్ల నండ వాయఁగఁ జేసి యాశ్రితద్విజరాజి నలరఁ జేసి
పరతమోగ్రంథుల గిరిగుహల్ సారఁ జేసి ధర్మసంస్థాపన దనరఁ జేసి
ఖరకరుఁడు మున్ను చేసినకాఁకఁ బాసి, యలరి సద్వర్గ మెల్లను మెలఁగఁ జేసి
కువలయానంద మొనరించెఁ గూర్మిఁ జేసి, యారచల్లనిరాజు దీవ్యత్ప్రకాశి.

చ. వెరవు దలిర్ప యజ్వపతి వేగ రథాంగవధూటికామనః
స్ఫురదురుహేమకుండమున భూరివియోగకృపీటయోని భా

* సంపతి-యూ

సురకరకాండజాలముల శోభిలఁజేసెఁ దదుత్థధూమమే
పరఁగెను మేన నంక మయి పంకజవైరికి నెంచి చూడఁగన్. ౫౯

ఉ. అచ్చలినిగ్గునిగ్గులు రయంబున నెమ్మొయిసోఁకుకాఁకచేఁ
జిచ్చునదేఁగినట్లు చెలిచిత్తము తత్తఱమంద హెచ్చి బ
ల్వొచ్చనియూర్పుగా డ్పడర విన్నని కన్నులు విచ్చి చుర్చురన్
మచ్చరమూరఁ జూచి యవమానము మీఱఁగ దూఱుఁ జంద్రునిన్. ౬౦

—♦ చంద్రోపాలంభము ♦—

ఉ. చిచ్చిదె మింట మీటఁ గనఁ జిచ్చొకటబ్బునె చందమామయో
హెచ్చుగ నిప్పు లుప్పతిలు హేతువు గానము పచ్చివెన్నెలో
యచ్చెరువయ్యె నంగముల నంటిన మాత్రన పొక్కు లేలొకో
యచ్చెరు వేల యిట్టివిరహార్తజనంబుల కట్టు లయ్యెడున్. ౬౧

ఉ. తమ్ములకల్మికిం గనలుదాల్చుచు లోపలఁ గుంది కందు నీ
విమ్మెయిఁ బాంథకామినుల నేఁచక మానుదువే తలంపు మో
హమ్మున నిన్నుఁ గన్నకడు పా బడబాగ్నినిఁ గాలకున్నె భా
వమ్మునఁ జూడఁగా విరహవర్గముపాపమె కా నిశాచరా. ౬౨

సీ. చండాంశుకరమహాజ్వాలలలోఁ గాలి మాఁడక తక్కునే మఱియొకండు
బడబాగ్నిలోఁ బడి భస్మమై కూలక మహి వృద్ధిఁ బొందునే మఱియొకండు
కాలకూటంబు సంగతి గాంచినంతనె మసి గాకపోవునే మఱియొకండు
సైంహికేయమహోగ్రజఠరాగ్నిలోఁ బడి మగుడ నేతెంచునే మఱియొకఁడు

(ఇక్కడఁ గొన్నిపద్యములు లోపించినవి.)

ఉ. అన్నను గూఁతుఁ బట్టుకొనునట్లుగఁ జేసిన దుండగీఁడు గా
క్రొన్నవింటివాఁ డతనికిక్రూరత యే మని యెంచుదాన నీ
*వెన్నఁగ మేనమామవు గదే గురుతల్పగు నిన్నుఁ జేయఁడే
యన్న! కళానిధీ! యతని నల్లుఁ డటంచుఁ దలంచి కూడితే. ౬౪

క. గణుతింతు రెటులునినుభువి
గుణవంతులు ప్రకృతి వికృతిగొను నితఁ డనుచున్
గుణవృద్ధిప్రతిషేధము
లణువెఱుఁగవు సమభవంబు లందవు చంద్రా. ౬౫

* వేడుక మేనమామవు-మూ

గీ. ఆర్యు లెల్లఁ బ్రసాదమాధుర్యముఖ్య
సద్గుణాలంకృతుల కెల్ల జన్మభూమి
యితఁ డనుచు నెన్నుదురు నిన్ను నెట్లు తద్వ
యాభిధజ్ఞానకలన నింపెసఁగు నుతులు. ౬౬

గీ. అసితరుచి మించు నాహాలాహాలముకంటె
వెలి వెలుంగుల యీచంద్రవిషము మించు
నసితవిష మెల్ల మ్రింగెను హరుఁడు రాహు
వీని మ్రింగియు నోపక వెడలనుమిసె. ౬౭

గీ. సైంహికేయ వివేకంబు చాల కీవు, ద్విజులరా జని మ్రింగక విడిచి తేల
వీనిద్విజ*సంతతిద్రోహి దీనఁగాదె, మహిఁ బ్రవర్తిల్లె నీకుఁ దమఃపదంబు.

సీ. ఘనతమాగమములఁ గాంచితి వేరీతి వానియాంతరములు గాన వైతి
రహి నన్నియును బదార్థము లెట్లు దెలిపితి వ్యాప్తి నకుంఠితవడయ వైతి
వాగి నపూర్వాలోక మొందితి వేగతిఁ బ్రాభాకరచ్ఛాయఁ బడయ వైతి
పురుతమోహతి నెట్టు లొనరంగఁ జేసితి సత్ప్రకాశముఁ జేయఁజాల వైతి
కాదు తెలివికిఁ బదవిభాగంబు సేయ, వ్యాకరణవేత్తవై యెట్లు వఱలి తీవు
జగతి నెన్నఁగ నీవతిజడుఁడ వయ్యు, నహహ యెట్లు కళానిధి వైతిచంద్ర!

గీ. చంద్ర సన్మార్గవర్తివై జరుగు నీకు, సత్ప్రకాశంబు సేయుఁగఁ జనదె చెపుమ
సరవి దప్పంగఁ బలికితి సత్ప్రకాశ,మిలఁ దమోగ్రస్తునకు నెట్లు గలుగ నేర్చు.

గీ. అకట పదదర్శనమ్ము కరాగ్రమునన, యున్న దని చంద్ర యేటికి నుల్లసిలెదు
సంధివేళలఁదమము దుస్తరము గాఁగఁ, బ్రకృతిభావంబె తెలియఁగఁ బడదు నీకు

గీ. పంకజాతారి సంతాపపదమ వగుట, వాసికెక్కెను నీకళావత్త్వ మెన్న
నకటకట నీవు జడభావమందియుండి, యరసిచూడ మహత్త్వంబు నంది తెట్లు!

గీ. మేనిది నిశాసహాయత మెలఁగె ననుచు
సామ్యవైరంబుచే బాధ సంఘటింపఁ
జనునె పద్మ మాద్యము హరిద్ర నొనరఁ బలుక
శబ్దమాత్రసమాయాతసమతఁ గంటె. ౭౩

గీ. †నలినబాధక గుణవర్గణంబులోన, గణన గొనలేవు ముగుదలఁ గ్రాఁచ నీవు
అరసి చూడంగ నిది చిత్రమయ్యె నెట్టు, లేవని నిన్నుఁ గళావంతుఁ డనిరి బుధులు

*సంపతి-మూ †నలినబాంధవ-మూ

చ. హరియణుమాత్రమానసమునందు జనించి మరుం డనంగుఁ డౌ
కరణిని నీ వతీంద్రియతఁ గాంచితి వేని నిశేశ మాకు సౌ
ఖ్యరము ఘటిల్లదే యటులు గామి వియోగులభాగ్యహానియే
హరిహరి తప్పనాడితి ననంగుఁడునయ్యె నతండు నేఁచఁడే. ౭౫

చ. చలువలరాయ నీకు హరిసన్నిధి వర్తిలుదాన నొటచేఁ
జెలియల నైతిగా వరుసఁ జెప్పఁగ నైనను నన్నుఁ బ్రోవుమీ
చెలియలి నేఁచుఁ దోడనుచుఁ జెప్పఁగ వ్రిందువె యింత చెప్పఁగా
వలవదు తోడనే పొడమి వచ్చినచెల్లెలియిల్లు నిల్పితే. ౭౬

ఉ. తమ్ములమేల్* నిజోదయత దాసినయంతనె కూల్చి సుప్రభా
తమ్ములఁ బక్షపాతసుఖితమ్ముల సద్విజరాజచంద్రజా
తమ్ముల నెప్పుడుం బొగలఁ దద్దయుఁ జేయుచు నుండు నీకు నో
తమ్ములదాయ సద్గతియుఁ దద్ద్విజరాజత గల్గె నెట్లొకో. ౭౭

గీ. రాణ్గైకొని నే ద్విజరాజ ననుచుఁ, జెప్పికొన నీకు మదిలోన సిగ్గుగాదె
విప్రయోగులపాలింటివేరువిత్త, వది నిశాచర నీకెన్న †ననుచితంబు. ౭౮

సీ. పదియాఱుదినములు ప్రాప్త మా వెంటనే యఱిగెడుసిరికి మి న్నందికొనుచు
ద్విజరాజసాంగత్యవృజినంబు గైకొంచు సరసులు బెగడెడుచాయఁ గనుచు
ద్విజవృత్తిహరియించు వెరవులో మెలఁగుచుస్వప్రకాశోన్నతి చన మెలఁగుచుఁ
జెలఁగి మాన్యక్షేత్రములనాక్రమించుచుమావంటియనదలమన్నిగొనుచుఁ
దెరలనికలంక మూనుచుఁ దిరిగితిరిగి, యుడిగిపోయియథోగతిఁబడెడునిన్ను
...ద్విజరాజవని...యెన్నకొనెదు, కోశకారులు జగతిలోఁ గొఱఁతవడరె.

గీ. చంద్రత్వద్వాచక(ంబగు)చంద్రపదము, పలుకు విపరీతలక్షణాకథిత మగుచు
ఖేదకారిత్వ మిది వింతగాదు తెలియ, దర్శపదము విరుద్ధబోధకము గాదె.

క. కిరణసితరుక్కలంక, స్ఫురిత‡తాసీ(ల)రుచులొదవఁ బూర్ణేందుఁడు సం
హరిణారిఁ బోలు నేనియు, విరహిమృగము నీని గనుచు విడుచు నసువులన్.

క. కరము సుఖంబొనరు బుధ, స్ఫురణంబున జగతి నీకుఁ బొదమినబుధవి.
స్ఫురణంబు జగదుపద్రవ, కరణం బని యెన్నవయ్యెఁగా భువిఁ జంద్రా!

క. సకలాలంకృతి వేగతి, నకట లలితచిత్రరూపకాపహ్నవంబుల్
వికలములు నీకు మఱి దీ, పకభావవిరోధములును బ్రకటం బగునే. ౮౩

*మేలునిజోదత-†ననుచితంబె. ‡స్ఫురితాసీరుచు...యూ.

ఉ. ఆతతపుష్కరస్థలి విహారముసేయు గజంబుచంద్రుఁడ
ప్రీతి బిసాంగులం గెడప *బిట్టు మదిం గనలూని సింహికా
జాతుఁడు మ్రింగి క్రక్కె మెయి చాలక వానికి దోస మేమి జై
వాతృకుఁగా సృజించు నలువం దులువంచు వచింపఁగాఁ దగున్. ౮౪

గీ. విరహిబిసములఁ ద్రుంచుచు విమలపద్మి, †నీగణంబుఁ గలంచుచు నీరజారి
మదగజేంద్రునిసాటియై మలయు మింటఁ, గరబహుత్వంబు వీనికిఁగలదు గాని.

చ. ♦చలి కగువింటిబల్మిఁ గొని స్మారము జాలిఁగఁజేయు మారుఁ జి
చ్చులికను వెట్టచేఁ గడపి శూలి శశిం దలనిల్పె ‡నేలొకో
నెలవొరవింటి కోషధులు నిచ్చలు నేలుట వీనిఁ ద్రుంచినం
దెలియను ఖేదము ల్విషమదృష్టికి నిశ్చితబుద్ధి గల్గునే. ౮౬

సీ. నింగికి ముట్టంగ నెగెఁ బాలమున్నీరు పొంగించు, మేనెల్లఁ బొక్కఁజేయు,
జలజాటవి దహించుఁ, జంద్రుఁ డన్న(ను)విశేషార్థవాచ్యార్థంబు లనుపపన్న
ములుగవహ్నిత్రయి దెలియనబ్బురమేమిశ్రౌతవాక్యున నహఃకేతుముఖ్య
భేదకముల నుపపాదించుసూర్యునిఁ జంద్రమఃపద మని చదువులేదె
యరసి చూడంగ వహ్నికి నరిది వీని, వేఁడి యెట్లన్న నత్యంతవిహితయోగ
బలముచే నుక్తకార్యంబు పరఁగుచుచికి,నట్టికార్యంబువీనిఁగన్నంతఁబొడము.

గీ. జనన మందినదేశంబు మనఁగనీఁడు, వీని కాకీలిత్రో నెట్లు ఖేద మెనయుఁ
గలుషితాకృతి యగువీనిఁ గన్నకతనఁ, బాలవంటికులం బెల్ల భంగపడియె.

క. కాఁకదొరబిడ్డ తమ్ములఁ, గాఁకం దొరలంగఁ జేయు గామిడికానిం
గా కైనయ నిట్లు దూఱుచుఁ, గాఁ కైనయం బువ్వరువ్వకట్టెఁడిగ్రిదిట్టున్.

‹ మన్మథోపాలంభనము. ›

శా. తల్లి ల్లసుచును నన్నగద్దె యనుచుం దర్శింప కల్లాగ్ని తా
నల్లారుంజిగితమ్ము లంపగమిపా లౌనట్లుగాఁ జేయునీ
వల్లుల్ గన్గొనఁ గన్నతండ్రిమది దావజ్వాలలో డిందదే
చెల్లంబో మముబోంట్ల నేఁచు టరుదే చింతింపఁ జేతోభవా. ౯౦

చ. హరుఁడు మహోత్కుఁడం చెఱుఁగ కాతని కెగ్గొనరించి కంటిమం
ట రహిఁ దొఱంగి నీఱయి యనంగ పిశాచము వైతి కానిచో
ధర నబలాలి సోఁకుదువా తద్దయుఁ దాపము సంఘటింతువో
పరఁగ ననుక్షణోన్మిషదపారవికారదశల్ రచింతువో. ౯౧

సీ. చెల్లెలి*యిల్లెల్లఁ జెల్వొప్పఁగఁ జేసి కుముదంబులకుఁ బెంపు లమరఁ జేసి
సూర్యసంగతి నైనసొబగుమైఁ గలిమాని సురలకై కళ లెల్లఁ జూఱచేసి
పూర్వపక్షం బన్నఁ బొడవుగా నిక్కుచు నితరపక్షం బన్న నింపు చెడుచుఁ
జాలని యొకకళ సర్వజ్ఞతలఁ దన్ని మేల్కళానిధి వని మిన్నుముట్టి
ధరణిఁ జక్రద్విజాతులఁ దలఁకఁజేసి, శంక డిగి రాజ ననెడుకళంకితోడ
వఁ కయేపొంకమనిపూనుమంకుతోడఁ, బొందుదగునయ్యనీకుముకుందతనయ

గీ. సాధనం బవికల మైన జగతి సాధ్య, సిద్ధిఁ గాంతురు గాదె ప్రబుద్ధు లెల్ల
నహహా వికలము సాధనం బైనయట్లు, చేకుఱెను మార యువజయసిద్ధి నీకు. ౯

ఉ. తామదిలోఁ గళం కుడిగి తఱి దలకెక్కఁగఁ జేసికోఁగనే
భీముని నీకుబల్పగతుఁ బెద్దగ భూష్మణచేసి నీశరం
బేమఱి కూల్చినట్టి జను నీతని నే మని చందమామ మా
మామని చెప్పకో హరికుమారక నీమది సిగ్గు లే దొకో. ౯౪

చ. సమయమటి గాఁగనే విరియఁసాఁగెడుతూపులు నంటినంతనే
భ్రమపడి కూయునారి తఱిరాఁ దెగువిల్లు విరూపమైనతే
రు మఱి చిట్టుక్కురన్న బెదరుం బడివాగెలు గల్గి దేహమే
యమరనియోధమై యకట యందితి వెట్లు జయంబు మన్మథా. ౯౫

గీ. బాణ మున్మత్త మై నీకుఁ బరఁగసాగె, మధువుతోఁ గూడ నీకు నున్మత్తవృత్తి
గలుగఁగార్యంబుచెడుఁగానఁగానిపొందు,విడువనీకనైనఁదగుమధుద్వేషితనయ.

సీ. తియ్యనిబోనంబుఁ దిని మన్ని పట్టులఁ జేరి నున్నఁగ్గులఁ గేరువాని
నొకమృదుసుమమాత్ర మొంట నంటిన యంతఁ జెల్లుభీతిల్లిమూర్ఛిల్లువానిఁ
బల్లవపద మీఁగి బలుకప్పు మైఁ బూని పంచమవృత్తి చేపట్టువాని
శరవర్షముల నుర్కి గిరిగహ్వరము దూఱి హావడి తప్పట†నలయువాని
నుప్పరంబుననెలకుబ్బి‡యూఁగువాని, వెన్నెలకెవాడి తెలివెల్లవిడుచువానిఁ
గలసికొని మన్మ వేధింప వలచితేని, మదన మనలే వరూపమయ్యెదవుగాని.

—♦ మందమారుతోపాలంభనము ♦—

క. అలివేణి యిట్లు నెవ్వగ, వలినేలుపునల్లుఁ దెగడి వారనికినుకన్
బలుకీలలీల సోఁకెడు, చలిగాలిన్ దూఱుఁ దూఱి చననివిరాళిన్. ౯౭

సీ. వాగులు మలలు నవ్వారిగా నెలకొని కనరాక మెల్లన చనుచు నట్టి
సమయంబునైన వాసన మచ్చ్రి వడిఁ జల్లిచలువలెక్కఁగఁజేసి సాధుమాన

వస్తువు ల్గొను నల్వ పశ్యతో హరచోరుఁడని పాపములలోయ నలయహీన
బలములఁ గాఁపుంచి పడ వైవఁగా వాని నటుచేసి తద్ధనం బంత గొనుచు
మమ్ము వేధింప వచ్చితిమలయపవన, మనవిగాఁ జెప్పెదను నాదుమాటవినుము
ధైర్యమనియెడునొకమహాధనముగలదు, వెన్నునకు దానిలాగెడు వెరవుగనుము
చ, పురహరమూర్తులందు నొకమూర్తివి బాలసమీర నీవుగా
హరునకు నెప్పు డక్షిగతుఁ డైనయనంగుని క్రింద నీఁగఁగాఁ
బరిణత మయ్యె నెట్లు మది భావము నీ కభిమానశూన్యమై
హరిహరి తప్పఁ బల్కితి ననంగత నీవుఁ బిశాచ మౌదువున్. ౧౦౧
గీ. బాలభావత జడుఁడవై వచ్చుకీడు, దెలిసికొనలేక ననుఁడాయుఁదలఁచి పవన
వచ్చె దేటికి మోసంబు వచ్చు నీకు, ఫణిశయానునిసన్నిధిపట్టు మాకు.
క, కట్టా యేఁచెదు చెలువులు, చెట్టలపాలయ్యె నేమిః*చేరెదుఁ బుట్టన్
పుట్టవ యాఁదోడులతో, నుట్టిపడితె యాకసంబునుండి సమీరా. ౧౦౨
ఉ. గంధపుఁగొండ నండగొను కట్టిఁడి పాపవిషాగ్నికీలలం
జెందఁగఁ బోయె నీజడిమ శీతత గల్గినఁ గాఁక చేయుదే
మందత నిట్టి ధీ యెడవె మానగు శైత్యము నీకుఁ గల్గెనా
యందలి దందశూకచయ మంది గ్రసింపఁగ నిందు వత్తువే. ౧౦౩
గీ. విరహిజనముల ప్రాణముల్ వేగఁగొనఁగఁ, బవననీ కెట్లుదగు జగత్ప్రాణసంజ్ఞ
యశ్వకర్ణాదినయమున నది పొసఁగు, నొండె విపరీతలక్షణ నొనరునొండె.
గీ. నిరతిశయమత్తనూష్ణిమ నీకు నెట్టు, లుష్ణిమ యడంగి శీతత యుద్భవిల్లు
నాతురతఁ గానిపనికి నీ వరుగు దెంచి, తిహాహా జనునకు విజ్ఞాన మబ్బునెట్లు.
గీ. పాంథులకు నిన్నునుండియుఁ బడనిపాటు, లెట్టు లన్నను జంద్రశి(తే)ధనమున
నతనువహ్ని సమింధనం బగుటయరుసు, మలయపవమానపయినీవు మలయకున్న.
క. మాయన్న శమనుఁ డనుపఁగ, మాయన్నా వచ్చినావె మ మ్మరయంగా
మాయన్నదూత వగుట, న్నాయన్నయుఁ బోలెఁ నీవు మ మ్మలఁచెదవో.
చ. విరహుల నేఁచుపాతకము వీడెఁడి వోవునె జాడ్యభుజతా
భరమునఁ గుంచి బల్లలలపాలుగ నుంచి భ్రమంబు నించి రూ
పరిదిగ డించి యప్పు గవు లంట రచించి యహీనభీతి మే
దురము రచించి నిన్నుఁ బలుత్రోవల బెట్టెడుఁగాక మారుతా. ౧౦౪

*చే రెప్పట్టల్ పుట్టలయాం-పూ.

గీ. పాంథజన దాహ మొనరింపఁ బవన నీకుఁ, జెల్లు ననలాభిధానంబు చెల్ల దనిల
శబ్ద మచ్చట నిత్యసంసర్గఘటన, మహిజనంబుల కెల్లఁ బ్రామాదికంబు.

చ. మలయసమీర, రీతి గన మంచిది శబ్దము నుష్ణ శైత్యముల్
బలువులు సుప్రసాదత యపారము మాధురి హెచ్చు వాసనల్
గలుగు రసంబు పూర్ణ మని కా వినుతించు ఘనాళి యట్టినీ
చెలువపురీతి నాచెవుల చెంత (నితాంత) కఠోర మేలొకో. ౧౧౦

— । శుకకోకిలాద్యుపాలంభనము । —

క. కలకంఠి యిట్లు గందపు, మల మెలఁగెడుగాలిఁ బల్కి మానక శుకకో
కిలబర్హిణాళి హంసల, కలకలముల కలికి పలికెఁ గటకటపడుచున్. ౧౧౧

గీ. శుకసుకవి నీకవిత్వంబు శోభగాంచు, మధురతరవాక్యరచనల మదనమూర్తిఁ
దొలుపునై నీసుమీఁ దెక్కనొర్చి తెల్పు, విషము మున్న త్తమతనిగోవితతిగాదె

గీ. యోగిజనులెల్ల నానంద యోగ మొసఁగు, నతిజడా యోగులకు నెల్ల నరతిఁ జేయు
నీమమధురోక్తి యీయుక్తి నిజము సుమ్ము, శుకమృదూక్తులకై వడిశుకవతంస.

చ. హరిపదదేశ మందుమ మహామధురంపు రుచుల్ స్వజిహ్వకిం
పరుదుగ నాని మాధవసమాశ్రయణైకనిబద్ధబుద్ధి మే
లిరవగునట్టినీకుఁ దగునే శుకసత్త్వము మెన్ని చూచుమా
హరిహరి యీఁడుఁబేదలకు నాంతర మెల్లను నొవ్వఁ బల్కఁగన్. ౧౧౪

చ. నలువ యొనర్చె భాణము ఘనం బగుశక్తగ యేతదర్థముం
దెలియక శబ్దసామ్యమునఁ దియ్యనిచక్కెరఁ బెట్టసాగి ర
ట్టుల నయిన న్నిజోక్తులఁ గఠోరత మానుమె నీకుఁ గీరమా
తెలిసెఁగదా విధాతృఁడు విధించినకార్యము రిత్తవోవునే. ౧౧౫

క. సుక మానసీక చిప్పలకుఁ, సెక మాటి కొనర్ప నిది రసికమాధురియే
యిక మానుము ముఖజితకిం, శుకమా చల మేల బాలసుకుమారకమా

చ. అనుసమయాపతద్విషధరాగతసన్మదనస్తనానువ
ర్తన లోనగూడియు న్విషధరగ్రసనోగ్రత మించి తోశిఖం
డి నిను నుతింప మైఁ దలఁకు డీవిఁ గలాపము కేశపాశమై
యొనయ యదూద్వహుండు ధరియించుట యెట్టులొకో మయూరమా. ౧౧౭

శా. లేదావంత యనుంగు నెవ్వగల జాలిం బొందఁగా నేరికిన్
లే దావంతయుఁ బెంచె నంచ యది నోలిం గూర్మి యదుర్యాశిఖి

నాదాఱి న్నినుఁ బెంచమూర్ఖ నిఁక నెన్నం గొంచె మా పావముల్
రా దావ్యాకృతి దా నిపాతితమయూరవ్యంసకం బే కదా. ౧౧౮

సీ. చతురాననాకృతి సతతంబుఁ బూనుట గగనపథంబున గతులు గొనుట
నీరజంబులయందు నెఱిఁ గూర్మి వడయుట మాధవుచెలువు రా మదిఁ బొదలుట
ఘనకాలమున నప్రకాశతఁ బొందుట యురుధరాంతరసీమనుండి పడుట
కాలవృత్తులఁ గాంచి *కాంచమ్ముల్లా నుంట ఖగశబ్దవాచ్యత గలిగి మనుట
హంసనీకునునను గన్నహంసునకును, దారతమ్యంబు గలుగు నెతలఁచిచూడఁ
బోఁడిమిఘటించుమాత్రం బ్రిహొందుడిగిన, యిందుకోఁబొందునీకె దునిందితంబు

ఉ. పాలును నీరు నేర్పఱుపఁ జాల్పు మన్నట్టి(ది) గోపకన్యకా
పాలు నుదారకీర్తిరుచిప ట్టిది యంచును నిన్ను నెన్నఁగాఁ
బా లయినట్టి నాదుమయి భావజు తెంపటియుంపగుంపు పెం
జాలుగఁ జేసి కన్ను జడిపాలుగఁ జేసితి గా సితచ్ఛదా. ౧౨౦

చ. మును దమయంతి నైషధుని ముచ్చట దీరఁగఁ గూర్చి కీర్తి చే
కొనియె మరాళచంద్రుఁ డదిగోలె భవత్కుల మెల్ల నిర్మలం
బన నలరారు నమ్మహితునట్ల చరించుట నీకవశ్యమే
విను మటు గానఁ గృష్ణునకు వే చని తెల్పుచు నన్నుఁ గూర్పవే. ౧౨౧

క. కవికి వైదర్భి వలె నా, కవి కావైదర్భి యిష్టగతి ము న్నలరెం
గవిరాజ నీకు నేనుం, బ్రవిమలమతి నిష్ఠురాల భావింపఁగదే. ౧౨౨

గీ. తుల్యరుచిపక్షయుగమునఁ దొలఁగువానిఁ, గమలములమేలు నైఁపకకందువాని
మేను నకలంక మైనను మెఱయువానిఁ, గూడకుముహంస తదితరగుణరిరంస.

చ. అనుపమమానలబ్ధసరసాగమపల్లవసేవనక్రియా
జనితము లైనమాధవవశంవదతాద్విజవర్యభావముం
గనినటువంటి నీ కకట గాలిమఁ గన్ తొగరెక్కి పంచమ
ధ్వని వచియించు †ట్టిట్టు లుచితం బగునే పికమా తలంపఁగన్ ౧౨౪

చ. అకట సపక్షపాతత నయంబును బూనితి వంచు నమ్మినం
బ్రకటవిపక్షపాతమున వర్తిలి నీ వవిపక్షపాతముం
బికమ ఘటించె దేమిటికిఁ బేర్మి మదిం గదియించి ప్రోవు న
న్నిఁక మఱి యొండు మాని వినుమీ కనుమీ పరపుష్ట నామముల్. ౧౨౫

* కాండమ్ముల్లా ? †టిట్వాథియుచితం-మూ.

గీ. మాటమంచితనము మహిలోఁ బ్రసిద్ధంబు, మాటమంచితనము మనకుఁ గలదు
చిగురు వాఁడచిరసము తెగఁద్రావుదానికి, నీకుఁ బికమ యదియు జోకగాదు
చ. సరసులపొంత హంసగణసంగతి సేయుచుఁ బద్మగహ్వరాం
తరముల నుండుచుం దనువు దాళుటకై భువిలో నదర్శన
స్ఫురణగఁ బువ్వునీరు పలుచోటుల భిక్ష యొసర్చునీకు ని
వ్విరహులమీఁద నెట్లొదవె బెట్టుగఁ గ్రోధరసంబు భృంగమా. ౧౨౭
ఉ. జీవనమాత్రనే తనివిఁ జెందుచు హంసకులంబు నాత్మగా
త్రావళిఁ జాలఁ దన్పుచు ననల్పమనోహరసుప్రసాదశో
భావృతమైన సారసచయంబులయాంతరసార *మెక్కు నీ
కేవిధి సీధుపాయికి నళీ దయపుట్టెడు నయ్యయోగిపై. ౧౨౮
గీ. చాల సీధువుఁ గ్రోలుచు జడత నొంది, నీచతను గాంచితివిగాదె నీవు జగతి
నకట భృంగంబ సంబుద్ధి నాంధ్రశబ్ద, శాస్త్రకర్త మహత్త్వంబు సదివెనెట్లు.
వ. ఈరీతి నానారీతిలకం బబ్జవైరి నవమతించియు నలరువిల్తు నధఃకరించియు నలసపవను నవమానించియు నళుల నవహేళనించియు నంచల ననాదరించియు నాటపులుఁగుల ననురోధించియు, ననవిందుల నపాకరించియు, నతనుమావుల నపురస్కరించియుఁ దద్దర్శనంబునం దత్స్పర్శనంబునఁ దదనులాపాకర్ణనంబున వెతమేరమీఱిన యయోగపారావారంబున మునింగి మూర్ఛిల్లిన నుల్లంబునఁ దల్లడిల్లి నీలవేణీప్రముఖపల్లవాధరలు తెల్లవాఱు టెప్పుడో †తెల్లంబుగా నీమెతల్లిదండ్రులకు మేమెల్ల (మెల్ల)న నరిగి విన్నవింతు మెప్పుడో యని యనితరాయత్తచిత్తలై యమ్మత్తకాశినికి నుత్తల మొక్కింత మెత్తంబడఁ దత్తదుపచారంబు లాచరించు చున్నయవసరంబున. ౧౩౦
చ. సరసుల నేర్చి చక్రముల సంస్మృతిఁ గూల్చి జగంబు వెల్వెలం
బారయఁగఁ జేసి వారుణిశిఁ బోమె నిశాచరచంద్రుఁ డింక నీ
వరయఁగరా నిదే సమయ మంచును సారెకు మిత్రుఁ బిల్చె నా
మొనసెను గాలవేసు లటముందుగ నుత్త్వము మువ్విధంబుగన్. ౧౩౧
శా. ఊకారంబు సవర్ణదీర్ఘయుగళీయుక్తంబు గావింపుచున్
జోకన్ హ్రస్వముఖస్వరాంకములఁ దా సూత్రంబున న్మాటెఁ గా

*మిక్కు †తెల్లబుగానితల్లిదం-మూ

*వ్యాకర్తాముని మద్వచస్సరణి నుత్వం బచ్చుట స్థాన మం
చూకారాకృతి త్రిప్రకారముగ మ్రోయుం గాలవిద్యాంసముల్. ౧౩౨

ఉ. మిత్రుఁడు రాతి †రిచ్చెఁ దవమ్మెలిమిఁ గైకొని పొంగి తండ్రి యీ
గాత్రము తెల్ల నుల్లసిల గారవ మొప్పఁగఁ బెంచె నింక న
మ్మిత్రుఁడు గైకొను న్వసు(వు) ‡మేను లిఁకెట్టులు ప్రోదిగాంచు నం
చాత్రము దోఁపఁ దెల్వి డిగి యాడుచు నుండెను దీపడింభముల్. ౧౩౩

క. నిలిపినదిక్కునఁ గటిలత, దలఁపక సస్నేహవర్తిత స్నెలఁగు మముల్
వెలయింపఁడు ఖరకరుఁ డని, వెలవెలఁ బోయెను బ్రదీపవిసరం బెల్లన్.

చ. కువలయ మేర్ప నుగ్రకరగుంభన మై నినుఁ డేగుదెంచె స
త్ప్రవణతలే దరిప్రజము రాణయొసంగెడు యుష్మదీయమై
భవములు చెల్ల వేగుఁ డని బంధులఁ దెల్పఁగ వేగ వచ్చె నా
దివిఁ గనుపట్టె సూక్ష్మరుచిఁ దేలుచు వేగురుఁజుక్క చొక్కమై. ౧౩౪

క. అనుసృతశబ్దగుణాంబై, కనికనముల వేగుఁజుక్క కడు నలరారెం
గననగుచుగనమిఁగైకొను, చనువగు నయ్యర్థమునకు నతిమిత్రంబై. ౧౩౫

మ. ఉరుపూర్వాగనుసంగతిం గొనుచు నెంతో రక్తిమం బూనుచుం
గరము ల్చాఁచె మహాంబురాసు లలరన్ ఖండించె నుద్వృత్తమో
భర మెంతే నపరాగమంబు గనుమన్ భావింపఁజేయుం దమో
భర హారా ద్విజరాజు చిత్రగతులం బాటిల్లి చూపట్టెడిన్. ౧౩౬

చ. అరులు దొలంగ సత్కువలయంబు చెలంగ సమస్తవర్ణముల్
సిరులు మెలంగ బల్మమము చెన్నుదొఱంగఁగ రాజు రాణఁబు
గరము వసించి కాలగతిఁ గ్రుంగిరు ల్విడనాడి పోవుచున్
జరమఘనాగమంబు గొని సారమహాంబుధిఁ గ్రుంకె గ్రక్కునన్. ౧౩౭

—॥ సూర్యోదయవర్ణనము ॥—

క. పూర్వమహీధరశిఖరా, ఖర్వాసన మెక్క నినుఁడు కడురక్తిన్ రా
సర్వదిశలన్ ద్విజోక్తులు, పర్వెఁ దదభ్యుదయవిభవపటుబీజము లై. ౧౩౮

సీ. ఇనుఁడురా నుదయాద్రిఘనభద్రపీఠిపైఁ బఱచిన నునుగెంపుపఱపనఁగ
నమ్మిత్రురథరశ్మ లై మెలంగెడు చిల్వపడగలరతనాలభాతి యనఁగ
నజహాప మైనట్టి యంబుజాప్తుని మేని పురతఃస్ఫురత్కాంతిపూర మనఁగ

*వ్యాకర్తాముని †రిచ్చ ‡మేనులిట్టులు-మూ.

సప్త-ప్రకృతి

వినుసిరి మగుడంగ నిడ నెమరేగిన సతనాలుకలవేల్పుచాయ యనఁగఁ
భరితేంద్రమతంగజప్రబలదంత, కుందముఖదారితోదయకుధరహైమ
తటసముత్పతదురురేణుపటలమనఁగ, సాంధ్యరాగంబుతోలుదెసఁజాలనలరె.

సీ. చెలువులు గుల్కెడుసీమంతరేఖపై సొగసూను కుంకుమ సోగ గాఁగ
సింగార మొనరెడు చెక్కుటద్దంబుల దీపించు పూఁతచందిరము గాఁగ
విన్నాణములు గాంచు వీనులఁ గ్రొన్ననరాణించు కర్ణపూరములుగాఁగఁ
గోమదు సిబ్బెపుగబ్బిగుబ్బలఁ బవడాలఁ బురణించు బలుబన్నసరులుగాఁగఁ
దనదు కెంజాయలకు నాస దండడింప, విష్వగటులతోవకెంటులొప్పుమీఱఁ
బొడుపుగుబ్బలిగుబ్బలపొందుసేయ, నండఁగనుపట్టె మార్తాండమండలంబు.

సీ. అందుగుఁజిగు రంచు బృందారకస్వామిసామజంబు కరంబు సాఁపఁజూడఁ
బలుకుఁబూఁబోఁడిమై మెలఁగెడుచామకై చిలుకబింబంబంచుఁజిదుమఁజూడఁ
దళుకుఁగెందామరతండం బని *విరించి పడివాగె రాయంచ తడవఁజూడ
మహితకుంకుమకర్దమంబంచునూహించియగచరాంగనలెల్లనలఁదఁజూడఁ
గెంపుడాలంతటంతటఁ గీలుకొనఁగ, నుదితుఁ డయ్యెను జగదేకవిదితకీర్తి
యాదివాగ్మూర్తి ద్రుహిణరూపానువర్తి, సంహృతనతార్తి ఖేచరచక్రవర్తి.

సీ. సత్స్మృతిశ్రుత్యర్థసత్కర్మసత్కంబు నోఁపుఁ దెల్పెడు మేటిమొజ్జ యనఁగ
†జగదుత్ప్లవోదయశాంతిక్రియార్థమై వఱలెడు పటుహోమవహ్ని యనఁగ
జలవాసనియత యోజలజినీతతితపఃఫలము గైకొన్న వివర్త మనఁగ
జక్కవపులుఁగుల స్రుక్కించు విరహాగ్ని మానింప దీపించుమణి యనంగ
మూఁడుమూర్తులతోఁ గూర్చి ముచ్చదువులఁ
బొడుపుగుబ్బలిశిఖరంపుమూపులోన
మొనయ ఘటియించి చేసిన ముద్ద యనఁగ
నింబు మీఱంగ నహిమాంశుబింబ మలరె. ౧౮౩

క. సత తేజిల్ల ఖురోద్ధత, హాతిఁ దుము రగుపూర్వపర్వతాగ్రస్థలి ను
ద్గత మైనరజము గ్రమ్మిన, గతి నినమండలము కెంపుగదురఁగ నొప్పెన్.

సీ. అఖిలనేత్రాంధ్యసిద్ధాంజనకళికలు తిమిరోపసంహారదీపశిఖలు
భూమీరుహాగ్రప్రభూతపల్లవములు ‡కమలినీతంద్రీ విఘటనబంధు
లక్షీణఘూకౌఘవీక్షణపటలంబు లంబరాంచలతప్తహైమరేఖ

---

*తలంచి †జగదుత్ప్లవోదయ ‡విఘుసవొందు—మూ

లురయోగపహ్నిసంస్ఫురణైకధౌర్యులు కైరవనిద్రానుసారిగీతు
లతివిరహికోకసాంగత్యచతురచేష్టు, లుడుగణోత్పాతకర్ణేజపోత్తమములు
దిఙ్మలినతాప్రమార్జనదీప్రవార్లు, లినకరచ్ఛవిమాలిక లింపుగాంచె. ౧౨౫
సీ. ముప్పొద్దుదుగదచ్చిమోహములోంచెడుసామిభారప్లోడుమలూనుబలిమికాండు
చుక్కలచెలికాని జోడైన నెఱవాది తొవలమే లోర్వనిదుండగీఁడు
తమ్మితావులఁ దావి గ్రమ్మఱించు ననుంగు వేవేఁడిచాయల వింతలాఁడు
ముత్తొంటిచదువులు హత్తు మైఁ గలమేటి పగడచక్కుగుఱాలసొగసుజాణ
పగలు గావించుచును జుట్ట మగునొయారి, జగజంతవేల్పు
కుంటిగడపరి యొకబండికంటితేరు, గడప రిక్కలతెరువున నడవఁదొడఁగె.
క. భీకరతమోంబురాశిఁ, జోకటి పడియున్న జగము శుంభద్వేగో
ద్రేకత మిత్రుం డాగిఁ దన, వేకరముల నుద్ధరించె వేకనుపట్టన్. ౧౨౭
క. ?తొలుదెసయును పేర్మొదలగు, కలపేరులపుట్టినిల్లు కరువలిజేజే
చెలికాని కప్పు లొసఁగెను, బలుసిరులవెలుంగు బ వెలిఁగన్. ౧౨౮
గీ. అపుడుసప్తాశ్వుఁడఖిలశబ్దార్థములను, నవనవోన్మేషమొనయించినలువపజెచె
నబ్రమా యిది సర్వశబ్దార్థజాల, మహితకరమండలుం డైనమా(న్యమతికి)
సీ. నానావిధార్థసంధాననివాసంబు సత్కాంతికరపదసంగతంబు
సకలంకసుందరం బతులప్రసాదంబు ననుపమాజోగుణాత్యద్భుతంబు
వసద్భృశానందనిష్యందధౌరేయంబు బహురసగ్రహణైకబంధురంబు
కువలయమోదసంకోచనప్రవణంబు బుధకవిసంయోగభూషితంబు
సంగరౌదార్య మఖిలభూషణ ముపాత్త
విష్ణుపద మాచుఁ గవిచంద్రవిరచితంపుఁ
గావ్యమనఁ గోవిలాసంబు గడు సరసుల
నలరఁజేయఁగ సూర్యమండలము దనరె. ౧౩౦
క. అరుదైన లోకమిత్రత, కరము ప్రసిద్ధంబుగాఁగఁ గడునామోద
స్ఫురణ దయచేసి యరులన్, సరసుల సరిగాఁగ నేలె జలజాప్తుఁ డొగిన్.
గీ. అఖిలపదదర్శనా , వ్యాకృతి యొనర్పఁ దాఁ బూని యఖిలసంజ్ఞ
లప్రతీపప్రకాశత నమరఁజేసి, మఱిచెఁ గాఁబోలును భసంజ్ఞ వఱలఁజేయ.
ఉ. చాయల సారుహావారముపైఁ దమోరిపుం
ఛాయక డాఁచునంచు గిరివర్గముపైఁ బగవానియాంధ్రబ

ల్చాయల మాటె నంచు సురజాలఘథంబుపయి న్సరోషదూ
తౌయతదృష్టు లుంచె నన నంబుజబంధుఁడు నించెఁ గ్రొంజిగుల్. ౧౫౩

చ. తమము నిరాకరించి...... ౧౫౪

(ఇక్కడఁ గొన్ని పద్యములు లేవు)

—( కాళిందియవస్థఁ జెలి సూర్యునకుఁ దెల్పుట) —

సీ. అవధారు దేవ లోకారాధ్యనిజరూప విన్నగదే జగదేకవిమలదీప
యాలింపవే భక్తజాలరక్షణదక్ష చిత్తగింపవె హతోచ్ఛ్రితవిపక్ష
యాదరించవె సహస్రాంశుమాలాధుర్య మనవి చేపట్టవే మహితశౌర్య
మది నిల్పవే వేదవిదితసద్గుణగణ్య యభయ మీఁగదె మహాప్రభువరేణ్య
పలుకు వినఁజూడఁగదవయ్య జలజమిత్ర, తలఁపులీడేర్పఁగదవయ్య కలుషజైత్ర
ప్రేమ నాయెడ నిల్పు ముద్ధామధామ, చక్క నిటు చూడవే గ్రహసార్వభౌమ.

సీ. సకలలోకానీకసంరక్షణ పరాకు తిమిరోరుగజమృగాధిప పరాకు
కమలప్రమోదసంఘటనధుర్య పరాకు హతభీమనిగ్రహాహిత పరాకు
బ్రహ్మాదిమూర్తిసంపద్బంధుర పరాకు వితతత్రయీరూపయుత పరాకు
భవ్యాంబరాంగణదివ్యదీప పరాకు నిరుపమగుణరత్ననిధి పరాకు
కలితకారుణ్యపూర్ణవీక్షణ పరాకు, నతమనోరథపూరణవ్రత పరాకు
ధార్మికోత్తంససేవితోదయ పరాకు, తపన మార్తాండ సంవిదాత్మక పరాకు.

గీ. సామి నేఁ జెప్పునదియేమి సకలకర్మ, సాక్షివై నీవు సర్వశాస్త్రములయందు
నధికరూఢత మెలఁగెద వయిన నేను, నబలఁ గద నాదువచనంబు లాలకింపు.

క. కలకంఠి మ్రోదుసన్నిధిఁ, గలగానము సేయ వినఁగఁ గదునలరుచు న
క్కలహంసి వచ్చి తెలిపెన్, జలజాక్షునిమహిమ మీకుఁ జతురత మెఱయన్

క. తెలుపుచు నంతట నిలువక, జలజాక్షుఁడు నీకుబిడ్డసహచరుఁ డగుచున్
మెలఁగఁగలవాఁడు సుమ్మీ, పలు కిది నిజమంచు నాఁడు పలికె చనెఁగదా!

క. అది విన్నది మొదలుగ న, మ్మది రేక్షణ హృదయవారి మాధవగజముం
బదిలముగ రాగశృంఖలఁ, గుదియఁగ బంధించె నధికగోప్యముగాఁగన్. ·

క. వనితకు నది కారణముగఁ, దనువున నంతంత కతనుధర్మము పర్వెన్
విను మనలకీల యార్ద్రేం, ధనమునఁ బలె సకలసుజనధర్మనిధానా! ౧౬౧

గీ. ప్రకృతి ననుసరించి పరఁగును జగతిలో, వికృతి యిద్ది వింత వెలఁదియందుఁ
బ్రకృతి నడఁచి వికృతి ప్రబలమై కనుపట్టె, నఖిలగుణసనాథ యజ్ఞనాథ.

ఉ. ఇంతికిఁ బుట్టునివ్వికృతి యేమి యొకో యని కొన్నినాళ్లు తే
మెంతయు సంశయం బెద వహింపఁగ నుంటిమి రాఁగ రాఁగ నే
కాంతము మాని బైలుఱుకునట్టివచోరచనం దనూలతై
కాంతసతాంతతాదివికృతాకృతి సందియ మేగె మాకొగిన్. ౧౬౩

గీ. అరయఁడనినిన్నుఁగోపించియతివప్రాతి, భట్యముభరించెనేమొ తాఁబద్ధమిత్ర
తన్వవస్థలు నీవు ద్వాదశతఁ బూనఁ, ద్వాదశాతన్వవస్థలు తరుణిపూనె.

ఉ. తల్లిన పోలుఁ గూఁతు రను ధార్మికవాక్యము పొల్లుపోయె నేఁ
దల్లినిఁబోలఁ జాయవలెఁ దద్దయు శైత్యముఁ *జెందకుందు నే
తెల్లముగాఁగఁ దండ్రియగుతీవ్రమయూఖునిఁ బోలి కాఁక మే
నెల్ల మునుంగ నుంటి నని యిందునిభానన పల్కు నుల్కుచున్. ౧౬౪

సీ. తలిరాకుఁబోఁడియాటలమీఁదియనురక్తి వంధ్యాసుతక్రీడవాసిఁ దెగడుఁ
గలికి పాటలమీఁది ఘనతరామోదంబు మృగతృష్ణికావారిసోగసుఁ బూను
నతివభూషణధారణాభిలాషస్ఫూర్తి శశవిషాణముతోడ సరసమాడు
నెలనాఁగసరసాన్నగిళనవాంఛోదయం బంబరసుమము నొయ్యారమేనయుఁ
బణఁతిచీనాంబరలతాంతభరణకాంక్ష, యుషదవాక్యార్థవైఖరి నపహసించు
బాలికామణితనుధృతిలాలసంబు, నప్రణవవేదపాఠంబు ననుసరించు.

గీ. కాఁక యుడిగినపుడు కలదు సత్త్వగుణంబు, మీకుఁ గాన నింతిమిమ్ముమించుఁ
గాఁక మేన మిగులఁ గడుసత్త్వగుణముల, నెనిమిదింటిఁ బూను నెపుడువింటె.

క. ఇంతి యవియోగమహాగద, శాంతికి నస్మత్కృతోపచారములు దివా
కాంత చ్యుతమయ్యె నచ్యుత, కాంతోపసృతిన్ ఘటించి కరుణింపఁగదే.

ఉ. మన్నొకనాఁడు నీతనుజమోహము దెల్పఁగ వచ్చి సందడిం
గన్నకతంబునం దెలుపఁ గార్యము గా దని పోయి తప్పు డీ
మెన్నువ నయ్యవియోగరుజ యింతకుఁ దెచ్చె టెఱుంగనైతి నా
విన్నప మాలకింపు మిఁక వేదన కోర్వదు కూఁతుఁ బ్రోవవే. ౧౬౯

ఉ. ఈగతి నీలవేణి తనయింపులకూఁతు నయోగయాతనా
యోగము విన్నవింపఁగ ననూనకృపాకలితాశ్రువాఃపృష
ద్యోగము గాఁగ దీప్రపుమయూఖసహస్రము చిట్టిటస్వనా
భోగముగా నొకింత వడిఁ బొందిక దప్పిక తత్క్షణంబునన్. ౧౭౦

---

*జెందఘుండు నే—మూ

గీ. ఛాయమాయఁగఁదనమేనిచాయవోలె, జాయసనుదేరఁదనుజాతచాయఁదొల్తి
వేయుచాయలమనసుతో వేగ నవువఁ, జాయ పెన్మిటివచ్చెఁ దత్సదనమునకు.

ఉ. వచ్చి యసంస్కృతాంగి యయి వాడుచు జీవితనైరపేక్ష్యమే
హెచ్చ చనుక్తవాచ్య యయి యీహితయోగము దప్పి కాంతిలే
మచ్చుపడంగ నస్వాగతి నందనివర్ణము గాంచి పైపయిన్
విచ్చక క్రుమ్ము కష్టత నవేత్తృకృతిన్ హాసియించు పైదలిన్. ౧౭౨

సీ. శుక్తికానిర్గతముక్తాఫలంబులకరణిఁ గన్నుల బాష్పకణము లొలుక
రాహునిర్ముక్తపూర్ణనిశాకరునిమాడ్కి ముద్దులనెమ్మొము మురువువదల
వనవహ్నిశిఖలచే బలెవేఁడినిట్టూర్పుగాడ్పుల దిశలెల్లఁ గాంతివిడువఁ
దాపాబ్ధిశైవాలరూప మై కనుజడి జడగట్టి పెన్నెఱుల్ చాయ దఱుఁగఁ
గాఁకచేఁజూర్ణమైఁ పూఁతగంధము నకుఁ, దోషపడియశ్రు చారులుదోఁగిమిగులఁ
బంకమగుచున్న నెలవునఁబడుచు లేచు, నస్సురుసురంచు*వలవంతనున్నదాని.

చ. తనుభవఁ గాంచి మేను మది తద్దయు†జల్లన వేకరంబులం
దనువు మనంబుతో మిగులఁ దాపము చెందఁగఁ గౌఁగిలించి చ
క్కనితొడమీఁద నిల్పి జడకట్టిన పెన్నెఱి చిక్కుదీర్చఁగా
నొన రొకయింతలేక యవి యొక్కెడఁ జేర్చి ముడి న్రచింపుచున్. ౧౭౩

గీ. చెక్కు నొక్కుచు ముద్దాడి శిరముమూర్కొని, విషయముగఁ జేసి నెమ్మేను వేకరములు
వెక్కసపుటూష్మ మనసుతోఁ జిక్కువడఁగఁ, బలికె మధురంబుగా లోకబాంధవుండు.

క. తల్లీ వరనారీమ, త్తల్లీ నీతల్లి మనసు తల్లడపడ నా
యుల్లము జల్లన నీకీ, పల్లట మేలమ్మ మేలుబంగరుబొమ్మా. ౧౭౪

గీ. పడఁతిమత్పూర్వపటుతపఃఫలమ వగుచు, ఖ్యాతి మీఱంగఁదనుజాతవైతివీవు
నీకతంబునఁ గద నాకు నిఖిలలోక, వల్లభుం డైన శ్రీకృష్ణుఁ డల్లుఁ డమరు.

క. అస్తంగతిరహితాధిక, శస్తాభ్యుదయంబు నాకు సమకూరు ‡నినున్
నిస్తులసుగుణాంగన యర్థి, హస్తుఁడు లోకైకకర్త యల్లుం డగుటన్. ౧౭౫

ఉ. శీలగుణాభిరూప్యసవిశేష్యకళాచతురత్వవైఖరీ
శాలిత గల్గు నీకు హరిసంగతి గల్గ సమాఖ్య భూషణం
బేల మెలంగకుండు సుజనేరితవాక్కుల నాకుఁ గల్గదే
మేలసమాఖ్య వోవఁగ నమేలసమాఖ్య వరింప రాఁ గనన్. ౧౭౬

---

* బలువంత † జల్లఁగ. ‡ నినున్ నిస్తులసుగుణాంగనవరి—మూ. నినున్...సుగుణాంగనియర్థి హస్తు—అనియుఁ బఠింపవచ్చును.

క. ఆనాయకమణి వక్షో, ధీనముగాఁ జేయఁదివిరితివి నేను దథా
*నూనాకల్ప మొనరుతుఁగ్, మానిని యిక్కార్య మమరు మది సంశయమా.

క. అమ్మా పురుషమణికిఁ బలు,కొమ్మున నిలుపఁగ నీకు రుచి గల్గినఁ జో
క్యమ్మది కుదురఁగ నొకసూ,త్రమ్మతిసూక్ష్మమ్ము గలదు దానిం గొనుమా.

వ. అది యెయ్యది యంటేని. ౧౮౨

చ. దనుజవిభేది లోఁగొనఁగ దానతపోముఖయోగముఖ్యసా
ధనములు పెక్కు గల్గు నని తద్ఘను వేదము పల్కు వానిలోఁ
బనుపడుసాధనంబు దృఢభక్తియ దానిన పూని నీవు న
వ్వనజదళాక్షు ధ్యానమున వశ్యు నవశ్యముఁ జేయఁగాఁ దగుఁగ్. ౧౮౩

సీ. అనుపమానేచనకాంగకంబులవానిఁ దరుణాభ్రసన్నిభతనువువాని
శ్రీవత్సకౌస్తుభశ్రీవిలాసమువాని బాహాచతుష్టయపటిమవానిఁ
దమ్మియింటినెలంత దనరువక్షమువానిఁ బంచాయుధోద్దీర్ణబలమువాని
మేలిమిబంగారుమెఱుపుచేలమువాని భవ్యశేషాహితల్పంబువాని
దివ్యనవరత్నకీలితదివ్యదగ్ర్య, హారకుండలమకుటకేయూరముఖ్య
భూషణోదారరోచులఁ బొలుచువాని, వెన్నుని భజించిసుఖయింపు కన్నతల్లి

గీ. ఇంతి కతిపయదినముల కీసమాధి, నీసమాధిని హరియించు నిజముగాఁగ
మెచ్చి యాఖేటమిషమున వచ్చి నిన్ను, నలకపటయాదవుం డైనహరి వరించు.

శా. సారోదారవనీనివాన మఖిలస్వర్భామినీవారసం
చారస్ఫీతము సేవసజ్జనమనశ్చాంచల్యమాలిన్యసం
హారైకప్రవణంబు యామునతటం బచ్చోట నున్నిస్మిత
స్ఫారాగారమునందు నెచ్చెలులతో స్వామి న్భజింపందగుఁగ్. ౧౮౬

గీ. వనిత కాళిందితీరమె వర్ణ్యమగుచుఁ, దగు నుదాత్తవిభూషణోదారశక్తి
నచట నీవున్న మఱియు మే లమరుఁగాదె, మెల్లయొప్పులకుప్పవు తల్లి నీవు.

గీ. చెలువ కాళిందిమహిమంబు చెప్పఁదరమె, తద్ఘనీలపయఃస్మృతి తనువుసోఁక
మతికి నీలిమ రక్తియు మాని మిగులఁ, దెలుపు కనుపట్టుఁ జిత్రమో కలువకంటి.

క. శ్రుతిగదితమహిమ సర్వ,శ్రుతిభూషణసుగుణ యమున సుమ్మా తద్వి
శ్రుతి పాపహరము గాదే, శ్రుతియుగళనిరుద్ధనయనసుందరవదనా. ౧౮౯

క. హరి†శైశవనవవిస్మయ, కరలీలాజన్మభూమి కాళిందితటం
బరుదా యది ‡భావికయు, గ్వరకవివాక్కులకు మిగులవర్ణ్యము గాఁగ్.

---

* నూనసంకల్ప మొనరితి †శైశవ ‡భావిక-మూ.

ఉ. అమ్మరో కన్నవారి నెడయుం బనివచ్చె నటంచు మానసం
బుమ్మలికం బడంగఁ గడు నొప్పమిగాఁగఁ దలంపవమ్మ నీ
నెమ్మదిఁ బాయఁ జాయ కొక నేరుపు సిక్కునటమ్మ నాదు పా
దమ్ములు నిల్వ నేరవు గదమ్మ భవద్గృహ మొందకుండినన్. ౧౯౧

ఉ. చుక్కలదారిమానికము సొంపులకూఁతురి నిట్లు తేనియల్
చొక్కిపడంగఁ జేయు మృదుసూక్తులు పల్కుచుఁ దత్సమాధిఁ దా
నిక్కముగా నెఱింగి గృహనిర్మితి సేయఁగ దేవవర్ధకిన్
గ్రక్కునఁ బన్పెఁగా నతఁ డఖండనిజాద్భుతకృత్యచాతురిన్. ౧౯౨

సీ. రమణీయనాయకరత్నబంధురంబు నవవిధవస్తువైభవయుతంబు
శ్రీకరాంకాంచత్పతాకాభిరామంబు నురుతుంగశార్ఙ్గపదోజ్జ్వలంబు
దీవ్యత్ప్రపంచసంధిప్రోథిలసితంబు నీహామృగభిదావగాహితంబు
గగనావలంబివాక్యస్ఫూర్తి మహితంబు మధురవాక్కవిజాలమానితంబు
చిత్రసదలంక్రియాగణోజ్జీవితంబు, నద్భుతరసాఢ్యపాత్రంబు నాత్తదోష
పాటనంబునునగుచొప్పి నాటకంబు, క్రియఁ బ్రకాశించునొకదివ్యగృహ మొనర్చె

గీ. అట్టు లగ్గేహ మొనరించి యమరతక్షుఁ, డంబుజాప్తునకెఱిఁగింపనలరి యతఁడు
సమ్ముఖంబునఁ జాయతోఁ జాయ మొనరఁ, గూఁతు రావించి పలికె సాకూతుఁడగుచు

క. రమ్మా శంబరరిపుమా, ఱమ్మా యగ్గేహమునకు నను(ఁ)గుఁజెలులతోఁ
బొమ్మా తపంబు గొను మభ, యమ్మాహరి నీకొసంగు నమ్మా యమ్మా.

ఉ. ఘోరతపంబుచే నధికకోమలవల్లి* యనుంగుఁజట్టమా
నీరుచిరాంగయష్టిఁ గడు నేఁచ మనంబు దయావిహీనమై
మీఱఁగఁ జూచుచుండెదు సుమీ హరియాన సుమీ నెలంత చె
న్నారఁగఁ గన్నవారిపయి నానసుమీ పరికించి చూమమీ. ౧౯౩

క. † మన మొప్పినఁ దను వొప్పదు, తను వొప్పిన నిట్టికష్టదశ నేనొప్పన్
విను మే నొప్పిన నొప్పదు, జననీ నీజనని ప్రేమసంరంభమునన్. ౧౯౪

క. దెప్పరపుఁగార్య మూనిన, నప్పగు కాళిందిమేన నగ్గలమగుఁ గా
కప్పొను టంతరంగము, దప్పని యావిలతతోడఁ దరళమృగాక్షీ. ౧౯౫

గీ. అమలినం బైనమానసం బబ్బెనేని, రాజయోగంబె సర్వకార్యములు దీర్చుఁ
జిత్తసంశుద్ధి లేకున్నఁ జెలువ బాహ్య, బహువిధాయాసచేష్టల ఫలము లేదు.

* అనంగుఁజట్టుమా. † మనవొప్పినఁ-మూ.

ఉ. కావున రాజయోగినివి కమ్ము మదంబ కఠోరకృత్యముల్
భావములోఁ దలంపకుము భాస్వదసంగసదంబుమార్గనో
ద్భావముచే మనోంబుజ ముదస్తరజోమల మై యెసంగ సం
దావనజాక్షు నాత్మవిభు నంచితభృంగముగా రచింపవే. ౨౦౦

క. నాలుగుపురుషార్థములఁ, జాల ఘటింపించునట్టి సాధనములలో
మే లేర్చిరి ధ్యానం బని, నీలాలకి సర్వశాస్త్రనిశ్చయకర్తల్. ౨౦౧

సీ. బహుసంభవార్జితబహుపాతకవ్రాతవిపినమహావహ్ని విష్ణుభక్తి
మానసరాగాదిమాలిన్యపరిహారవిమలాంబుపూరంబు విష్ణుభక్తి
తాపత్రయోదారదావవైశ్వానరవిపులధారావృష్టి విష్ణుభక్తి
చతురర్థనిక్షేపసంపాదనక్రియావిదితాంజనంబు శ్రీవిష్ణుభక్తి
సకలసత్కర్మసాద్గుణ్యసంపదలకు, వేల్పుమొదవులమేల్బంతి విష్ణుభక్తి
సద్గురుకటాక్షసముపాత్తసాధుబోధ, విద్యలకు నెల్ల ఫలము శ్రీవిష్ణుభక్తి.

చ. అరయ నభేద మన్నపలు కానెడు పెద్దలకేని జీవనం
బురుజపహోమయజ్ఞదృఢయోగముఖాఖిలసాధనక్రియో
త్తరసఫలత్వకారణ మఖండపదార్థనిరీక్షణక్షణా
పరనిరపేక్షసాధనము పంజకలోచనభక్తి నందనీ. ౨౦౩

క. అటుగాన భక్తిపూర్వక, పటుతరతద్ధ్యానయోగపాటవ మెసఁగన్
ఘటియిల్లుఁ గామితము వడి, నటమట మని యెన్నఁబోకు మరయునిజముగన్

గీ. అరసి ప్రాగాదిదిగ్వ్యవహారబీజ, మయిన ఱేఁ డిట్లు తనకూఁతు నమరఁ బలికి
కూఁతునెడఁ బాయువగలడగ్గుతికవడఁగ, ననియెఁ దడఁబాటుదోఁప నెయ్యపుఁజెలులకు.

చ. పదమున నర్థమున్ బలెను బాయకయుండెడు బాల గోల యి
మ్ముదిత తపంబు సేయుపని మోయుట మ మ్మెడఁబాయు మీకు మా
కొదవెడు ప్రేమ దీనిపయి నొప్పెడుఁ గావున నప్పగించెదం
బిదప నెలంతలార వలపించిన పెన్మిటి కప్పగించెదన్. ౨౦౫

ఉ. అంతట ఖేదమోదజనితాశ్రులు కోష్ణము లౌచు నేత్రసం
క్రాంతము లైన మంగళము గా దని క్రుక్కుచు స్రుక్కుచు న్రమా
కాంతునిదక్షిణంపుబలుకన్నగువేలుపు బిడ్డహస్త మే
కాంతపుఁబ్రేమఁ గేల నిడు చాదృతిమై నను నీలవేణికిన్. ౨౦౬

ఉ. పెంచినదాన వీవు కదుఁ జెక్కువమీఱఁగ శాస్త్ర మభ్యసిం
పించినదాన వీవు గద పెంపుగ నుత్తమశీలరీతి శి
క్షించినదాన వీవ కద చెప్పఁగ నేమిక నీదె భార మి
క్కాంచనదేహఁ గాచికొనఁ గాంచినవారికి భార మున్న దే. ౨౦౮

గీ. ఈమధురవాచ నెంతేని యింపుమీఱ, వాసిగాఁగ సలక్షణం జేసి తీవ
గానవైదుషి సఫలత గైకొనంగ, మేలుఫలమునఁ గూర్పవే నీలవేణి. ౨౦౯

గీ. నీలవేణితటం బఁట నెలవుకొనఁగ, నీలవేణి భరింపంగ నేర్పరి యఁట
నీలవేణి యిది తపంబు నెఱిఁ గొనునఁట, యేల ఫలసిద్ధి గాకుండు జోలియేల.

వ. అని యనియమిత ప్రేమానుబంధ బంధురం బగు లోకబాంధవుం డు సర్వ
సఖీసమేత యగు నీలవేణీపర్వేందుముఖికి నప్పగించి ఛాయామిళితుం డగు
తనకుం బ్రణమిల్లిన శ్రీవల్లభుం బ్రాణవల్లభుఁ గాఁ గొను మని యుల్లంబు
పల్లవింప దీవించి గ్రుచ్చి యెత్తి గుత్తపుఁ గౌఁగిటం జేర్చి కార్యభారంబు
త్వరపడుప నత్తరళాక్షిఁ దరలం బంచిన. ౨౧౧

క. మగువ దివినుండి భూమికి, దిగిరా నవ్వేళ మేనుదీఁగియ చూడన్
గగనతలఘర్షణోపల, నిగనిగితస్వర్ణరేఖ నీటు వహించెన్. ౨౧౨

ఉ. వచ్చెను మచ్చెకంటి నెఱవాదిసఖీజను లంటిరాఁగ వై
యచ్చరవీథినుండి ధర కర్యమసూతి సరిత్ప్రవాహ భరం
బిచ్చ నవాంబుదం బిడి యహీనమహాసితరోచి యంచుఁ దా
మెచ్చుచు దాయవచ్చు జిగిమించు చొకాటపుమించుకైవడిన్. ౨౧౩

ఉ. వచ్చి గృహంబు సొచ్చి పితృవాక్యనివేదితకార్యసాధనా
కచ్చరమార్గరీతిఁ గొని కాంత రమాధిపుఁ గొల్చుచుండెఁ దా
నొచ్చెము లేనిభక్తి విమలోజ్జ్వలమానసపద్మసీమయం
దిచ్చ బహిఃపదార్థముల నెంతయు రోయ నజస్రభావనన్. ౨౧౪

క. అకలంకయోగిమానస, సుకరామితదివ్యరూప శోభితనిష్ఠా
తుకదయమానకటాక్షా, నికటచరత్కకుబధీశనిర్జరవారా. ౨౧౫

గద్యము-ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరిమాధవ
యజ్వ సముజ్జ్వలత్కృపాపోషితకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టార
కాహోబలపత్యాహ్వాయకవిమహోపాధ్యాయభట్టారకప్రణీతం బైనకాళిం
దీకన్యాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

ప్రథమభాగము సమాప్తము.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య—౨౨

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

—। ద్వితీయభాగము ।—



అహోబలపతిపండితప్రణీతము.

(పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము)

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

1929.

వెల 0·75 N·P·S

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగపీఠిక.

---

ఈమహాప్రబంధమునకుఁ గర్త యగునహోబలపతి జన్మదేశాదు లగు సామాన్యవిషయములం గూర్చి ప్రథమభాగపీఠికలో ముచ్చటించితిని. ఇంక నిప్పు డిందుఁ గలవిశేషములను వివరించెదను ఈభాగమున ౪-౫-౬. ఆశ్వాసములు గలవు. అందు నాల్గవయాశ్వాసమున నాముక్తమాల్యదాది కాంధ్రప్రబంధరత్నములందువలెను గిరాతార్జునీయాది సంస్కృతకావ్యములందు వలెను ఋతువర్ణనము మంచిమంచి కల్పనలతోను గొప్పగొప్ప భావములతోను జేయంబడినది. చూడుఁడు:—

### ♦ వసంతవర్ణనము ♦

సీ. నిఖిలాగమాంతనిర్ణిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిమాపుల కింపైనఫలములు చేకూర్పఁగలుగువాఁడు
బలుజడిచేనైనయలజడి సహియించుమహానుల మధురోక్తి మనుచువాఁడు
తేలిపువ్వునీటిచే దేహయాత్ర ఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌష్ఠవైక, మూలకారణ మైనట్టి మేలువాఁడు
మాధవుఁడువచ్చెనవ్వేళ మధురలీల, వనరమాంగన యామోదమున వెలంగ.
సీ. పంజరగృహాలలోపల నున్కి గైకొని శర్కర మెక్కెడు జంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబుగానక గాసిల్లు మూసిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే నర్తిల్లు పరహంసవారములను
నలరునీ రక్కడ నక్కడఁ ద్రావుచు వసియించుచాతకవ్రాతములను
సత్ప్రతిగ్రహలాభంబు సంభవిల్ల, నురుతరామోద మందెడు యోగితతుల
మన్ననగొనవచ్చెఁదావచ్చిమాధవుండు, కామితార్థంబులవ్వారి గాఁగనిచ్చి.
ఇందలిశ్లేషవిశేష మెంతచక్కనిదో!

### —♦ గ్రీష్మర్తువర్ణనము ♦—

గీ. కూటిపేదఱికంబు గైకొనిరి మిగుల, నాతరము చేత బ్రతికెడునట్టివారు
ఖననమొనరించితనుయాత్రగడపువారు, కూలిగలుగుటనవ్వేళగూటఁబడిరి.

క. కూటికిరుచి పాన మొందెడు, బోటిగ్లెను నీళ్ల నుష్ణ పవనంబునకుం
   జేటి సురతములకూరిమి, గాటపుటుపగూహనములఁ గదలక నిలిచెన్. 32

ఈరెంటియందును స్వభావోక్తి చక్కఁగ వర్ణింపఁబడినది.

క. పడమటికిసెక నుడుకఁగఁబసి, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాజంగాఁ
   గుడికరమునందు నిలిపిరి, కడుఁబూతం బనుచు వానిఁ గర్మారంభుల్. 33

ఇం దాచారసంప్రదాయము కలదు.

## —♦ వర్షర్తువర్ణనము ♦—

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానర రక్షయేకార్యసర్వస్వ మయ్యె
   భోగికైనను రాత్రిభోజనం బెచ్చట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
   సౌరమంత్రోపాస్తిచతురుల కశనంబు వార్తగల్గుట గానివావి యయ్యెఁ
   బ్రతిగృహంబున కేగి ప్రార్థింపఁ (బ్రార్థింప) శిఖినొకింతొసఁగినఁ జిత్రమయ్యె
   జంబుగూశలకలుషులు డంబుమిగిలెఁ, గతకసంపాదనంబులుఘనతగాంచె
   నన్నదాతను నేనియు నతిథి కొకసికైన నన్నంబు గల దనుటరిదియయ్యె.

ఇది యాముక్తమాల్యదఛాయ—

   "ఇల్లిల్లుఁ దిరుగ నొక్కింతబ్బు శిఖ; యబ్బెనేనింటిలోఁ బూని యుడికినసరి
   రాఁజదు; రాఁజిన రవులుకో ల్వాపాలఁ గాని కల్గదు; నూనె దొరఁగలిగి
   నేని కూడగుట మంటైనఁ బెన్బొగ సుఖభుక్తి సేకూర; దాభుక్తి కడిఁది
   భాగోక్తులకతీలు బహుజనాన్నము; దీప నారులకొదవ్వఁ బుటకిడ్ర యన్న
   మాజ్యపయముఖ్యలయు మెన్న; రాలయాంగ
   దానులయు మెన్న రంతికః కాంచనక
   పచన నాంధోగృహిణి రామిఁ బడుక మనఁగ
   వెడనెడనె యార్వ నొసిలి రజ్జడిని గృహులు.

ఉ. కాలువలెల్ల బల్లదులకై వడిఁ గాంచె నదీలలామముల్
   గేలిగొనవర్షఁగాఁ గడఁగెఁ గేనల మబ్బి వకెందు నీరమా
   త్రాలయుఁడైనఁ దావికృతినందక యుండు వికార సేతువుల్
   చాల మెలంగినన్ వికృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్.

ఇందలి యర్థాంతరన్యాసము మహాకవికాళిదాసుని కుమారసంభవములోని "వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః" అను
[illegible]

కవు లిట్టి మనోహరము లగుకల్పనలను భావములను . బద్యభాగాదు లను దత్తద్భావతత్పరులై యనుకరించుచుందురు. దానిని నసమర్థతచేఁ జేసిన గ్రంథచౌర్య మనరాదు.

—♦ శరదృతువర్ణనము ♦—

క. జీవన మంతయు లోకో,జ్జీవనమున కిడుటఁ గార్యసిద్ధి వడసి మై
కేవలపలితంబుగఁ దాఁ,బోవదె ఘనపాళి యుక్షపుంగవు దిశకున్. ౧౧౭

ఇందు భారతీయులకుఁ బరమపురుషార్థసాధన మగు మహాప్రస్థానము సూచితము.

—♦ హేమంతఋతువర్ణనము ♦—

ఉ. తమ్ములదాయ మేల్గనఁగఁ జాలక తమ్ములనేచ మంచుచి
చ్చు మ్మరియాద విరాజి నడఁచొన్పఁగఁ దమ్ములతోడ నాక్మస
ఖ్యమ్ము భరించు కల్వలును గాఱిమఁజెందెను మిత్రివర్గమూ
లమ్ము నెఱుంగఁ డయ్యె నుచితస్థితిఁ గాంచ జడుండు నేర్చునే. ౧౧౮

ఇందలి యర్థాంతరన్యాసము సర్వకాలములందును సర్వజనులకు ననుభవసిద్ధమైనది.

—♦ శిశిరఋతువర్ణనము ♦—

ఉ శీతముచేత బాధపడు చిత్రి జగంబు భరింపఁగా జగ
త్ప్రీత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జంతురినేగు మన్నిటలచంచనచంచలదృష్టి కించిను
స్మితము చేసెఁ గానలయు నెమ్మిఘటిల్ల హరించుశీతమున్. ౧౧౯

ఇందలిస్వభావ మెంతబాగుగనున్నదో! మఱియు నీభావము, "బ్రహ్మ స్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరమ్, సాయంకాలే సదా విష్ణుః త్రిమూర్తిశ్చ దివాకరః" అను శ్లోకభావమూలకము.

క. అప్పప్ప యేరికైనను, జెప్పంగాశక్యమౌనె శీతము మహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్. ౧౨౦

చూచితిరా యతిశయోక్తి మహిమ!

(2) పంచమాశ్వాసమున– శ్రీకృష్ణుఁడు ధర్మరాజును జూడఁబోయి · యర్జునునితోఁ గలిసి యమునానదీతీరమునకు వేఁట కేగి యటఁ దనకై తపము చేయుచున్న కాళిందిం జూచి యామెను దనపురమునకుఁ దీసికొనిపోయి వివా

హము చేసికొనియె సనుకథ సహృదయ హృదయాహ్లాదకమునైన సనగం భీరకల్పనావిశేషముగల నాటయాఱువది గద్యపద్యములతోఁ జక్కఁగ వర్ణింపఁ బడినది. చిత్తగింపుఁడు.

ఇంద్రప్రస్థనగరనాసందర్భమున నీవిద్వత్కవి తనకుఁ బరిపూర్ణప్రజ్ఞగల యష్టభాషావిశేషము నెట్లు చూపెనో.

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు సాధ్యసిద్ధవచోవిచారితంబు
ప్రాకృసేనాధార తారుచిమంతంబు వ్యత్యయకార్యోపపత్యనుగత
మనుస్మృతభవికలాపాయోగసిద్ధంబు శేషోపహతదృష్టప్రఖ్యతంబు
అన్యథాభావపరిహాణనిరూఢంబు సర్వాంగరూపపరిశస్తమహిమ
మైవిరాజిల్లు నష్టభాషావిశేష, సముదయస్ఫూర్తి హాసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందముగఁగాంచె సద్వ్రజంబు.

ధర్మజునిభక్తిగౌరవము లెట్లు చిత్రించెనో చూడుఁడు—

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీపదాబ్జభక్తి చేకొని నిలిచినాఁడ, నితిగము నెఱుంగఁగద యిట నీవెసాక్షి.

గీ. తమము హరియించి వస్తుతత్త్వంబుఁ దెలుప, నీవకాకన్య దేవత నేర్పుగనదు
దురితసంహారజగతి ఖద్యోతముసిమము, దొంతరు నేరీతిఁ దలఁపఖద్యోతమునకు.

ఈవిద్వత్కవి తన శాస్త్రీయజ్ఞానమును 17 వ పద్యముచేఁ గాళిందీతీరకాంతారమును మీమాంసా తర్కవ్యాకరణచ్ఛందోలంకార భరతశాస్త్రములతోను బాహ్యకృతత్రిలింగభాషలతోను నుత్తమకావ్యంబులతోను పోల్చి చూపెను. శ్రీకృష్ణుని వివాహసందర్భమును 73వ పద్యములో నాసన్నిహ్మమును నిరూపించెను.

"మంచిభోజనము" అను 140 పద్యమున హాస్యరసలసము.

"పగలుగావించు" నను 155 పద్యములో నన్నరింతలలోఁ బిల్లలు పెద్దలం దున్నగుణము గ్రహియింపవలయును గాని పెద్దలందు దోషమున్నను గ్రహింపరా దనునీతి చక్కఁగా బోధింపఁబడినది.

(౩) ఇఁక షష్ఠాశ్వాసము.

ఇందుఁ గాళిందీకృష్ణుల సరసనల్లాపములు వర్ణింపఁబడినవి. కాని నాగరకులకు వెగటుగల్గించు మోటువర్ణనము లెందును లేవు. ఇంతియేకాదు కేవలశృంగారప్రధానము లగుపట్టులందుఁ గూడ నీవిద్వత్కవి యావిషయమును

దనశ్లేషమహిమచేఁ గావ్యముతోను శాస్త్రములతోను నాగమములతోను సంస్కృతప్రాకృతాంధ్రభాషలతోను మూలప్రకృతి (అవిద్య)తోను బ్రహ్మముతోను బోల్చి చదువరుల కానందములం దనాదిపరమసిద్ధాంతముల నాటెను. వీనికిఁ బూర్వభాగమునందుఁగూడఁ జాల నుదాహరణములు గలవు.

41 వ "కామితమేమియున్" అనుపద్యములో "సర్వత్ర జయ మన్విచ్ఛేత్పుత్రా దిచ్ఛే త్పరాజయం" మ్మనుదాసభావము గలదు.

"హృదయగంధి" యను 42 వ పద్యములో "భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః, తస్మిన్ దృష్టే పరావరే" అను నుపనిషత్సారము సిసి

"నేరుపుమీఱ" అను 49 వ పద్యములో శృంగారరసము వలపను సంప్రదాయము తెలియఁజేయఁబడినది.

56 క్రొమ్ముడి యుత్తమనిబంధము (కావ్యము)

60 కబరి యుత్తమకావ్యముం బోలును.

శ్లో. ద్విస్త్రిరాహితంపుటాకృతిం దేజరిల్లి, ప్రాకృతాఖ్యైకభాషనాభావితన్వ
దేవస్థితిరిగలిగిత్రిలింగ దేశ, మగాక్ష్యమనొప్పఁగస్తూరిచుక్కబొట్టు. 57

ఇందుఁ గస్తూరి చుక్కబొట్టు ప్రాకృతత్రిలింగభాషలవలె నున్నది.

70 చన్నుఁబంచందురుఁజూచిన నీలాపనిందవచ్చెను.

86 కార్యసాధనవిధానము మంచి దను నీతి బోధింపఁబడినది.

90 "వనిత యరగన్ను" అనుదానిలోఁ దపము (నిరంతరదీక్ష) బనిమిని గార్యసిద్ధిని గలిగించు నను నుత్తమసిద్ధాంతము.

97 "వాగ్భూషణంభూషణం" అనుదాని యభిప్రాయము.

113 లజ్జ నవిద్యతోఁ బోల్చి గురూపదేశమున నవిద్య నశించు నను మహాభావము స్ఫురింపఁజేసెను.

124 "సాంజనాత్రి"—ఇందుశబ్దచిత్ర మయిన యమకము.

138 "బ్రహ్మ మనవొప్పు"—అద్వైతసిద్ధాంతము. సూచితిరా శ్లేషమహిమ! అతిశృంగారములోనుండి మహావేదాంతమునకుఁ గొనిపోయినది.

145 "గరితబింబోష్ఠి"—ఇందుఁ గల్పనావిశేషము.

151 "మృదుపదమై"—282 "సుప్రసాదత"-ఇందు రసావహమైనచో దోషము గూడ గుణమగు నను కవిభావము తోఁచుచున్నది.

163, 236 గగనకుసుమము—అప్రసిద్ధ మని తార్కికుల సంప్రదాయము.

174 "పయోధరమండలము" అను శ్లేషరూపక మహిమచే వర్షాకాలము ప్రత్యక్ష మగుచున్నది.

176 త్రివేణీస్నానమున ననంత సౌఖ్యములు గలుగు నను పౌరాణికవాదము.

188 తపముచే నణిమాదిసిద్ధులు గలుగును.

191 ఆత్మస్వరూపమును జైలవ ఋచు విధాన మతినిపుణముగా నిరూపింపఁబడెను.

197 గురుశుశ్రూష పరమసుఖంబు.

202 రూపకమహిమ మిందుఁ గలదు.

223 ఈపద్యమునందు (అహీంభయము) స్వపక్షభయము గలరాజు రాజ్యము క్షీణించు నని చూపఁబడినది.

229 బ్రహ్మాత్మైక్యము.

230 భగవంతుఁడు సర్వదృష్టి.

241 భగవంతుని దర్శన మైనపుడు సర్వహృదయగ్రంథులు వీడిపోవును.

270 ఈగద్యము ప్రథమాశ్వాసములోని "వెంసీయుజగజ్జన్మాది" అను పెద్దగద్యమువంటిది. ఒకవిశేషము—అం దర్థాలంకారములే గలవు. ఇందుఁ గొన్ని శబ్దాలంకారములును గలవు. కుండలిబంధము, నాగపద్మబంధము, మాలికా బంధము నిట్లు "నానాలంకారలీలామహాస్పదంబై తనరు."

మోక్షమునీఁద నీమహాప్రబంధమున శృంగారరసము ప్రధానము. మిగిలినవి యంగములుగా నక్కడక్కడ నౌచిత్యానుసారముగా నిరూపింపఁబడినవి. కదలీపాకము ప్రాయికము. అక్కడక్కడ నారికేళపాకము గూడఁ గలదు. శైలి లక్షణలక్షితము. గుణాలంకారము లత్యంతమనోహరములు. రీతివృత్తులు రసానుగుణంబులు. భావంబు లతిగంభీరంబులు. అనర్గళ మగుకవితాధార. దానికిం బదిరెట్లు వేదవేదాంత సంస్కృతప్రాకృతాంధ్ర వ్యాకరణ తర్కమీమాంసాలంకారాది సకలశాస్త్రసర్వతోముఖపాండిత్యమహిమ. దానికి నూఱురెట్లు శ్లేషచమత్కారము. విద్వత్కవి రచించిన యీమహాకావ్యమునందలి భావములు సుబోధము లగుటకు విపుల మగు వ్యాఖ్యాన మపేక్షణీయము. మన యాంధ్రసాహిత్యపరిషత్తువారు తగిన యత్న మొనరించి వ్యాఖ్యానము చేయించి ప్రకటింపఁ గడంగెదరు గాక! మూలమూలల నున్నయిట్టి

మహాగ్రంథములను సంపాదించి ప్రకటించి కవులకీర్తులను చిరస్థాయులుగాఁ జేయుచున్న యీపరిషత్తువారికి జగత్కారణం బైన శివకేశవాది నామములచే భావింపఁబడు పరబ్రహ్మము దీర్ఘాయురారోగ్యైశ్వర్యజ్ఞానసంపదభివృద్ధులను జగదుపకారకకృత్యనిరంతరదీక్షాదక్షతల నిచ్చుఁగాక !

గీ. చిలుకపలుకులు చెవులకుఁ జెలువుగొలుపు
    నట్లు దక్షిణవాక్యము లాత్మసృష్టి
    నందఁజేసెను శ్రీసు నారాయణాఖ్య
    ముదముగన లోకబుధులు ప్రమోదిగాప!

ప్రమోదదక్షిణాయనము, } శ్రీపాదపావయ్యశాస్త్రి.
పిఠాపురము, } శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థాన
పండితుఁడు.

# కాళిందీకన్యాపరిణయము

## ద్వితీయభాగము.

వి ష య సూ చి క.  పుటలు.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

---

### —చతుర్థాశ్వాసము—

క. శ్రీమద్భార్గవరామవి, రామశరస్తోమధామ రమ్యభుజబలో
ద్దామాభిరామ నుతసు,త్రామా సాకేతధామ దశరథరామా.

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము

### —♦ వసంతర్తువర్ణనము ♦—

క. అంతట విమలశ్రీరత, సంతతసుమనఃకదంబకంజీవనతం
త్రాంతై సురభికి మిక్కిలి, వింతై *యేతెంచె సురభి విరహులు †బెగడన్.

గీ. ఉదయరాగచ్ఛదంబు మైనూని కొనఁగఁ, దలఁచి వనలక్ష్మిజీర్ణచ్ఛదంబు విడిచె
మాధవుసిరాక కని వృక్షమండలంబు, దాల్పఁగనుబట్టుజీర్ణచ్ఛదంబు‡గాలె.

సీ. నిఖిలాగమాంతనిర్ణిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే §నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజినాప్తుల కింపైనఫలములు చేకూర్పఁ గలుగువాఁడు
బలుజడిచే నైనయలజడి సహియించు ఘనుల మధుకోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేహయాత్ర ఘటించు మధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోసరంతరసౌష్ఠవైక, మూలకారణమైనట్టి మేలువాఁడు
మాధవుఁడు వచ్చె నవ్వేళ మధురలీల, వనవమాంగన యామోదమున మెలంగ

సీ. తనదు దక్షిణజగత్ప్రాణున కేవేళఁ జెఱఁమాన్యగుణంబు సేయుకతన
నతిరక్తపల్లవప్రతతి వర్ధిలఁజేయు నభ్యుదయంబుచే నడచుకతన
నఖిలనిస్సంగుల నాయాసపడఁజేయు నీలదేహుల కుక్షి నేర్పుకతన
సురుచిరాకృతి జాతిసుమనోవిలాసంబు కొదవకు నొడిగట్టుకొన్నకతన
నవప్రసాదత కాటపట్టైనకతన, నధికసాంద్రరజోవ్యాప్తి నందుకతనఁ
గలుగునయశోవితానంబుకరణిగనుచు, నళులు చరియించునామునినాళిగొనుచు.

చ. అలములచే జగద్విజయ మందె మరుం డన యుక్తిభూమమం
గలుగును లక్ష్యమన్న నది గాదు జగజ్జయసాధనంబులై
వెలఁగెడు చాపబాణములు మేలుగ నిర్మితిచేసి మాధవుం
డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు ననంగ లక్ష్మమా. ౭

*న్యేతెంచు-మూ. †పొగడన్-మూ. ‡నోతె? §నెగడువాఁడు-అనుటమంచిది.

మ. ధరఁ బాదంబులు నాటి మాఱ్ఱిపుడుచు వంధ్యత్వంబు వోఁగొట్టఁ జే
త్తురు రాజు ల్కడు మాధవుం గొలువఁగా దద్వంధ్యశోత్పాదన
స్ఫురణోద్యత్ప్రసవాభిరామఫలసంభూతుల్ ఘటింపించు త
త్కర(ర)దత్తాయునమంత్రితాక్షత లనం గానంగనయ్యె న్వనల్. ౯

క. ఫలగర్భితగొను లతికా, కలకంఠకుసుమగుచ్ఛఘనవక్షోజం
బుల మిగుల నొప్పు గైకొను, నలినోచిశ్యామనామ కాంచిరోచుల్. ౧౦

గీ. పంబురసమునసుమనఃకదంబకంబు, కాలగతి (?) దువుపకాంతలఁ జాలఁ గూర్చె
దత్సమాగూఢమైనపాతకముకతన, విరిసెఁగాఁబోలు ననసద్విరియుచుండె ౧౧

చ. అరయఁగఁ బుష్పవత్యభిధ నంటి రజోవతు లన్న పేరిచేఁ
బరఁగు లతాంగులయభంగురసంగతిఁ బొంగి సమ్మద
స్ఫురితసినాదము ల్గొనుట చోద్యమె మత్తమధువ్రతాళికిం
గర మురమైన యవ్వ్రజినకాళిమ మేనున నంటఁ బట్టెనే. ౧౨

క. గిఱికపడి కొనలు సాఁగక, గొబ్బులులతాంగనలఁ బెంచి గొబ్బుగఁ బుష్పం
బటఁ బుష్పమొగ్గగుబ్బలు, వటిల ఫలం బెసఁగఁ జేసె వలపుబరితు వోసిన్. ౧౩

క. మాధవవిభవముఁ జెల్పుచు, సాధుకవిప్రీతి యొసఁగు సర్వాగమముల్
మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతిదములు సర్వాగమముల్. ౧౪

క. మును వృద్ధికి ఘనులొసఁగిన ఘనఋణ మొగిఁదీర్పఁ దలఁచుకప్రసుమపుటం
బునఁ బొదిగి ఋణముఁ దీర్చెను, గనదళిదంభంబు దాల్చి ఘనసాలకన్. ౧౫

గీ. బంధురము లైనయులవనస్పతుల కెల్ల, సౌమనస్యంబు విఘటిల్ల భూమిజాత
భానమాకులపాతకౌండఁబరఁగు*దుర్యశంబు గానటను నుపగ్రిజంబుమిగిలె. ౧౬

చ. వరవనమాలికాకలితవాసన లూనుచు మాధవీయనో
హరరుచి కాస్పదం బగుచు నాత్తసుహాగముఁడై కుజాతివి
స్ఫురణము మాన వర్తిలుచు భూరికవిప్రజమాననీయుఁడై
పరఁగెను మాధవుం డపుడు ధన్యఘనాకృతి మాధవాకృతిన్. ౧౭

గీ. యోగుల భరించి యగిచక్రియుక్తి మించి, భోగిసంసేవితాకృతిస్ఫూర్తిఁ గాంచి
మాధవుఁడు మాధవుండగు నని దలంప, నలరుపాంసులతా గుణంబరుదు గాని ౧౮

సీ. పంజరగృహాలలోపల నుస్కఁ గైకొని శర్కర మెక్కు దుజంతువితతి
నతివృష్టి కోరిచి యాశనంబు గానక గాసిల్లు పానిసంఘాతములను
సరసులలో నుండి జలవాసస్మృతిచే వర్తిల్లు వరహంసవారములను
నిలుకనీ రక్కడనక్కడఁ దాఁపుచు వసియించు చేతనవ్రాతములను

*దుర్యశంబనా—వరూ.

సత్పరిగ్రహలాభంబు సంభవిల్ల, సుకృతరామోద మొందెడు యోగితతుల
మన్నన యొనర్పఁ దావచ్చి మాధవుండు, కామితార్థంబులవ్వారికొఁగనిచ్చి ౧౮
గీ. దీర్ఘవిశ్రుతశబ్దవృత్తిప్రకాశ, మాశ్రితాంచితమాధుర్య మధిగతప్ర
సాదమైయొప్పెనపుడువసంతఋతువు, మహితకావ్యప్రకాశకృన్మతమువోలె ౧౯
క. పల్లవపేశలశయ్యా, వేల్లద్రీఁగొలకుఁ దనిసి వినుతధ్వనులం
బెల్లనయుచుఁ బుంస్కోకిల, తల్లజులు వసంత వేళఁ దనరిరి మిగులన్. ౨౦
చ. తెలివిపుపునీటివర్షము లుదీర్ణములై కొనసాగ నత్తఱిన్
మలయజగంధి చెచ్చెఱఁ బుష్పితసుమారము లెల్లెడల న్నిరంతరా
కలనవహించి దట్టమయి కానఁగనయ్యె వియోగదూరతం
గలఁగెను దంపతిప్రతతి గాంచుమహోష్మపుటూర్పుగాడ్పులున్. ౨౧
సీ. ఉవిదపుక్కిటసుర యుమిసిన నొక్కఁడు తరువు పాదాబ్జఘాతమున నొకటి
చెట్టు, వేఱొక్కటి తిట్టుచు జూసిన హర్షమోదసంపద నంది నెలయ
ముద్దుల నగవుల మురిపెంపుఁబాటలఁ గౌఁగిలింతలఁ బ్రేమఁ గనుఁగొనుటల
నడుగుట నూర్పుట హస్తసంస్పర్శలఁ గొన్ని మహీజముల్ చెన్నుగాని యొ
నవనియందు నచేతనతానుభూతి, గనిస్రమాఁకులు కామినీఘటితగౌర
వావమానంబులొకటిగానలరసిను, లలసు తెంతయు హర్షింతయతివపొంత ౨౨.
గీ. చెలువుమీఱినయవ్వేళఁ జిత్ర, మొదవ, నెమ్మిగైకొని మెలఁగెను నెమ్మిరోదలు
నెపుడుఁ బాయని వైజాత్యమిరవుకొన్న, యట్టివయ్యును సాజాత్యమాశ్రయించె.
సీ. అరసానుభూతుల సరసానుభూతులై మెలఁగుచుండఁగఁజేయు మేలుశక్తి
లేఁగొమ్మపొందులు లేకయుండెడువానిఁ దద్వృత్తిసందింపఁ దనరునేర్పుఁ
బ్రసవవాసన లేక బడలుచుండెడువానిఁ బ్రసవాప్తిసమరించు ప్రబలమహిమ
పల్కులింపులు మీఱఁ బలుకనేరనివానిఁ బలుకదిద్దినయట్టి పాటవంబుఁ
గలిగినవయోగిజనములఁగడుముదమున, నెనయఁజేయువసంతయోగీంద్రుఁగన్న
యోగరహితజనంబులయుల్లములను, బెల్లువర్తిల్లకుండునె పల్లటములు
క. సురభీరయమార్గచరా, స్థిగమాశస సమ్మదశ్రుతే ర్భవతి కుహూ
పరిహర్తా నేత్యేవం, పరవాక్కుల నవిరళముగఁ బలుకుం బికముల్. (?) ౨౪
ఉ. పంకజకోశపుష్పపుటభాసిమిళిందవిలాసవాసమై
యుంపురసూచికావినిహతాహితమండలజీవితంబునై
శంకిలఁజేయు నాభరతశాస్త్రము నామని దానిజూడఁగా
సంకురమూను మోదభర మన్యనిరీక్షణఁ గల్గ నేర్చునే ౨౫

## — గ్రీష్మఋతువర్ణనము —

క. అంతట వేసవి దోఁచె దు, రంతమహోష్మానుగతనిరంతరమిత్త్ర
దంతాభ్యర్హితమతద్రు, ప్రాంతమరీచినిమాలికాశాంతంబై. ౨౭

క. వరసుమనోజీవిత మగు, సురభిం బఱపంగ భువనశోషకతిగ్మా
కరదనుజుఁడు వడిగఁ దదా కరవిపినంబులను మిగులఁ గాఁక దహించెన్. ౨౮

క. ఆయెడ దక్షిణదిగ్భవ. వాయుపదత్రియికి నెవ్వ వదనాలయవి
గ్యాయువు సపాదసప్తా, ధ్యాయి యనం దగు నటంచు నడచు న్మృదువుల్. ౨౯

మ. ప్రతికూలుం డగుచంద్రుఁ గూడి విరహివ్రాతంబు నేఁచంగనో
యతిగాఢచ్ఛదశాఖలా వనుల ధ్వాంతారాతి డావంగనో
యతిశోషోగ్రత నవ్వసంతుపయిఁ దా నంటెం జుమీ నాఁ బడా
హాతి ఘోరోష్మత లోకబాంధవునియం దాహాఘమై వర్తిలెన్. ౩౦

మ. సతవాహంబులు మచ్చరం బొదవఁగా సప్తాశ్వము న్వేంక స
వ్రిటిమం బొ రథమూర్చ వంతిడఁగ నాభానంబుచే శీఘ్రవ్రం
గతి నయ్యశ్వము గాంచ రేమి జడిమం గాంచెం బ్రియూగాంబు భా
పతికిన్ నా దివసంబు లాయతము లై పాటిల్లె నవ్వేసవిన్. ౩౧

సీ. నాడగు దాహాగుణంబు కారణగుణప్రాప్తంబుగా జగత్త్రాణదాహ
సక్తిసంపత్తికి సంశయింపఁ బనేమి నీచుఁ డొక్కఁడు గంధనిలయగోత్రి
మంది తద్గర్వంబుఁ జెంది స్వధర్మంబు విడిచిన నేఁ బోవ విడుతు నెట్లు
జడతఁ గైకొనుట నే జలముతో మైత్రికిఁ జొరఁజిచ్చుహారియింతుశరధిఁజొచ్చి
యనుచుఁబశ్చిమజలనిధియందు మెలఁగు, శీకరాటోపబడబాగ్ని వెడలెనఁగ
నఖిలజనములు భీతి నిట్టట్టు గాఁగఁ, బట్టుచాలక వడమటివెట్ట దోఁచె. ౩౨

క. పృద్ధమి విరియంగఁ గొలుకుల, తడికొలఁకులతనుల కోడఁ దరలఁగ జంతుల్
కడు బడలి నీళ్ళగాళ్ళం, బడిగొంతులుదడుప మందు(?)పడమరసాగెన్ ౩౩

సీ. బలిసెను బహుదూరపదవి ప్రపలతోడ భూరిసరిన్మధ్యపులినవితతి
యెండసాగెను మార్గగేహతకూపంబు లమ్మితపాంథాళికంఠములతోడ
దీర్ఘత గైకొనె దినములు మఱిమఱి యతిదృఢజలరజ్జుతతులతోడ
మించెను మిశ్రప్రపలాంచదగ్నిశిఖాళి చటులదవానలచ్ఛటలతోడ
సంతతాన్నప్రదాతకు సాధుకర్మ, శీలునకు నీళ్ళ వలసలుసేయువలసె
నతులపశువృద్ధి గలిగినయట్టివాని, కైన సర్గాంబు వబ్బుట యరిదియయ్యె ౩౪

